# A DESCRIPTIVE CATALOGUE

OF THE

# TELUGU MANUSCRIPTS

IN THE

## GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY, MADRAS


BY

VIDYĀSĀGARA VIDYĀVĀCASPATI

P. P. SUBRAHMANYA SASTRI

B.A. (Oxon), M.A. (Madras)

*Curator, Government Oriental Manuscripts Library and Professor of Sanskrit and Comparative Philology, Presidency College, Madras*


*(Prepared under the orders of the Government of Madras)*

---

**VOLUME VIII—Yaksaganams and Dandakams**

**(Nos. 1834—2040)**

---


MADRAS

PRINTED BY THE SUPERINTENDENT

GOVERNMENT PRESS.

1940

# INTRODUCTION.

The eighth volume of the Descriptive Catalogue of Telugu Manuscripts is prepared on the same plan as that of the first seven volumes. The numbering and pagination of this volume are in continuation of the seventh volume and it contains descriptive notices of Yakṣagānams and Daṇḍakams. Among the four types of Telugu poetic composition, namely, Āśu, Madhura, Citra and Vistāra, Yakṣagānams are classed under the Madhura type. This class of literature is a sort of indigenous drama which was produced mostly for the entertainment of the masses, in popular style, language and sentiment and was traditionally handed down from mouth to mouth. These pieces were committed to writing only during recent times.

It appears probable that Kuravañjis had their origin in the dances, characteristic of the hill tribes. Some of the sacred places of pilgrimage being situated in the midst of forests and on hill tops, people from towns and villages temporarily came into contact with the hill tribes, on festival occasions. The native tribes of these places took these opportunities to present their dances and music and receive gifts from the pilgrims. The people acquired these gradually or imitated them after they returned home. This was done, of course, in a civilized fashion and the poets supplied the subject matter for this type of dance with refined music.

As time advanced, the villagers began to act the roles of Yakṣas and Gandharvas with music and thus the name Yakṣagānam came into vogue. Poet Śrīnātha (1370—1450 A.D.) states that these were sung by the Devadāsis at festival times and that the Devadāsis dressed themselves suitable to the role they were playing. At a later time, these developed into the regular village dramas, the most famous actors of this type being the Brahmins of Kūcipūḍi, Guntur district. They were called Kūcipūḍi Bhāgavatulu.

In earlier days, the prominent themes were about Lakṣmi and Narasimha, and Parvati and Siva, all as foresters and the story of Kṛṣṇa bringing Pārijāta from Heaven for Bhāma (Satyabhāma). Later on portions of Rāmāyaṇa, Mahābhārata and Bhāgavata were reduced to Yakṣagānams and enacted.

The Daṇḍakam is a sort of continuous (daṇḍa) short poetic composition with a Sanskritic metre. One is reminded of the Śyāmalā Daṇḍaka in Sanskrit attributed to Kālidāsa. This type of composition is mainly devotional, more useful for recitation for oneself, in the presence of the images of God than to be read or exhibited for others. The Daṇḍaka praising Hanuman is the most popular in the Telugu country and the Daṇḍakas on Rāmā and Kṛṣṇa are also noteworthy. This composition has also been employed by Telugu poets in the Purāṇas and Prabhandas from 11th century onwards.

Attention is drawn below to some of the important works among Yakṣagānams and Daṇḍakams published in this volume :—

Kirātārjunīyamu (D. No. 1849), Kṛṣṇavilāsamu (D. No. 1863), Gurunambicarita (D. No. 1870), Prabhāvatipradyumnamu (D. No. 1910), and Mṛtyuñjayavilāsamu (D. No. 1921) are famous for their chaste and idiomatic language. The stories in these are very attractive.

Kuravañji (D. No. 1852), by Sannidhānamu Jagannātha Kavi is noteworthy for the popular style in which it is composed.

Naukācaritra (D. No. 1896) is written by the famous South Indian musician and devotee Tyāgarāju.

Of the Daṇḍakams the following are historically noteworthy :—Bṛhannāyakadaṇḍakamu (D. No. 1992), Vidyāvatīdaṇḍakamu (D. No. 2014), Siddheśvara Daṇḍakamu (D. No. 2029), and Devīdaṇḍakamu (D. No. 1985).

P. P. SUBRAHMANYA SASTRI,
*Curator, Government Oriental Manuscripts Library.*

MADRAS,
10*th September* 1940.

# CONTENTS.

Daṇḍakas.

# AUTHOR INDEX.

# GENERAL INDEX

TO THE

# DESCRIPTIVE CATALOGUE OF MANUSCRIPTS.

## VOLUME VIII.

[NOTE.—The names in *Italics* are those of the works described in this volume.]

# A DESCRIPTIVE CATALOGUE

OF THE

## VOLUME VIII.

---

# YAKSAGĀNAMS.

---

### No. 1834. అక్కమహాదేవి చరిత్ర.

### AKKAMAHĀDĒVI CARITRA.

**Substance, paper. Size, 12⅝ × 7⅝ inches. Pages, 36 Lines, 28 on a page. Characte Telugu. Condition, slightly worm eaten. Appearance, old. Mode of writi..g, fair but not free from ..istakes.**

Begins on fol. 399*a*. The other works herein are—Pāṇḍuranga-māhātmyamu 1*a*, Sītārāmāñjanēyasamvādamu 104*a*, Mairāvaṇa Caritra 162*a*, Rāmastavarājamu 208*a*, Bhānumadvijayamu 281*a*, Ātmānandarasamañjari 328*a*, Viracōḍavva Caritra (Yakṣagānamu) 364*a*, Gurunambi caritra 418*a*, Vēnkaṭēśvaramāhātmyamu 435*a*, Vēnkatācalamāhātmyamu 467*a*.

Complete.

Describes the story of Akkamahādēvi, a devotee of Śiva. The name of the author is Bālapāpāmba, for details see extracts given below.

**Beginning :**

క. శ్రీకర మహిమల నలరెడు నా కాశీవిశ్వనాథు నంఘ్రియుగంబుల్
ఏకమనస్సునఁ దలఁచెద మాకునభీష్టార్థములను మమతనొసంగన్.

వ. అని కృతికి నధిపతియగు విశ్వపతిని గవీశ్వరుఁ డేమని స్తుతియింపు చున్నాఁడు.

* * * *

తే. వ్యాసు వాల్మీకిఁ గవిఁగాళిదాసుఁ బొగడి-భాసురంబుగ శ్రీహర్షుఁ బ్రస్తుతించి
వాసిమీఱంగ ధీజనావళిని వినుతి-చేసి కృతిఁగూర్తుఁ గవి మనోల్లాసమెసఁగ.

వ. అని యప్పరమేశ్వరునకు షష్ట్యంతంబులు (చెప్పెనఁట) యెటువలెను.

అర్ధచంద్రికలు.

కమలజుఁ గొట్టిన ప్రమథేశునకున్
చన్నునఁబల్కిన చిన్మయునకును
పార్వతినేలిన పరమేశునకున్॥

వ. అంకితంబుగా నా రచియింపంబూనిన యక్కమహాదేవి బోధోల్లాసంబను యక్షగానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

* * * *

ద్విపద.

ఆయుడ నామాయ యరుగుచున్నాడను - శ్రీయుతంబైనట్టి శ్రీగిరి గలదు
ఆశైలమునకు దక్షిణ భాగమందు - భాసురకళలచేఁ బ్రజ్వరిల్లుచును
వనరుచుండెడు ఘనవశి యనుపురము - జనులెల్ల సంతోష సహితులైపొగడ
మమకారుఁ డను రాజు మహియేలుచుండె - అమితవైభవముల నలరియావేళ
మోహినియను జగన్మోహిని నపుడు - వాహినిగాను వివాహంబులాడె
నాయిరువురకును నతివమాయాఖ్య - పాయక పుత్రియై పరగజన్మించె॥

* * * *

వ. అనిపలికిన వృషభేశ్వరుండు మహాప్రసాదంబని దండప్రణామంబుచేసి యేనూట డెబ్బండ్రు ప్రమథులతోఁగూడి ధరాతలంబునకు వచ్చి కళ్యాణకటకంబునందు భక్తి సంయుక్తుండై జంగమారాధనంబు సలుపుచుండె నంత నెటువలెను.

జంపె.

ధరణిదేవికిని నూతన కిరీటంబనఁగ
మెఱయు నుడుతడియనెడు పురమొకటి గలదు.

* * * *

క. ఇటువలె నలరెడు పురమునఁ బహుతరముగ విమలుఁ డవనిపతి డానగుచున్
గుటిలాలకయగు(ను?) సుందరి దిటముగఁ బెండ్లాడియుండె ధీరుండగుచున్.

* * * *

జంపె.

అల సదాశివు పత్నియా మహాదేవియని
తిలకించు సుత మహాదేవి పేరిడిరి॥

* * * *

జోల పాట.

ఘనవజ్ర మాణిక్యఖచిత మయలీలఁ
దవరు నుయ్యాలలోఁ దనయునిడి చాలఁ

ఖనిఁబూని శ్రీగౌరిభామవని లోల
తనమునను వాడెదరు తరుణులూఁగి జోల (జోజో)

జోజో జగత్సాక్షి జో సుజనరక్షి
రాజశేఖరు సుజన రంజితాపేక్షి (జోజో)

పరమేశ్వరునితోడఁ బ్రతినగావించి
ధరణిలోపల మాయ తనువు ధరియించి
గురుఁడు అల్లమ చిక్కకున్నఁ జింతించి
తిరిగి యంబికప్రోలఁ దిరిగి యేతెంచి (జోజో)

ఉన్నయత్తతి గౌరి హృదయమునఁ జింత
తిన్నగాఁ దీర్తునని త్రిపురారియంత
సన్నుతాంగిరో నీదు సాత్వికమంత
పన్ని వసుధకు నసువు పణఁతి యనునంత (జోజో)

అనిన శ్రీకంఠునకు నతి భక్తితోను
వినతి సేయుచు మ్రొక్కి విశదంబుగాను
అనిపె విన్నపుడు సురలతివేడ్కతోను
జనువొందఁ బుష్పవర్షము గురయఁగాను (జోజో)

ఈరీతితో వచ్చి హితవు మదినుంచి
వీరత్వమున విమలవిభునకు జనించి
సార దయతో మమ్ము సరగ రక్షించి
గారవించితి వౌనె కరుణచేమించి (జోజో)

**End :**

మంగ(శపాఠరతు)ళార్తులు.

పసిఁడిపళ్లెరములోఁ బంచదళపద్మమునఁ
బంచరత్న ప్రభలు భాసిల్లఁగా
విశదముగఁ బాడెదరు విశ్వేశ్వనంబుచే
శశవదన మహాదేవి సరసి చెలఁగి జయమంగళం సదా శుభమంగళం ౧.

ప్రభునిఁబట్టెదననుచుఁ బంతమున శివుకరుణఁ
ప్రభమించ వసుధలోపల జనించి
విభవంబుతో జైనవిభుని నగరముఁజొచ్చి
సభ సమ్మతింప నాసమయమునను జయ ॥౨॥

వాని భ్రమయించి నిర్వాణవృత్తిని ఘోర
కాననంబుల ఘన కానలందు

సానువులయందు నాసరసుఁడల్లమవిభునిఁ
బూని వెదకినయట్టి పూఁబోణికి జయ ॥౩॥
వెదకుచుండెడువేళ వీరుఁ డల్లమగురుఁడు
మదిలోనఁ దెలిశపుడు మమతతోను
సదమలాకృతితోడ సరగఁ బ్రత్యక్షమై
యుదయార్కభావముననుండియపుడు జయ ॥౪॥
మోదమున శాంభవీముద్రోపదేశంబు
ఆదిగా నీ కొసఁగినటుల యిఁకను
మేదినీ జనజనులాదిగాఁ బొగడఁగను
నీదయను మమ్మేలు నీరజాక్షి జయ ॥౫॥

* * * *

జంపె.

అనిన శ్రీగౌరితోననియె భూతేశుండు
వినుము నీదు సాత్విక వివరమంతయును॥
అక్కమహాదేవివై యవనిలో జనియించి
చక్కఁగాఁ బ్రభువుచే సంతసంబొదవన్॥
ఉపదేశమంది తానుత్సాహలీలచే
నిపుడు శ్రీగిరినున్న దింతిరోయనినన్॥
అంత శ్రీగౌరి పరమానందమున మొదటి
పంతంబుమాని సంభ్రమవృత్తినుండెన్॥

ఏకతాళము.

* * * *

ధనము పుత్ర శ్రీ విభవము
నొనరఁగ భోజున కొసఁగెను బ్రభువున్॥

ద్విపద.

అని యిట్లు శ్రీకాళికాధీశుపేర - నెనయంగఁ గుంభకోణేశ్వరుపేర
మమ్మేలు శ్రీశైల మల్లేశుపేర - సమ్మతిఁగూడలి సంగయ్యపేర
ఊక్కర శ్రీ పాపమాంబాతనూజ - అక్కమల్లాంబ ఆత్మాబ్జాంతరమున
దేదీప్యమానదీధితులచే మెఱుఁగు - ఆదిగురుం డల్లమాధీశుపేర
నందివాహను మహానందీశుపేర - నందంబుగాఁ గాళహస్తీశుపేరఁ
బరమధార్మికుఁడైన బసవన్నపేర
స్థిరతరంబుగను సుస్థిరతఁబొసంగి - కరుణించు శ్రీభద్రకాళీశుపేర
శంకితంబుగను మహాదేవిచరిత - పొంకమై రచనాధిపూర్ణమైయొప్పు॥

**Colophon :—**

ద్విపద.

శ్రీమన్మహాకారు శ్రీజనాధారు - సామవేదోద్ధారు సన్నుతాచారు
పరగు పరబ్రహ్మ భవ్యవంశమున - వరబలోన్నతశాలి వసుమతియందు
వీరశైవాచారు విలసితాకారు - మేరుధీరుఁడు జంగమేశుండు పుట్టె
నతనికి సతియగు నతివ పాపాంబ - ప్రతిభచే శ్రీవిశ్వపతి వరంబునను
వరవీరభోజుండు వంశమేమనిన - మతి దక్షిణామూర్తి మహనీయకీర్తి
సిద్ధవిద్యలకెల్ల సిద్ధుఁడైనట్టి - సిద్ధప్పయను సత్యశీలుండు ఘనుఁడు
మల్లమ్మ కనకమ్మ మగువనాగమ్మ - . . రుద్రమ్మ సతుల నల్వురిని
సరవితోఁగాంచె నాసప్తసంతాన - మరుదంద లోకహితార్థంబుగాను
ముదముతోడుత నందు ముఖ్యశీలుండు - . . . అష్టయోగాది విద్యాప్రవీణ . .
వ్రతుఁడు వీరవసంత వసుమతీశునకు - సకియ కామాక్షమ్మ సకియగర్భమున
అమహేశ్వరికరుణ పాపమకరుణ - కామించి యొసఁగిన ఘనవరంబునను
ప్రథమపుత్రిక బాలపాపాంబయనఁగ - నధికతేజంబుల నపుడుద్భవించ
సంగీతసాహిత్య సరసలక్షణల - రంగుమించినయట్టి రమణి దానగుచు
అలభద్రకాళి నా ఆత్మలోపలను - బలికించురీతి నేఁబలికెదననుచు
నవనిలో యక్షగానావలికెల్ల - రవళిమించిన శిరోరత్నమో యనఁగ
మంగళప్రదమగు మహాదేవిచరిత - యింగితజ్ఞానిష్ఠ యీకృతిఁ జేసె
యీకృతి చదివిన నీకృతివిన్న - నీకృతి వ్రాసిన నిష్టార్థసిద్ధు
లౌనఁగు నల్లమరాయఁ డోగిమహాదేవి - యసమాత్మకరుణచే నవనిలో వెలయు
నెందాఁకఁ ద్రిజగంబు లెందాఁక శేషుఁ-డెందాఁక హరిహరు లెందాఁక నజుఁడు
ఎందాఁక సోమార్కు లెందాఁక సిరులు - అందాఁక నీకథ యవనిలో సుజను
లాచరింప బుధజనావళుల్ పొగడ - నాచంద్రతారార్కమై యొప్పఁగాత.

(వి-వి.) —

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

అక్కమహాదేవి యని పేర్వెలసిన శివభక్తురాలి కథ యిందు వర్ణితమయ్యెను. గ్రంథకర్త్రి బాల పాపాంబ. ఉదాహృత గ్రంథభాగములబట్టి విశేషవిషయము తెలుఁగ నగును.

ఇందు గ్రంథాంతరములు గలవు.—

1*a* పాండురంగ మాహాత్మ్యము, 104*a* సీతారామాంజనేయ సంవాదము, 162*a* మైరావణ చరిత్ర, 208*a* రామస్తవరాజము, 28 భానుమద్విజయము

328*a* ఆత్మానందరసమంజరి, 364*a* వీరచోడవ్వ చరిత్ర (యక్షగానము), 418 గురునంబి చరిత్ర, 435 వేంకటేశ్వర మాహాత్మ్యము, 467*a* వేంకటాచల మాహాత్మ్యము.

---

## No. 1835. అక్కమహాదేవి చరిత్ర.

## AKKAMAHADEVI CARITRA.

Substance, palm-leaf. Size, $14\frac{3}{8} \times 1\frac{1}{8}$ inches. Pages, 68. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured and worm eaten. Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Complete.

Same work as the above. The first five pages contain a discussion about Vīraśaiva religion and the last four pages contain a list of Gotras among Vaiśyas.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు. పూర్వము వారి.

గ్రంథాంతమం దీవ్రాతగలదు.—

“రాక్షసనామ సం॥ నిజాశ్వీజ శు॥ 13 గురువారంవరకు శివుని కథను మాజేటి సర్వేశలింగం స్వదస్తూరిని వ్రాసినారు.”

గ్రంథారంభమున 5 వ పుటలో వీరశైవ మతవిషయ చర్చ గలదు. గ్రంథాంతమున 4 వ పుటలో వైశ్యగోత్రముల పట్టిక కలదు.

---

## No. 1836. అలమేలుమంగా విలాసము

## ALAMELUMANGĀ VILĀSAMU.

Substance, palm-leaf. Size, $16\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches. Pages, 49. Lines, 6 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good and fairly free from mistakes.

Complete.

The story relating the marriage of Vēnkaṭācalapati and Alamēlumangādevi is herein described. It is dedicated to God Vēnkaṭēśvara worshipped at Kāmagiri (?). The name of the author is not known. But it is stated that it was written at the instance of the minister of Mūḷḷagiri, a Brahmin belonging to Ārvēlaniyogi sect, who honoured the author, with a house, hundred Varahas, an estate for maintainance etc.

**Beginning:**

శా. శ్రీలక్ష్మిన్ నిజవక్షమందు నిడి కుక్షిన్ సర్వలోకంబులన్
లీలామాత్రముతోడనుంచి సుమశ్శ్రేణీపినద్ధోజ్జ్వల
న్మాలాలంకృతుఁడై నితాంత మలమేల్మంగా కరాంభోజమున్
గేలంబట్టిన వేంకటాద్రిపతి సత్కీర్తిన్ మముం బ్రోచుతన్.

అని కృతి కధిపతియైన వేంకటాచలపతి నేమని కొనియాడుచున్నాఁడు.

శ్రీరాగం - అటతాళము.

నమామి శేషాద్రివాసం, సన్మందహాసం, నమామి శేషాద్రివాసం, నవమణి నీల భాసం సరసవిలాసం.

* *

శ్రీమదంభోదగాత్రం దారుణదురితస్తోమతిమిరమిత్రం తామరసాభనేత్రం కామ గిరీశమిత్రం పరమపవిత్రం నమామి శేషాద్రివాసం.

* * *

వ. చిరంతనేదానీంతన కవిప్రవరప్రసాదంబున కమనీయశృంగార రసనివాసంబగు నలమేల్మంగా విలాసంబను యక్షగానంబు రచియింపంబూనియున్న సమయంబున.

ద్విపద - కేదారగౌళ.

ధరణి శ్రీకరము శాత్రవభయంకరము - వరశుభాకరము మెల్పాకొండపురము
దళవాయి యనిపించి తాల్మివహించి - ఖలులనెల్లజయించి ఘనతనుగాంచి
తనరిన మేటి భూతలమున కోటి - జనులైన నితనికి సాటిరాదనుచు
మాటిమాటికి సర్వమంత్రులుఁబొగడ - దీటులేక వెలఁగు దీనరక్షకుఁడు
సారిదిసాపస్తంబ సూత్రశోభితుఁడు - గురుభరద్వాజస గోత్రసంభూతుఁ
డార్వేలకుల కలశాంబురాశికిని - శర్వంకరుఁడు సౌజన్యశోభితుఁడు
భవ్యభండీ వంశపావనుఁడనఘుఁ - డవ్యయవైభవుం డలము మానముఁడు
రాజాధిరాజ హృద్రంజనకరుఁడు - తేజమంత్రీంద్రుఁ డుత్తైటఁగున వెలసె
నతని కిద్దఱుసతు లతిభాగ్యవతులు - పతిభక్తిమతులు నిర్భరకౌరతులు.

తేజమంత్రి (ఇద్దఱు భార్యలు).




భూరిదేవద్విజ పూజాపరుండు-సూరిమందారుండు సుజనైక వినుతుఁ
డనఘచారిత్ర మబ్బాంగ నారమణుఁ డనుపమ శ్రీనివాసా మాత్యజనకుఁ

జమలదయా సాంద్రుండనిశనిస్తంద్రు-డమితవాక్య ఫణీంద్రుఁడౌర్య సమ్మతుఁడు
శ్రీధీరుఁడగు మూళ్లగిరిమంత్రి చంద్రు-డరుదుగా నొకనాఁడు హర్షయుక్తుండై
నను గారవించి మన్నన నూరడించి-కనికరంబునమించి ఘనతవహించి
చవదళిహిత భవ్యభావశబ్దార్థ-వివిధక్రియా సమన్విత దివ్యయక్ష
గానంబు లక్ష్మీ ముఖాబ్జభాస్కరుని-కానంద మయమూర్తి కమలకీర్తికిని
వెంకటశైల నివేశుఁడౌ హరికి-నంకితంబుగఁ జేయు మనియానతిచ్చె.

వ. ఇట్లు జాంబూనదాంబరాశేష మణి భూషణ తాంబూల ప్రదానంబులనా
దరించుటయు నేనును సంతత తంతన్యమాన సంతోష వివశస్వాంతుండనై నా యొనర్పం
బూనిన యలమేల్మంగా విలాసంబను యక్షగానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన ;

**End**

ద్విపద - ఎఱుకుల కాంబోజి.

ఇదిశైలనందనీహృదయారవింద-మదసమన్విత దివ్యమధుకరసదృశుఁ
డైమహామహిమతో నలరు శామాద్రి-రామేశ్వరునకు హర్ష ప్రదంబగుచు
వల్లీసహాయ సుబ్రహ్మణ్యదేవ-ఫుల్లపదాంభోజ భూషణంబగుచు
దీనమందారుఁడై దేవ గంధర్వ-భూమి సుతాముఖాంబు జమిత్రుఁడైన
రామచంద్రునకుల లామంబునగుచు. ?
మౌని జన స్వాంత మహనీయకమల-భానుఁడైయలమేలు మంగా సమేతు
డైన లక్ష్మీ వెంకటాచలపతికి-నర్పితంబగుచు గోపాంగనానికర
దర్పకతుల్యుఁడై తనరుగోపాల-కృష్ణమూర్తికిని సత్కీర్తి దంబగుచు
విష్ణుభక్తివహించి విశ్వంబులోన-వెలయుచు సతతంబు వినువారికెల్ల
గజతురంగాం దోళికామహీ రాజ్య-విజయ సామ్రాజ్యాది విజయదంబగుచు
సకల విద్వత్కవి సందోహములకు-నకలంక రుచిర మోదా స్పదంబగుచు
పరసత నార్వేల సంతతిజలధి-సురుచిరచంద్రుఁడై శుభభరద్వాజ
గోత్రపవిత్రుఁడై గురుబుధవినుతి-పాత్రుఁడై విలసదాపస్తంబ సూత్ర
భవ్యుఁడై సర్వసంభావ్యుఁడై సతత-దివ్యబద్దివంశ తిలకుఁడై మంత్రి
జనశిఖామణికి నిశ్చల కృపానిధికి-ననఘగుణాంబుధి కలతేజమంత్రి
కలిపవైు తగిన సుబ్బాంబికామణికి-నతిశయాన్విత పుత్త్రుఁడై కళావతికి
సౌందర్యవతికి నిశ్చలదయామతికి-నందంబు గలుగు సుబ్బాంగనామణికి
హృదయేశుడై సర్వహితకరమతికి-సదమల సద్గుణసందోహనిధికి
ఘనకృపాంబుధికి భాగ్యసమానఖనికి-ననుపమ శ్రీనివాసామాత్యమణి కి
జనకుఁడై వేంకటశైల నాథాంఘ్రి వనజాత భక్తి సంపన్నుఁడై నిత్య
భోగదేవేంద్రుఁడై పుణ్యచరిత్రు-డైగర్వ రహితుఁడై యాశ్రితకవిత
వాత్సల్యమున నన్నుఁబాలించి మహిత-వత్సరగ్రాసంబు వాసంబునూఱు

వరహాలు జోడు నేల్వాలుఁదురంగంబు-కరమర్థి నొసఁగి నిష్కల్మషవృత్తి
ప్రేమతో మన్నించి పేర్కొనునట్టి శ్రీమాళ్లగిరిమంత్రి శేఖరునకును

*　　　*　　　*　　　*

లాలితరీతి లీలాపాకనవర-సాలంకృతి ప్రభావాన్వితంబగుచు
వరరాగ తాళాదివర్ణితంబగుచు-మహితమా నలమేలుమంగా విలాస
మను యక్షగానంబు హరిహర ప్రముఖ-ఘనతర దేవతాకలితమై వెలయు
నాచక్రవాళ దేవావనియందు-నా చంద్రతారార్కమైయుండుఁగాక !

(వి-వి.)—

సమగ్రము వ్రాఁతమంచిది. తప్పులంతగాలేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

అలమేలుమంగా విలాసమను పేరఁ బరగు నీ యక్షగానమునఁ దిరుమల వేంకటాచలపతి యలమేలుమంగాదేవిని బెండిలాడుకథ వర్ణిత మయినది. గ్రంథకర్త పేరిందుఁ గానరాదు. కామగిరియందు వెలసిన వేంకటేశ్వరస్వామి కది సమర్పితము. ఆర్వేల నియోగిబ్రాహ్మణుఁడగు మాళ్లగిరిమంత్రి యేతత్కృతి ప్రేరకుఁడు. అతఁడే తత్కృతి కర్తను వస్త్రాశనమును, గృహమును, నూఱువరహాలు, జోడు నేల్వాలు మొదలగునవిచ్చి సత్కరించెనట.

---

## No. 1837. అష్టపది.

## ASṬAPADI.

**Substance, palm-leaf. Size, 15½ × 1½ inches. Pages, 34. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.**

Complete.

**This is a Telugu rendering of a portion of the work Gitagovinda, beginning with “ సావిరహే తవ దీనా, ” written by Jayadēva in Sanskrit. The name of the author is not known.**

**Beginning :**

శ్రీమత్సమస్త సద్గుణ నయవినయ వివేక వితరణ విచక్షణదక్షాః గూఢార్థ నిర్ణయ నిస్పందేహ నిరాఘాట నిరవద్యగద్యపద్యరచననువచనాః తర్కవేదాంత మీమాంసావ్యాకరణ భాట్టప్రాభాకర సాంఖ్య యోగాది శాస్త్రపారీణాః సంగీత సాహిత్యాది కలాప్రవీణాః సర్వేసభాజనాః యుష్మాకాన్ స్తుత్వా వందనం కృత్వా ఉపమాత్రేప్యష్టపద్యలంకార సంగీత తాళాను బంధం జయదేవకవి రచిత ప్రబంధం సమస్తరసభావ నాయకాలకంఠం సకల జనానందం నానావిధ రాగబృందం నానావిధ రాగా... ........దం గీత గోవిందం భరత శాస్త్రానుసారేణాభినయం సర్వజన చిత్తరంజనం అహంకరోమి.

అన్వయం.—సమస్తమయిన సభాజనాలకున్ను నమస్కరించి విప్రలంభశృంగార ములున్ను ఉత్ప్రేక్షాద్యలంకారములున్ను నిర్వేదాది భావములున్ను కలిగినటు వంటి గీతగోవిందమందు 'సావిరహేతవదీనా' అనే అష్టపది భరతశాస్త్రాను సారిక గాను నే నేర్చినట్టు అభినయిస్తున్నాను. వినచూడనవధరించవలెను.

శ్లో. యమునాతీరవానీరనికుంజే మందమాస్థితమ్
ప్రాహప్రేమభరోద్భ్రాంతం మాధవం రాధికా సఖీ.

అన్వయం చెప్పేది. పద్యం.

ఉ. సారస గంధబంధురయ చందన (?) సద్యమునాతరంగిణీ
తీరమునందు నెన్నఁదగు దివ్యమనోహరమల్లికాదివా
నీర నికుంజమధ్యమున నిల్చివసించినకృష్ణదేవునిం
జేరియు రాధికాతరుణి చెప్పెను దద్విరహానులాపముల్.

కాంభోదిరాగము—ఆదితాళము.

యమునానదీ తీరమునా । ఇల్లైన వానీరమున
సుమనోబాణునిఁ గన్నతండ్రిని జూచిపలికెచానా !

చూర్ణిక.

యమునానదీ తీరమధ్యే । వానీరద్రుమమంటపే రాధా వియోగజనిత తాపభరేణ ఖిన్నభావం శ్రీకృష్ణదేవం రాధికాసఖీ చమత్కారేణ బభాషే.

నిందతిచందన మిందుకిరణమను
విందతి ఖేదమధీరం ॥ వ్యాళనిలయమిళనేన
గరళమివ కలయతి మలయ సమీరం
సావిరహేతవదీనా ॥ కృష్ణా !
మాధవ మనసిజ విశిఖభయాదవ
భావనయా త్వయి లీనా

అన్వయం చెప్పేది.

ఉ. గందముదిట్టి వెన్నెలలఁ గాదని తాపముఁబొంది చల్లగా
విందు విషాగ్ని కాకవలె నెంచుచు నున్నదటంచు రాధతా
డెందములోన మన్మథ దృఢీకృతవేదనకోడి దీనతం
బొందెర నీకు మాధవుఁడ పొంకముగాఁజెలి నేలి కావరా !

దరువు, శంకరాభరణం, త్రిపుట.

రాధనీ విరహాన గుంది పరాకు దీనతనొంది వదనని
బాధకోర్వఁగ లేక నీయందె భావమునిచె—

సారెగందము దిట్టుఁ గాదను చంద్రికలనూ, ధైర్యము
జారివేదనఁబొందుచున్నది వారి కృష్ణా !
సారె పాములతోనుగూడిన చందనాటవిమీదఁజల్లని
మారుతము విసమనుచుఁ గళవళమందిచూచెగా.

**End :**

ఏల

గీతము విడిచి యడవిలోన-భూమి పయిని బడి పొరలుచు
కామినిరో నీవిరహాన హా-రాధాయని-ప్రేమతో పలుమారు దలఁచునే ; శ్రీకృష్ణునితో
కాముని కేళిలోనైన యవే
4 దశాలు
మనసిరథసాద భణతి కవిజయదేవే, విరహవిలసితేన విభావే హరిరుదయతుసు కృతేన.

పద్యం.

క. శ్రీ జయదేవ కవీంద్రుఁడు
కాఁజెప్పెను శౌరివిరహతత్త్వము పఠియిం
చేజనుల సుకృతఫలమున
తేజంబుగ మదినిగృష్ణదేవుఁడు వెలయున్

వరాళి అటతాళం.

శ్రీ జయదేవుఁడు చెప్పిన గీతము
నేజనులయినఁ బఠించినను,
రాజసమున మది రంజిల్లఁగదివ్య
తేజముతాఁగృష్ణదేవుఁడు వెలయుగా
జ్ఞానానందమయుండౌ గోపాలుని ధ్యానము చేసినను,
కాను జేయు సుకృతము లెల్లఫలియించు
మానసమున వైభవానందములు మించు
శ్రీజయదేవభణితమితిగీతం - శ్రీరమణీశ విరహసముపేతం
యేచపఠంతి సుకృతఫలసక్తాః కేశవదర్శన విభవనియుక్తాః

చూర్ణిక.

హే సకల సజ్జనాః యూయంశృణుత, శ్రీ కృష్ణ విరహవిలసితభావేన సఖీవాక్య రూపేణ శ్రీ జయదేవ మహాకవిభణిత లలితగీతం నిరంతరపఠన యోగ్య కావ్య నాటకాలంకార సహిత విప్రలంభశృంగార రసప్రబంధ విఖ్యాతమిదం యేపఠంతినరాః తేషాం మనోరథ ఫలావాప్తిర్భవతి. యః పూర్వకృత సుకృతేన భక్తి పారవశ్యాత్పఠనసమయే సంభ్రమ భ్రమత్వతః (?) మానసే సర్వాంతర్యామీ శ్రీవాసుదేవహరి రోచవతాన్.

ఏల

గోపాలుని విరహలీలా-రూపమైన యీ గీతము
దీపింపగా జయదేవుడు, శృంగారములచే-శ్రీపతి ప్రియమందఁ జెప్పెను
ఈకృతి మనసు ఉప్పొంగ-జ్ఞాకుచ్చినవారికి పూ
ర్వకృత విశేష ఫలమున దివ్యతేజుఁడై-శ్రీకృష్ణుండు వరము లిచ్చును.

సమగ్రము—వ్రాఁతమంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు నల్పముగాఁగలవు.

జయదేవకవి సంస్కృత భాషలో రచియించిన గీత గోవింద కావ్యమందు 'సావిరహేతవదీనా' అని యుపక్రమముగల యష్టపది కెవరో నాట్యోపయోగముకై చేసిన తెలుఁగు పరివర్తనమిది. ఇందు, శ్లోకము, పద్యము, సంస్కృత గద్యము, దూర్ణిక, తెలుఁగు దరువులు, ఏలలు, ఇత్యాది విధమున పై యష్టపది వివరింపఁబడినది. కర్త పే రెఱుఁగరాదు.

---

## No. 1838. ఉషా పరిణయము.

## UṢĀ PARIṆAYAMŪ.

**Substance, palm-leaf. Size, 13¼ × 1⅛ inches. Pages, 94. Lines, 5 on a page. Character, Telugu Condition, fair. Appearance, old. Mode of writing, good, but full of mistakes.**

Complete.

The marriage of Uṣā and Aniruddha is described in the form of Yakṣagāna. The name of the author is Vaviripāṭi Nṛsimharāju.

Date of transcription. Friday the 4th day of the bright fortnight of the lunar month Māgha in the Year Sarvadhāri.

Name of the Scribe—Sarvēśalingam.

**Beginning :**

ఉ. ముందుగణాధి దేవునకు మ్రొక్కి- త్రిమూర్తులఁ గొల్చి వాణికిన్
వందనముల్ ఘటించి గిరివల్లభు పుత్రి భజించి యబ్ధిరా
ణ్ణందనఁ బ్రస్తుతించి కవినాథుల భారత కావ్యకర్తలన్
డెందమునన్ దలంచి గురుదేవునిఁ బ్రార్థన చేసి వేడుకన్.

క. పరమదయ మూర్తి గావున- వరమేశు కృపాకటాక్ష...కర్ణిన్
స్వరనందన వారా యుష పరిణయమును యక్షగాన ఫణితి నొనర్తున్.

వ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నారయొనర్పం బూనిన భారత కథాసారం బగు నుషాపరిణయంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన

జంపె.

సకలజన శుభకరము సారవిభవాకరము
సుకవిజన బంధురము శోణాద్రి పురము.

**End :**

వ. అప్పుడు శ్రీకృష్ణుండు గౌరీనాథ బాణులన్ వీడ్కొని తనబంధు మిత్రాను జోషా కన్యా నిరుద్ధ పరివృతుండై నిజపురంనకుం జనుదేర నాపుర జనంబు లుషాకన్యకం జూచి యేమనుచున్నారు.

**Colophone :**

అని జగదేక మహాశక్తిపేర - ఘనముక్తి శుకశౌనకాధీశుపేర

* * *

అంభోజ భవహరిహరాదులపేర - శంభుని సతియైన (న) శ్రీ గౌరిపేర
అంకితంబుగ శారదాంబిక పేర - పంకేరు హాసన ప్రాప్త సౌభాగ్య
శాశ్వతైశ్వర్యుఁడా శామలాంగుండు - లాలిత సాహిత్య లక్షణామాత్య
విలసిత ధూర్తకవి వేదండహరుఁడు - అకలంకగాన విద్యాప్రవీణుండు
సకల భాషాకవి సద్గుణార్యుండు - సుకృతశాలుండును సుజన సమ్మతుఁడు

విరిపాటి నరసింహ ధరణికాంతుండు - శ్రీ విశ్వనాథయ కవితంబు
మెఱయ
నవరసాలంకార నయమార్గతతులఁ- బ్రాచుర్య......ఉషాపరిణయకావ్య
మాచంద్రతారార్కమై యొప్పఁగాత॥

(వి.వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులు హెచ్చు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఉషానిరుద్ధుల వివాహకథను యక్షగాన రూపముగా విరిపాటి నృసింహ రాజు రచించెను.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

" సర్వధారినామ సంవత్సర మాఘ శు 4 శుక్రవారం సర్కారుపులిచేరిలో శ్రీమతు సదాశివ భక్తుని కొమారుడు బసవప్ప వ్రాసుకున్న ప్రతిజూచి మాజేటి సర్వేశలింగం వుషాకన్య చరిత్ర సంపూర్ణంగా వ్రాసెను "

## No. 1839. ఎఱుకుల వేష కథ.

## ERUKULA VĒṢA KATHA.

**Substance**, palm-leaf. **Size**, 15¼ × 1⅜ inches. **Pages**, 37. **Lines**, 5 on a page. **Character**, Telugu. **Condition**, much injured. **Appearance**, very old. **Mode of writing**, not good and full of mistakes.

Begins on fol. 31 (a). The other works herein are:—Rukmiṇi vēṣa katha 1 a, Jalakrīḍa 8 b, Savatula Kāyyamu 18 a.

Incomplete.

It appears to be a portion of Bhāgavata yakṣagāna and describes the story of Rukmiṇi and Satyabhāma enquiring a Korava woman (who professes to prophesy events) whether their desires will be fulfilled. The name of the author is not known.

**Beginning :**

వచ్చె నెఱుకత చెలువ లడిగిన - ముచ్చటలు తాఁజెప్పఁగా
అచ్చమగుకుడిసందితోరపు - కుచ్చు చేవడి నూగగా॥
నిగనిగల నునుపారు చెక్కుల - నీడ లిరుదెస గ్రమ్మగా
బిగిచనుంగవ మీది పతకపు - బిళ్ల వలె దళ మొరయగా॥
వచ్చె నెరుకత కోరిత ! మురిపెపు - వంక పచ్చని బొట్టుతో
అచ్చుగా శ్రీ కాకుళప్పని - యతివముచ్చట దెలుపుచూ॥
వన్నె మీఅఁగనుదుట చందురు - వంకపచ్చని బొట్టుతో
సన్నుతింపగ మిళుకు మిళుకను - జాతిసొమ్ములు బెట్టుకో॥ వచ్చె॥

* * *

ఎరుకతతా వచ్చెను అవ్వోయవ్వ యెఱుకత తా వచ్చెనూ !—

**End :**

ఎల్లవారలకు యెఱుక చెప్పినాను - చద్దిమూరుగాయ చలిమిళ్లు పచ్చళ్లు
కజ్జికాయలుమంచి కర్పూరఫలములు - ఇరవుగ దెచ్చితే యిచ్చితే పలుమారు
బొజ్జ పెంచుకొని పేలేవు గోరిసింగ !

తే॥ సజ్జపై నిద్దురించిన సంజ్ఞ దెలిసి, కాళ్లగజ్జెల చప్పుళ్లుగలుగునింక
మెల్లనే లేచి వచ్చితి మేలమునను-నీవు యెప్పుడు దిగివచ్చినావు సింగ !

(వి-వి)—

అసమగ్రము. తుదిపట్టు కొంచెము తక్కువ. వ్రాఁత మంచిదిగాదు. తప్పులు హెచ్చు శైథిల్యము గ్రంథపాతములు కొలఁదిగఁగలవు.

రుక్మిణీ సత్యభామలు తమ మనోరథములు సమకూడునో లేదో యని యెఱుకత నెఱుకయడుగు కథ కలదు. ఇది భాగవత యక్షగానైకదేశమనఁదగును. కర్తపే రెఱుఁగరాదు.

ఇందు క్రింది గ్రంథాంతరములుగలవు :—

1 a రుక్మిణీ వేషకథ, 8 b జలక్రీడ, 18 a సవతులకయ్యము,

---

## No. 1840. ఎరుకులవేష కథ.

## ERUKULAVĒṢA KATHA.

Substance, palm-leaf. Size, 15¾ × 1½ inches. Pages, 35. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured and slightly worm eaten. Appearance, old. Mode of writing, is not good and is full of mistakes.

**Incomplete.**

**Same work as the above.**

(వి-వి)—

అసమగ్రము. తుదిపట్టు కొంచెము కొఱఁత. వ్రాఁత మంచిదిగాదు. తప్పులు గలవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువాఁత.

గ్రంథాంతమం దైదుపత్రములకై పాటలుగలవు.

---

## No. 1841. ఎరుకులవేష కథ.

## ERUKULAVĒṢA KATHA.

Substance, palm-leaf. Size, 16¾ × 1¾ inches. Pages, 26. Lines, 5 on a page Character, Telugu. Condition, much injured and worm eaten. Appearance very old. Mode of writing, fair, but full of mistakes,

**Complete.**

**Same work as the above.**

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులు హెచ్చు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వము వాఁత.

---

## No. 1842. ఏకాంతసేవ.

## ĒKĀNTASĒVA.

Substance, palm-leaf. Size, 14½ × 1½ inches. Pages, 9. Lines, 6 on a page, Character, Telugu. Condition injured and worm eaten. Appearance, old. Mode of writing, good, but not free from mistakes.

**Begins on fol. 14 (a). The other works herein are Gollavēsa katha 1a, Samudramathanamu 8a.**

Complete.

The Conversation betwen Sri kṛṣṇa and his eight queens, is herein described. The work is dedicated to Veṇugōpālaswāmi worshipped at Cocanada. The name of the author is not known.

**Beginning :**

ఘుమ్మ కాంభోజి రాగము—ఆటతాళము.

సుందరాంగినీ కెమ్మోవి - విందూచేసి చానూ బంతూ
లందనియ్యావె యీా వేళానూ - ఓ మోహనాంగి
కుందనంపూ గొలుసు లిచ్చేనే॥
మందెమేలాము చేసేవూ - మామగారున్నారిచ్చోట
కందువా మాటలాడాకూరా - గోపాలదేవా
వందనాము చేసెదరోరా॥
శ్రీ రుక్మిణీదేవి చిత్తమలర హరితో
జేరియున్న యట్టి సమయమిది
తూరూపుదిశను సుధాకరి నెక్కియ
పారసూరలు గొలువ పాకశాసనీశు
పదిలమై యుండుమీ - వేగినదనుక
పదిలమై యుండుమీ॥

వ. తూరుపు దిగ్భాగాధీశ ఐరావతారూఢ శచీసమేత దేవేంద్రా జోహో హోయీా కాకినాడపట్టణమందు శ్రీ వేణుగోపాలస్వామివారు రుక్మిణీ సమేతముగా పవ్వళించియున్నారు. నీస్థలమందు జాగ్రత జాగ్రత ఓహో హోయీా.

**End:**

మంగళహారతి.

వేణుగోపాలతే మంగళం - జయ విశ్వంభరతే మంగళం॥
అంగజజనకవిహంగతురంగర - థాంగధరాయతే మంగళం॥
రంగలరంగద్వజే లంగెడునవమోహ - నాంగ శుభాయతే మంగళం॥ వేణు॥

* * *

**End :**

శ్లో. బాలికాతాలికా తాళలీలాలయ - స్సంగసందర్శిత భ్రూలతావిభ్రమః,
గోపికాగీత దత్తావధానస్స్వయం - సంజగౌ వేణునా దేవకీనందనః.
కృష్ణా మురారే!
రావే కోమలి మందయాన సకియా రాకేందుబింబాననా
నీవాక్యంబులు నమ్మివస్తి నిపుడున్ నీరేజపత్రేక్షణా !

ఈవేళగా నను(గూడి సత్యవతి మా యిష్టంబులు జేర్చినగా
భావం బొక్కటిగా దలంతు మెప్పుడుగా భామా మనోహారిణీ!

దర్వు.

కోపమేటికి నీదు రాకకు గోరియుండెడిదాననా! ఏ
పాపమును లితు చేసిరో వగబాటు లేల కృపానిధీ
రూపవంతుడ కాకినాడను రూఢిగా నెలకొంటివౌ
మా పయిని దయయుంచి యేలుకొ మదనమోహనరాయడా!

సీ. మగువలక్షణ! నీదు పాటలు వినగోరి వచ్చినాడను నాదు వాంఛ దీర్చు
శ్రీకృష్ణ! యీవేళ చిన్నారిపదములు సేవించి ధన్యత(జెందియుంటి
కరుణించి వేగ నీ కౌ(గిట(జేర్చిన కోరికదీరునే కోమలాంగి
మదనమోహనరాయ మందిరంబున కే(గి పవడించవయ్య యీ పాన్పుమీ(ద
చెలియ రతికేళి(దేలితి(జెన్నుమీఱ-కువలయంబున నీతోడి(గూడియుండు
కరుణయుంచుము మామీ(ద(గాకినాడ-వేణుగోపాల జరగు మీ వెల(దికడకు.

శ్లో. పారిజాతం సముద్ధృత్య రాధా వయో-రూపయామాస భాసాగుణై రంగజే
సీతసీతేవ లే యాముసీయేత లే-సంజగౌ వేణునా దేవకీనందనః.

శ్రీ కృష్ణ సత్యభామా సంవాదం.

(వి-వి.)—

సమగ్రము. వ్రా(త తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

శ్రీకృష్ణుని పవ్వళింపుసేవ, శ్రీ కృష్ణాష్టమహిషీ సంవాదము ఇందు(గలవు. కాకినాడలో వెలసిన వేణుగోపాలస్వామి పేర నిది రచితమయ్యెను. ఏకాంతసేవ తర్వాత నిందు శ్లోకములు, సీసపద్యములు, దర్వులు అష్టమహిషీ సంవాదపు(బట్టున(గలవు. కర్తపే రెఱు(గరాదు.

ఇందీ గ్రంథాంతరములు గలవు.

1*a* గొల్లవేషకథ, 8*a* సముద్ర మథనము.

---

## No. 1843. కన్యకా పురాణము.

## KANYAKĀ PURĀṆAMU.

Substance, paper. Size, 14⅝ × 9½ inches. Pages, 67. Lines, 39 on a page. Character, Telugu. Condition, very much injured and worm eaten. Appearance, very old. Mode of writing, good, but not free from mistakes.

Begins on fol. 31*a*. The other works herein are—Jangama-Kālañānamu. 1*a*, Ēganṭivari vacanamulu 13*a*, Rāma-stavarājamu 17*a*,

Complete in three āśvāsas.

The story is the same as described under No 316 ante and R. No. 1855. The name of the author is Iṭikala Timmayya, son of Cennama seṭṭy and Lakṣmāmba. Date of transcription—Wednesday the first day of the bright fortnight of the lunar month Śrāvana in the year Pramōdūta.

Name of the Scribe.—Govindappa of Kāvērisamudramu.

**Beginning :**

క. శ్రీశైల వంశభూషణుఁ-డాశ్రితజన లోకవినుతుఁ డతులితమహిమో
ల్లాసియగు కృష్ణమాహ్వయ-దేశికుఁడిల మాకునిచ్చు దివ్యవరంబుల్.

* * * *

త్రిపుట.

పరులవశమై మెలఁగుకామినిఁ బ్రాణపదముగ రొమ్మునందిడి
మరులుగొల్పిన శ్రీజనార్దను మదిఁదలంతున్.

* * * *

అటతాళము.

అక్కఱకు వెలఁబోని ఫణిమణు-లనురతలల పేరులు
చక్కఁదాల్చిన హరుని నగరే-శ్వరునిఁగొలుతున్.

* * * *

వ. అని బృందారకవందితచరణారవింద యగు వింధ్యవాసిని నేమని వినుతింపుచున్నాఁడన.

జంపె.

కరివైరి నిజవామ కరసీమ నెలకొన్న
కరివైరి దళశోభితాకారిఁ దలఁతున్.

* * * *

వ. అని కన్యకాపరమేశ్వరి నేమని వర్ణింపుచున్నాఁడు.

అటతాళము.

క్షీరసాగరమందు వెడలిన సిరియనంగ
ముదమునఁ
జేరి వైశ్యకులాబ్ధిఁబొడమిన చెలువఁదలఁతున్.

* * * *

వ. అని గురుకరుణాసముద్రుండగు రామభద్రునకు షష్ఠ్యంతములు చెప్పెనటు యెటువలెను.

కురుచ జంపె.

సురరాజపాలునకుఁ బరమశీలునకున్
దశరథకుమారునకు నసమశూరునకున్.

* * * *

వ. అంకితంబుగా నా రొయొనర్పంబూనిన కన్యకాపురాణంబను యక్షగానంబునకుం గథాక్రమం బెటువలెను.

**End :**

వ. ఇటువలె (పెనుగొండపురమునందు) సకలజనానందంబై పొలుపొందుచున్న యద్దివ్యమంటప గర్భగృహ మధ్యసింహాసనంబునందు గంగానదీప్రాంత్యంబులనుండి తెచ్చిన లింగంబు శాస్త్రోక్తంబుగాఁ బ్రాణప్రతిష్ఠగావించి తదనంతరంబున నక్కన్యకాపరమేశ్వరికిఁ బ్రతిరూపంబుగా సువర్ణవిగ్రహంబు నిలిపి షోడశోపచారంబు లొనరి గో భూ హిరణ్యాది షోడశ మహాదానంబులు భూసురాగ్రేసరుల కొసంగి నిత్యమహోత్సవంబులు సేయుచు సుఖస్థితినుండి రంత సంతోషాతిశయంబున రాజరాజనరేంద్రుం డమిత బల సమేతంబుగా నేతెంచి యనేక సన్మానంబులు గావించి యష్టాదశ పట్టణంబులకు విరూపాక్షు నభిషిక్తుం జేసి వస్త్రమాల్యాభరణ కర్పూర తాంబూలంబు లందరికిఁ బొందుగా నొసంగి తన నిజపట్టణంబునకుం జనియెనని సాలంకాయన యతివరేణ్యుండు వైశ్యమునులకుం జెప్పె నివ్విధంబున.

**Colophon :**

ద్విపద.

అని జానకీమనోహరుని పేరఁ-గనకాంబరుని పేరఁ గమలాక్షు పేర

* * * *

అంకితంబుగసంతతానందముగను-గొంకక కీర్తిఁ జంద్రకులగోత్రజుండు
రమణీయగుణవార్ధి రాజమాన్యుండు-కొమరొప్ప నిటికెల గురువయాధిపుఁడు
నాతని ప్రియపుత్రుఁ డమితపుణ్యుండు-గోత్రామరశ్రేణి కృపగలవాఁడు
చతురుండు చెన్నమసెట్టి యాఘనుని-సతియగు లక్ష్మాంబ జలజాతనేత్ర
అమ్మహాసాధ్వి గర్భాంబుధియందు-జన్మించె సంపూర్ణ జలజారికరణి
సమ్మతి శ్రీరామ చంద్రు సత్కృపను-దిమ్మనాహ్వయుఁడన ధీరమానసుఁడు
ధరణి శ్రీవిష్ణు దాసానుదాసుండు-సరససుభాషణ శాంతచిత్తంబు [(లు)
లలరుచుచ్చనసంగ నాఖ్యులనంగఁ-గలితసత్పుత్రులు గల (ఘన) యశోధనుఁడు
గురువయాగ్రజుఁడు శ్రీ గురుసేవపరుఁడు-గురుతరవాణిజ్య కులసంభవులను
రక్షించు కన్యకా రమణిచారిత్ర-యక్షగానముఁజేసె నెనయంగ సకల
బాంధవజనవిప్ర పాదసేవకుఁడు-ఆంధ్రకవిశ్రేష్ఠు లాశీర్వదింపఁ
బొందుగాఁ జెప్పెను బొగడొందఁగాను-అందులోపలఁ దృతీయాశ్వాస మయ్యె.

* * * *

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పద్యకావ్యముగానున్న కన్యకాపురాణపు కథయే మూఁడాశ్వాసముల యక్షగానముగా రచింపఁబడినది. చెన్నమసెట్టికి లక్ష్మాంబకుఁ గుమారుఁడయిన యిటికల తిమ్మయ్య దీనికిఁ గర్త. ఈతఁడు వైశ్యుఁడు. కవినిగూర్చి విశేషము లుదాహృత గ్రంథభాగమునఁ జూచునది.

గ్రంథాంతమం దీ వ్రాఁత గలదు.

"ప్రమోదూతనామ సంవత్సర శ్రావణ శుద్ధ ప్రథమా బుధవారం సరికి కావేరి సముద్రము గోవిందప్ప వ్రాసిన కన్యకచరిత్ర సంపూర్ణము."

ఇందీ గ్రంథాంతరములు గలవు.

1*a* జంగమ కాలజ్ఞానము, 13*a* ఏగంటివారి వచనములు, 17*a* రామస్తవరాజము.

---

## No. 1844. కపోత వాక్యము.

## KAPŌTA VĀKYAMU.

Substance, palm-leaf. Size, 11¼ × 1½ inches. Pages, 59. Lines, 6 on a page Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Complete.

This story which is instructive of high morals is taken from Bhārata-Śāntiparva. It is stated to have been first narrated to Sugrīva by Srī Rāma when Vibhīṣaṇa sought protection of Sri Rāma. The story runs as follows —Once a hunter saw a couple of birds while hunting in a forest and caught the female one. The male bird finding the hunter suffering from extreme hunger, lit fire and put an end to its life by throwing itself into the fire, in order to become food to the hunter. The hunter was very much moved at this and let free the female bird which also died along with its husband. Thereupon the hunter took to the vow of Mahāprasthāna—marching unto death and put an end to his life.

The author is Balabhadradasi, son of Mailāmba and Sōmayya. He dedicated the work to Chennakēśavaśvāmi worshipped at Kappara.

**Beginning :**

శ్రీతరుణియును దాను శేషుని శయ్యమీఁద
నెప్పుడు, క్షీరసాగరమందు గల నరసింహుఁదలఁతుఁ.
గరుడవాహనమెక్కి దిక్కుల ఘనతమించి
తానొక, తరుణివాహనమైన శ్రీధరునిఁదలఁతుఁ.

ధరణిసిరియును తరుణులిద్దఱు దప్పకెపుడూ
నిరుగడ, నెఱుకపాటుగ్రహాయు నాతని బ్రేమదలఁతుఁ.
అత్తనంటిన దోష మనిజనులాడుకొనఁగా
తెలిసిటు లత్తపై పవళించునాతని నాత్మఁదలఁతుఁ.
భావజగురుడన్నిమాయల బరగి భువిని
మెలగిన, వాసుదేవునికప్పర శ్రీదేవుఁదలఁతుఁ.

ద్విపద.

అట్టి శ్రీహరిపాద మాత్మలోపలను-బట్టిసేవింతునా భక్తవత్సలుని
సోమయబసువని సొబగుమీఱఁగను-ప్రేమతో బలభద్రు పేరొప్పఁబెట్టి
కరుణతో మన్నించి గౌరవంబెసగ-వరమిచ్చె నొక మహావాక్య మూహించి

* * * *

అదిపతివ్రతలకు నది పట్టుకొమ్మ-యది పంచమశ్రుతియై జగతిఁబరగుఁ
బత్తులుచేసిన పరోపకార-యతుగానంబన నెల్లవారెఱుఁగఁ
గప్పగ చెన్నుండు కథ తన పేరఁ-జెప్పుచున్నాఁడిట్టి చరితమంతయును
దప్పొప్పులెఱుఁగను దనదుమీకరుణఁ-జెప్పుచున్నా డీకథ చేకొనివినుఁడీ.

క. రఘుపతిపంపున నప్పుడు-అగచరులా యబ్ధిగట్టి యార్చిన భీతిన్
బొగలెగసిపోయి మింటికి-నగములలఘువుడిగి మ్రెసు నాఁటకయుండెన్.

* * * *

వ. అని యిట్లు రఘుపతిని అభయమడిగిన విభీషణుని వాక్యంబులు విని డెబ్బది
రెండు కపిసేనలుఁ గోపించి యాకాశంబుచూచిన నప్పు డెట్టువలెనుండెను.

* * * *

వ. అని సుగ్రీవుండు మఱియేమనుచున్నాఁడు.

జంపె.

* * * *

చనద యీతనిఁగావ మనుజేశ వలదనిన-నినకులాధిపుఁడనియె వనచరునితోటి.

ద్విపద.

* * * *

పక్షులు సహితంబు పగవానిఁగాచె-రక్షింతు నేవాని రక్షింపుమనెను.

* * * *

ఆటతాళము.

ఖగములకుఁ బగ గలిగెనెటువలెఁగానలోన। పగతుఁడు
నొగిలె నెటువలెఁగాచెఁ బక్షులు తగవు మెఱయ॥
అనతిమ్మని భానునందనుఁడడుగ రాముఁ। డీ కథ।
వీనులకు వినవింపుగా వినుపింపఁ దొణఁగెన్॥

**End:**

ద్వి. వక్షుల కెఱుకుకుఁ బరవశపదంబు
నాక్షణంబున నొసఁగి యరిగెనాస్వామి
యదిగాన నీకథ యగచరేశ్వరుఁడ చదివి నముదమముతోఁ జదువంగవిన్న

*　　*　　*　　*

*　　*　　ధర్మంబుగలదు చేరు పుణ్యంబులు చెడఁబాతకములు
అని రాఘవుండిట్టులా నీతిచ్చినను విని కవులందరు విస్మయంబంది

*　　*　　*　　*

హనుమంతుతోఁగూడి యావిభీషణునిఁ గొనివచ్చి రాముని కొలువుతోపలికి.

*　　*　　*　　*

అనిన సంతోషించి యారామవిభుఁడు । వనధిబంధించి రావణు సంహరించి

ద్వి. యని మిపాదులు పొగడ నా విభీషణునినినకులేశుఁడు ఇంకె యేఱంగఁబనిచి
తన దేవితోఁగూడి దశరథాత్మజుఁడు ఎనయఁ బుష్పక మెక్కి నెల్ల వానరులు
తనుఁజేరి కొలువంగఁ దనపురంబునకు-మను జేశుఁడేతెంచె మహిమతో ఘనత్రను.

*　　*　　*　　*

వి-రాళిపదము.　　*　　*　　*

సంతోషము శ్రీహరిదలపఁగఁ బంతములాడుచుఁ బచరించి
శంతుజనకుఁడగు కర్పరనిలయుని-—వింతగఁబాడుఁడిరేమేల.

**Colophon :**

ద్వి. అని కథాస్తంభంబు నఖిలలోకముల వినుతికెక్కిన జగద్విఖ్యాతు పేర

*　　*　　*　　*

బలియుదానవ వంశభంజనుఁడగుచుఁ జెలువందు కప్పుర చెన్నునిపేర
హరిదాస దాసానుసరణ నియమించు మరువన్నెజాతిని మహివెలయువాఁడు
సుమతి సోమయ్యకు శుభగుణవతికి. . . . .మయలాంబికకును బట్టినైనట్టి
ధరవెలయు బలభద్రదాసి శ్రీహరికిఁ బురణింపఁ జెప్పఁగపోతవాక్యంబు
వెలఁగి రఘుపతి మున్ను చెప్పినఫలము గలుగు నీ కథవిన్న ఘనులందరికి(ని).

(వి-వి.)—

సమగ్రము-వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

కిరాతుఁ డొకఁడు వేఁటకేఁగి కపోతదంపతులలో నొకదానిఁ బట్టుటయు, రెండవది యాకలిచేఁ జావనున్నబోయ కాహారమగుట కగ్గిరగిల్చియందుఁ జొచ్చు

టయు, నది చూచి బోయమనసు కరఁగి, రెండవదాని వల నుంచి విడుచుటయు నది కూడఁ దనపతితో సహగమనము చేయుటయు, బోయ విరక్తుఁడై మహాప్రస్థానము జరపి తనువును వీడుటయు నను ప్రశస్త నీతికథ కిది మంచియతుగాన రచనము. శరణాగతుఁడ యిన విభీషణుఁడు రక్షణార్హుఁడని శ్రీరాముడు సుగ్రీవునకుఁ దెలుపుచు నీ కథను జెప్ప నట్టి రచనమున్నది. అసలీకథ భారత శాంతిపర్వముననున్నది. మరువన్నె (మరవణ)? జాతివాడును, వెన్నలాంబకు సోమయ్యకుఁ గొమారుఁడును నగు బలభద్రదాసియే తద్గ్రంథకర్త. కప్పర చెన్న కేశవస్వామికిది సమర్పింతము.

గ్రంథాంతమందిట్లు వ్రాఁతగలదు :—

విరోధినామ సం॥ మాఘ శు 15 ఆదివారం కపోత వాక్యం మద్ది తాతయ్యగారి ప్రతిచూచి వ్రాసినది.

---

## No. 1845. కపోత వాక్యము.

## KAPŌTAVĀKYAMU.

**Substance, palm-leaf. Size, 9⅛ × 1¼ inches. Pages, 75. Lines, 5 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.**

Complete.

Same work as the above.

Name of the scribe, Tirumalarāju Govindarāju. Date of transcription. Sunday the 5th day of the bright fortnight of the month of kārtika in the year Virodhi.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతము లులేవు.

పూర్వమువోలె.

గ్రంథాంతమం దిట్లు వ్రాఁతగలదు.—

యల్లమంద కోటీశ్వరా నీవేకలవు. విరోధినామ సంవత్సర కార్తిక శు 5 భానువారం వరకు తిరుమలరాజు గోవిందరాజు కబోదివాక్యం సంపూర్ణం వ్రాసెను.

---

## No. 1846. క్యము.

## KAPŌTAVĀKYAMU.

**Substance, palm-leaf. Size, 15⅜ × 1¼ inches. Pages, 45. Lines, 5 and 6 on a page. Character, Telugu. Condition, injured and wormeaten Appearance very old. Mode of writing, good but not free from mistakes.**

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వము వోలె.

కడపటి మూఁడాఁకులలో చిత్తూరు గంగాధరకవి భల్లాణ చరిత్ర భాగమును, ధ్యాన శ్లోక మంత్రాదులును గలవు.

---

## No. 1847. కాళింగమర్దనము.

## KĀḶINGAMARDANAMU.

Substance, paper. Size, 11¾ × 8¼ inches. Pages, 21. Lines, 26 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Sāraṅgadhara nāṭakamu 1a and 114a Nalanātakamu 136a Vyavasāyaśāstramu 187a. Kṛṣṇavēṣakatha 200a. Gollaveṣakatha 234a. Samudramathanamu 263a. Dādinīveṣakatha 270a. Egantivārivacanamulu 274a.

Complete.

The puranic story of Lord Kṛṣna killing the serpant Kālinga is described herein, in the form of Yakṣagāna. The author, Venkaṭāpati has dedicated this work to God Pārthasārathy worshipped in Triplīcaṇe, (Madras).

Beginning.—

శ్రీసతినింగొల్చి శంకరుని భజియించి వారి జాసను మదిని వర్ణనచేసి
గణపతిఁ బూజించి ఘనులయిన యామాని వ్యాసాది సత్కవుల వరుసఁ దలఁచి
ముందుగా సరస్వతిని మదిలోన నూహించి అందముగ శృంగార మమరఁజేసి
భూసురపాదాబ్జ భృంగమై తనరెడి వాసనగల కాళిదాసు దలచి
కృష్ణ చరితంబు వేడ్కల చెలువుమీర పరగఁ జెప్పెద జగములఁ బ్రాదిమీర
తప్పు గలిగెనేని తగిన నేర్పరులెల్ల నొప్పుమీరఁగ దిద్దఁడి యొనరవలయు.

ఏకతాళం.

భావముతోఁ దగునే వినిని నమ్మృతపు తావిని మదిని శ్రీదేవి నుతింతుగా
అతులితమగు మునితతులను బ్రోచిన చతురుని గౌరీపతిని భజింతుగా.
పిశాక్షిని మృదుపల్లవపాణిని రాణిని జక్కనివాణి నుతింతుగా.

* * * *

వ. అనిక్కృతి రచనాపరుండగు శ్రీపార్థసారధిని యేమని కొనియాడుచున్నాఁడు.

ఝంపె.

యదుకులంబునఁ బుట్టి యతుల మన్నించుటకు
సదయుఁడై శ్రీపార్థసారథై వెలసెఁ.
బృందావనంబునను బొందుగా నెలకొన్న చందనార్చిత పార్థసారథై వెలుసెఁ.

*　　　*　　　*　　　*

వ. అని యంకితంబుగా నారయొనర్చంబూనిన మహాప్రబంధంబయిన కాళింగమర్ద నంబను యక్షగానంబునకు కథాక్రమం బెటువలెనుండెను.

అని రుక్మిణీ మనోహరుని పేర ఘనుఁడైన యదువంశ గాంభీర్యు పేర
దేవకీ వసుదేవ తనయుని పేర గోపులఁబ్రోచిన గోపాలు పేర
నగధరు పేరఁ బన్నగతల్పు పేర నిగముగోచరు పేర నిఖిలాత్ము పేర
అజగర భోగపర్యంకుని పేర గజరాజ రక్షణకర చక్రుపేర
ఇల తిర్వలిక్కేణి నెలమి వేడుకల చెలుగు వేడుక పార్థసారథి పేర
అంకితలబుగఁ దత్త్వమాద్యం తనియతి పంకజాతుని పాదపద్మ సేవకుడు
సన్నుతమీరంగ సరసులౌగన్కు? వన్నె కెక్కిన నవసింహ వరశాసనుండు
ఘనులయిన వైష్ణవుల కృపదాసుఁడనగ దినకరతేజుడా వెంకటుపతి వరేణ్యుడు
చాలుగా శ్రీపార్థసారథి కరుణలాలిత శబ్దార్థరమణమై నొప్ప
పరగంగ సరసాలంకార? సరణికాళింగ హరిచరిత్రంబు

*　　　*　　　*　　　*

విరచించె నీ కథవిఖ్యాతి వెలయు ధరణిలోనా చంద్రతారార్కముగను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులమయము. శైథిల్యము గ్రంథ పాతములు లేవు.

తిరువల్లికేణిలో వెలసిన పార్థసారథిస్వామి పేర వెంకటుపతియను నతడీ కాళింగ మర్దన యక్షగానమును రచియించెను.

ఇందీ గ్రంథాంతరములుగలవు.—

**1 a, 114 a,** సారంగధరనాటకము, **136 a,** నల నాటకము, **187 a,** వ్యవసాయ శాస్త్రము (ప్రశ్నోత్తరములు) **200 a,** కృష్ణవేష కథ, **234 a,** గొల్లవేష కథ **263 a,** సముద్రమథనము, **270** దాది నీ వేషకథ, **274 a,** ఏగంటివారి వచనములు.

## No. 1848. కాళింగ మర్దనము.

## KĀLINGA MARDANAMU.

Substance, palm-leaf. Size, 16⅝ × 1¼ inches Pages, 46 Lines, 5 on a page. Character, Telugu. Condition, uninjured. Appearance, old. Mode of writing, good, but not free from mistakes.

Begins on fol. 45 (a). The other works herein are.—Kṛṣṇavēṣakatha 1 (a), Rādhāvēṣakatha 30 (a), Pārijātāpaharanamu 35 (a).

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు. పూర్వము నాటి.

ఇందలి గ్రంథాంతరములు గలవు:—

1a కృష్ణ వేష కథ, 30a రాధా వేషకథ, 35a పారిజాతా పహరణము.

---

## No. 1849. కిరాతార్జునీయము.

## KIRĀTĀRJUNĪYAMU.

Substance, palm-leaf. Size, 11¼ × 1¼ inches. Pages, 59. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearnce, old. Mode of writing, good and fairly free from mistakes.

Begins on fol. 71(a). The other works herein are.—Śāradākuravañji 1 (a), Śāradakuravañji (Kanarese) 11 (a), Śāradākuravañji 13 (a), Kannadakuravañji 23 (a), Pārijātāpaharaṇamu (Yakṣagānamu) 27 (a), Subhadrāvivāhamu (Yaksagānamu) 57 (a).

Complete.

Describes Arjuna's fight with God Śiva in the guise of a hunter. The name of the author is Sambayya. For details regarding the author see extracts below.

**End :**

క. ఇటువలె నన్నలు దమ్ములు-పటురయమున హితులు మతులు బాంధవవితతుల్
నిటలాక్షుని హరికరుణను-చెటులత వర్ధిల్లిరపుడు స్థిరకాలమునన్
అనిలాలోక భక్తమందారుని పేర-వినుతి కెక్కిన లోకవిఖ్యాతు పేర
నందివాహను పేర నగచాపు పేర-ఇందుశేఖరు పేర నీశుని పేర
కరిచర్మధరు పేర గౌరీశు పేర . . . . . . . . . .

సకలజీవాత్మక శంభునిపేర-అంకితంబుగను శాస్త్రాగమ ప్రౌఢ
శంకరవరభక్త చరణసేవకుఁడు-గాటమాహోహన కవియైన బొమ్మ
లాట సిద్దయ్యకు నాత్మసంభవుఁడు-యల్లమ్మ సత్పుత్త్రుఁడెల్ల విద్యలకు
బల్లిదుఁడు సిద్దయ్య బలునితమ్ముండు-ప్రతిలేని యట్టి సాంబయ్య రచింపా
నతులితంబగు, కిరాతార్జునీయంబు-కథయక్షగానంబుగాఁగవు లెల్ల
పృథివినచ్చెరువని పొగడుచునుండ-నీచతురబ్ధిపరీత భూస్థలిని
నాచంద్రతార్కమై యొప్పఁగాత !

**Beginning:**

ఉ॥ శ్రీనగజాత జాహ్నవియుఁ జీటికిమాటికి వాదుసేయఁగా
మానక యిద్దఱంఘ్రులకు మక్కువ మ్రొక్కుచునల్కఁదీర్చి యీ
మేనక పుత్త్రినంగమున మేటిగగంగను మౌళినుంచి స
న్మానమొనర్చు శంభుఁడొగి మాకునొసంగు నభీప్సితార్థముల్.

*   *   *   *

ఆటతాళం.

నిత్యనిర్మల మోహనాంగా నిమషంగా-సంతత సత్యజ్ఞానానందరంగా శంభులింగా
దళితదానవమదవిభంగా ధవళితాంగా-లోచన జలజరిపు పావకపతంగా శంభు
లింగా !

*   *   *   *

గీ. అనుచు శంభుని పదములనర్థిఁదలఁచి-యొనయ లేపాక్షి వీరభద్రునికి మ్రొక్కి-
పాకశాసనుఁ గొనియాడి భక్తిమీఱ-రామచంద్రుని వినుతించి రాజసమున

*   *   *   *

తలపేర్లు పులిచార్లుగల చీరమొలజార
తలవంకనెలవంకగల శంభునకును

వ. అంకితంబుగా నా పోకింపం బూనిన కిరాతార్జునీయంబునకుఁ గథాప్రారంభం
బెటువలెను,

త్రిపుట

పాపసంఘము కెల్లదూరము పక్షిమృగసంకుల విహారము
తాపసావలి జీవనం బా ద్వైతవనము,

(వి.వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు
కొలఁదిగా గలవు.

అర్జునుఁడు కిరాతరూపధారియగు శివునితోఁ బోరాడి పాశుపతాస్త్రమును బడయు కథ యక్షగానముగా బొమ్మలాట సాంబయ్యచే రచింపఁబడెను. ఇది మంచి రచనము గల యక్షగానము. గ్రంథకర్తనుగూర్చి ఉదాహృతగ్రంథభాగమున విశేషములు చూచునది.

ఇందలి గ్రంథాంతరము లివి :—

1a, శారదాకురవంజి, 11a శారదాకురవంజి (కన్నడము), 13 a శారదాకురవంజి, 23a కన్నడ కురవంజియు, 27a, పారిజాతాపహరణము (యక్షగానము), 57 సుభద్రా వివాహము (యక్షగానము).

---

## No 1850. కిరాతార్జునీయము.

## KIRĀTĀRJUNĪYAMU.

Substance, palm-leaf. Size, 10⅜ × 1¾ inches. Pages, 20. Lines, 8 on a page. Character, Telugu. Condition, injured Appearance, old Mode of writing, not good and not free from mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁతమంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు చాలహెచ్చు.

పూర్వము వలె.

---

## No. 1851. కిరాతార్జునీయము.

## KIRĀTĀRJUNĪYAMU.

Substance, palm-leaf. Size; 8⅝ × 1 inches. Pages 102. Lines, 4 on a page. Character, Telugu. Condition, badly injured: Appearance, old: Mode of writing, good, but full of mistakes:

Begins on fol. 27 (a). The other work herein is Sugrīvavijayamu 1 (a).

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు హెచ్చు. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చు.

పూర్వము నెం. 11-5-24. (7).
ఇందలి గ్రంథాంతరము.
$1_a$ సుగ్రీవ విజయము.

---

## No. 1852. కురవంజి.

## KURAVAÑJI.

Substance, palm-leaf. Size, 17 × 1½ inches. Pages, 234. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good, but not free from mistakes.

Complete.

Deals with some of the principles of Advaita philosophy written in easy yakṣagāna (song) form, fit for stage. It enables the ordinary people to understand high philosophical topics.

The author is Sannidhānamu Jagannātha Kavi, a Velanāṭi Brahmin, who was a disciple of Śankarācarya of Śṛngeri Mutt.

**Beginning :**

శా. శ్రీ విఘ్నేశ్వరు పాదపద్మములు (సం) సేవించి నాయాత్మలోఁ
భావింతుం బరమేష్ఠి నచ్యుతుని సద్భాలేందుమౌళిం దగన్
(శ్రీవాగ్వాణి రమన్ ?) హిమాచల సుతన్ శ్రీలొందమేలున్నతుల్
గావింతున్ మదిలోని కోర్కెలొసఁగన్ గావ్యార్థ మీడేర్పఁగన్॥

* * * *

వ. అని యభీష్ట ప్రార్థనంబుచేసి మదీయవంశావతారం బభివర్ణించెద॥

ఉ॥ శ్రీ రఘునాథమూర్తి కృపచే వెలయన్ సిరిగాంచి కీర్తి వి
స్ఫారత మీఱ సంతతము సాధుజనావనతం జెలంగి శృం
గారకళా ప్రబంధకవిగాయక పండితుఁడైన ధర్మసం
చారుఁడు సన్నిధానకుల చంద్రుఁడు బాలకవీంద్రుఁ డెన్నఁగన్॥

క॥ ఆతనివర్గంబున వి-ఖ్యాతులు నలుగురు జనించి కడుముద మొప్పన్
ధాతసములైరి తెలియఁగ-నాతత శ్రీ జగ్గకవిని నలవేపొగడన్॥

సీ. గుఱుతుగాఁ గాశ్యపగోత్ర పవిత్రుండు-వెలనాటికులమున వెలయు జగ్గ
కవిసుందరాంబ సద్గర్భ సంభూతులౌ-నలుగురు పుత్రులానంద మొప్ప
నందు నమ్మయకును నదివీగు పేరమ్మ-పుత్రద్వయము నొకపుత్రిఁగాంచె
జగ్గయ్య కనుజాతాజయ సుందరప్పయు-గురులింగమును మహాగుణయుతుండు
నందుజ్యేష్ఠుండు గురు కృపనలరి పరమ-భక్తతతిపాద పద్మముల్ భజనచేసి
జీవమొరుకల కురవంజి చెప్పఁబూని-సావధానతచిత్తుఁడై సంతసమున॥

చ. గురువరపాదుకల్మదినిగూరిమితోడుతఁ బూజసేయుచున్
హరిహరబ్రహ్మశక్తులను నాత్మఁదలంచి నమస్కరింపుచున్
పరమపవిత్రమై చెలఁగు భక్తగణంబుల సన్నుతింపుచున్
మరిమరి రాజయోగ నిజమర్మములే వివరింతునేర్పడన్॥

వ. శ్రీమద్వైద వేదాంత రహస్య ప్రవీణానంద పరిపూర్ణ పరిశాంత శ్రీమచ్ఛంకరాచార్య కరుణాకటాక్షవీక్షణాలబ్ధ వరప్రసాద మానసోచిత నియమంబున బుధులసేవ యొనర్చి యథాశక్తి ప్రకారంబున జీవోత్పత్తియును, జీవ ప్రవర్తనయును, జీవన్ముక్తి గోరుటయును, తత్కార్యార్థియై గురుధ్యానంబు సేయుటయును, నిత్యనిరంజన నిరావలంబమైన గురుకృపావిశేషంబువలన సుకర్మయెఱుకుల వేషధారియగుటయును, తదనంతరంబున జీవేశ్వరులు పంచాశద్వర్ణబిందు సంయుక్త చక్రావృతనిర్ణయ ప్రవర్తనయును, తత్త్వమస్యాది వాక్యార్థ సంబోధనయును, మూలప్రకృతి యెరుకుపురుష (వేష ?) ధారియగుటయును, సింగిసింగఁడు జగద్విధికొఱకు వాదప్రతివాదంబులు సల్పుటయును, ద్వంద్వ జీవభావంబును, ద్వంద్వ కర్మపురుషత్వంబును, ఇహపరలోక సంప్రాప్తియును, వివేక కైవల్యముక్తి ప్రాపంబును, సగుణ నిర్గుణభేద నిర్ణయ ప్రమాణ పూర్వకంబైన యెఱుకుల కురవంజియను యక్షగానంబను, మహాప్రబంధంబునందు రాగజ్ఞానయజ్ఞాన బ్రహ్మజ్ఞానంబులఁ బ్రవర్తిల్లునట్టి కథాక్రమం బెట్టిదనిన॥

తే॥ కర్మమెడలించ నేరని కారణమున దుర్మదాంధత దుష్క్రియల్ దునుముకొఱకు
బుధుల సద్గోష్ఠి సేయంగ బుద్ధిఁదలఁచి జీవసతివచ్చె సంతోషభావమలర॥

**End :**

వ. ఈలాగున సమ్మతింపంజేసి॥

ఏలపదము.

నీవు నేనుఁగూడి భావనకొలఁది జీవులకొసఁగుచుఁ జెలఁగుచుందామే॥ నీవు॥
సావధానులు ముక్తి సరణినొందించి కేవల బ్రహ్మము కీలుఁదెల్పుదమే॥ నీవు॥

* * * *

కర్మజీవులకెల్లఁ గామ్యములిచ్చి మర్మపెట్టుచు వారి మసలఁజేయుదమే॥ నీవు॥ [నీవు॥
సరససన్నిధి రాజు జగ్గ కవి నెప్పుడు పరమసాయుజ్యమునఁ బ్రబలఁజేయుదమే॥

**Colophon:**

గద్య॥ ఇది శ్రీమద్వైద వేదాంత రహస్య ప్రణవగృహాంతరాళ నిలయ పరమహంస పరివ్రాజకాచార్య సర్వతంత్ర స్వతంత్ర శృంగభేరీ సింహాసనస్థిత శ్రీమచ్ఛంకరాచార్య వర్య పాదారవింద మకరంద పానమిళింద మానస సన్నిధిరాజు వంశ పారావార రాకాశశాంక అమ్మయ సుపుత్ర జగన్నాథ నామధేయ ప్రణీతంబైన యెఱుకల కురవంజియను యక్షగాన మహాప్రబంధంబునందు సర్వంబును నేకాశ్వాసము॥

క. ఇది విన్న వ్రాసిచదివిన సవమల సుజ్ఞానతత్వ సాధనులగుచున్
ముదమున నిహసుఖములచేఁ బడపడి పరమందు ముక్తిప్రాప్తులు గారే॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

కురవంజియని పేరుగల యీ యక్షగాన మద్వైత వేదాంత ప్రతిపాదకము. ఇందలి విషయానుక్రమణి యుదాహృత గ్రంథభాగమునఁ జూడనగును. ప్రౌఢమయిన వేదాంత విషయము సర్వసులభమగుటకై యిట్లుకొఱవవారి యాటపాటల రూపమున దృశ్యముగా రచింపఁబడినది. కొఱవలలోఁ గొందఱకు ఎఱుక చెప్పుట జీవిక. ఇట్టి యక్షగానములందు 'ఎఱుక' చెప్పువారును పాత్రలుగానుందురు. సింగి, సింగఁడుననుకొఱవవారు కథానాయికా నాయకులు. ఈ యక్షగానమును సన్నిధానము జగన్నాథ కవి రచించెను. అతఁడు శృంగేరి మఠాధీశ్వరులగు శంకరాచార్యులవారి శిష్యుడు-వెలనాటి బ్రాహ్మణుఁడు. గ్రంథమున గ్రంథకర్త యింటిపేరు సన్నిధానమువారని, సన్నిధి రాజు వారని కూడఁ గలదు. ఉదాహృత పద్యములఁ బట్టి గ్రంథకర్తనుగూర్చి విశేషము తెలుఁగనగును.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు.

"నందన సం॥ భాద్రపద శు 15 ఆదివారంనాటికి. ఈ కురవంజి మాజేటి సర్వేశలింగం ఈ చంద్రశేఖరుడు దస్తూరిలను వ్రాసినది".

---

## No. 1853. కురవంజి.

## KURAVAÑJI.

Substance, palm-leaf. Size, $12\frac{3}{8} \times 1\frac{3}{8}$ inches. Pages, 141. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly worn eaten. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

Name of the scribe, Parangi Bāpayya.

Date of transcription, Thursday the 15th day of the bright fortnight in the month of Mārgasira in the year Nandana.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథ పాతములు లేవు.

పూర్వము వా॰ తె. 13-9-35.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు.

నందననామ సంవత్సర మార్గశిర శు 15 గురువారం రోజుకు శుభద్రకాళీసమేత ఉప్పాంగల రామలింగార్పణంగా పరంగి బాపయ్య యెరుకల కురవంజి సంపూర్ణంగా వ్రాసి సమర్పించెను,

## No. 1854. కురవంజి.

## KURAVAÑJI.

**Substance, palm-leaf. Size, 12½ × 1½ inches. Pages, 10. Lines, 8 on a page. Character, Telugu. Condition, uninjured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.**

**Complete.**

In this small work, Goddess Saraswati assumes the Character of a soothsayer, goes to Kuṇḍina nagaram, foretells certain events to Rukmini, who gives her rich presents, meets her husband, also a soothsayer, who comes in search of her, and takes leave of Rukmini.

The name of the author is not known.

**Beginning :**

నాగేంద్రభూషణు సమరంగదలఁచి కమలగర్భునిఁ జాలఁగాంతఁనుతించి
విమలభాషాదేవి వేడ్కఁగొనియాడి

*   *   *   *   *

చన్న సత్కవులను సన్నుతిచేసి కొరవంజిచెప్పెదఁ గొమరొప్పఁగాను.

వ. ఇట్లు కుండినపురాధీశ్వరుండయిన గోపాలకృష్ణునికి అంకితంబుగా నా రొనర్పంబూనిన కథాక్రమం బెట్టిదనిన,

**End :**

వ. అప్పుడు వధూవరులు తమరు భాషించువిధం బెటువలెనుండెను,

ఏ వేవోసింగి యిందేల వచ్చినావో
తోడ రుక్మిణమ్మ పిల్వనంపవస్తిరా !
కాపురమ్ముకొల్ల వుచ్చి గాడుమీఱివచ్చినావు
అప్పదుడ్డుకేను యెఱుకచెప్పవస్తిరా !
ఇంతజాగులెల యింత తాళుకోవె
పంతమునాతోడ బలికేవుయేమికో
సీరుకోడి కాలుకొంటు నెమిలిపిట్ట గిజ్జిగాడు
గోరింకవైదికంటె గువ్వవరిగపిట్టలు
తెల్లకొంగ నల్లచిలక తెలుపలేని పక్షులెల్ల
కల్లగాడుపట్టితెస్తి కౌజు పొట్టిపిట్టలు
పరువైనపావురాలు పాలపిట్టయేట్రింత
వరుసవేఁటలాడితెస్తి వన్నెవన్నెపిట్టలు

ఇట్లు జాతీయంపుఁబలుకుల సంతోషంపుట్టించి విహరించుచున్న సమయంబున రుక్మిణీదేవి చిత్తంబురంజిల్లి వధూవరులకు కట్టువర్గంబులు కనకమణిభూషణంబులునొసంగి

సంతుష్టులం జేసిన సంతసిల్లి పరిపూర్ణమనోరథులయిన దేవదేవియయిన రుక్మిణీదేవి నమస్కరించి నిజనివాసంబులకుం జనిరను కథంగల కురవంజి సంపూర్ణం.

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులుగలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

సరస్వతీదేవి ఎఱుకతరూపుగాని శ్రీకృష్ణదేవుని భార్యయగు రుక్మిణీదేవికి ఎఱుకచెప్పుట యిందలి కథ—కర్తపేరెఱుఁగరాదు.

---

## No. 1855. కురవంజి.

## KURAVAÑJI.

Substance, palm-leaf. Size, $18\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 21. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, not good and not free from mistakes.

Begins on fol. 5*a*. The other works herein are:—Śaraṇāgatadvipada 1*a*. Viṣṇubhaktacaritramu 16*a*.

Complete.

The philosophical instructions bearing on Viśiṣṭādvaita, given to the wife of the king of Śrīperumbūdūr by Sri Rāmānuja, who is an incarnation of Ādiśēṣa, in the guise of a soothsayer form the theme of this work.

The name of the author is Panihāram Yembārayya.

**Beginning :**

శ్రీపతియైన యాశ్రిత పారిజాతుఁ
డాపద్విమోచనుం డఖిలాంతరాత్ము
డానందమయుఁడు బ్రహ్మాత్మస్వరూపి
జ్ఞానశక్త్యాదికజ్ఞాతృసంబంధి
సత్యసంకల్పుఁడా సర్వేశ్వరుండు
నిత్యముక్తులఁగూడి నిత్యానుభవము.
తిరుమేనునిడుకొని తిరుగానుండి
అరసి శేషునిఁ బిలిచి యాత్మలదిద్ద
పుడమిలోఁ బూదూరఁ బుట్టఁ బొమ్మనిన
నొడఁబడియుడయవరొప్పి వేంచేసి
అలముక్తజీవుల కట్లు కైంకర్య
కలనకు సంప్రాప్తి కలిగిన విషయ
భోగులై లీలావిభూతిలోఁ బ్రకృతి
లాగంగ సుజ్ఞానలవమింతలేక

పక్షముల్ విఱిగిన పక్షులరీతి
అక్షరజ్ఞాన శక్త్యాదులుదొలఁగి
పలవించుచున్నట్టి బద్ధులఁజూచి
కళమీఱ శ్రీ భాష్యకారులంతటను
కారుణ్యమున నెఱుకగలిగిన పురుష
కారరూపముదాల్చి కలయ నారాజు
పాలములో నాతని పాలఁతికి నెఱుక
గలుపనే తెంచిన క్రమమెట్టిదనిన.

మాలవి. అటతాళం.

కొదవయించుక లేని గుణములు కోటిసూర్యప్రకాశమై
మదనగురువేషములుగైకొని మర్మములు గనిపించుచున్
వచ్చె నెఱుకతవా !
వచ్చె నెరుకత వారివారికి వచనభూషణలాలుకుచున్
మెచ్చుగలిగిన యాత్మలాభము మేలుఫలముగనందుచున్
వచ్చె నెఱుకతవా !
తిరుగాఁదిరుముడియు నేల్వయు దీప్తిమెఱయు నుత్తరీయమున్
తోరముగ సప్తకాంచల మరగు దారయు దోవతికట్టుతో.

**End :**

వరవరద్వయమను వరముని వెంట
కురవంజియను కృతికుమతులకొఱకు
పెరియద్వయంబుతోఁ బ్రియమెప్పఁబూని
ఆర్యత్వమునను మాయాచార్యయాజ్ఞ
వలనొప్ప పణిహారవంశాబ్ధివిధుఁడు
ఆదిపద్మాధినాయకు కటాక్షమున
వర్ధిల్లుదురు భక్తవరులు మోదమున.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యముగలదు గ్రంథపాతము లెడనెడగలవు.

ఆదిశేషుఁడు భూమిపై శ్రీ పెరుంబూదూర భాష్యకారులుగా నవతరించి యెఱుకు వేషమున నాతూరిరాజు భార్యకు నెఱుక చెప్పుతెఱఁగున నాధ్యాత్మిక తత్త్వోపదేశము చేయుట యీ యక్షగాన కథావస్తువు. విశిష్టాద్వైత సిద్ధాంతబోధ మిందులో నెరుకచెప్పుట. ఎఱుకువారు కథాప్రయోక్తలుగానుండు యక్షగాన రచనములకు "కురవంజి" యనిపేరు. ఏ తద్గ్రంథకర్త పణిహారం రెంబారయ్య.

గ్రంథాంతమం దీవ్రాఁతగలదు,

"రుధిరోద్గారినామ సంవత్సరం మార్గశిర నెల 10 వ తేది దశమీ శుక్రవారంనాడు శోభా వెంకట రెడ్డి కుమారుడు తన స్వహస్త లిఖితంగ వ్రాసి కుమారుడు రంగశాయి నాయడికి వ్రాసియిచ్చిన కురవంజి శాతుమొర సంపూర్ణం."

ఇందే గ్రంథాంతరములు గలవు.

1*a* శరణాగతి ద్విపద, 16*a* విష్ణుభక్త చరిత్రము.

---

## No. 1856. కురవంజి.

## KURAVAÑJI.

**Substance, palm-leaf. Size, 10 × 1¼ inches. Pages, 42. Lines, 7 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.**

**Complete.**

Describes the story of the marriage of God Śiva with Pārvati, daughter of Himavanta. The name of the author is Gurusiddhalingamu.

**Beginning :**

క. శ్రీశైల నాథు ప్రేమను - నాశైల జ్యేష్ఠపుత్త్రినభినుతి చేసిన్
భాసిల్లి ప్రమథవర్యుల - వాసిగవినుతింతు భక్తివాంఛా ప్రౌఢిన్.

క. సిరిగిరి భ్రమరయు కరుణను - చరమూర్తిన్ హరికంద సద్గురుకృపచే
వరసిద్ధలింగమింపుగఁ - గురవంజి రచించె సభలఁ గొనియాడంగన్.

క. సోమేశ్వరునవకవులను - భీమన్నసు శేషనాథుఁ బ్రియమునఁదలఁతున్
సామజదైత్యవిభంజను - వామాంగముగల్గు నార్యవరు లబ్ధముగాన్.

**End :**

అనియిట్లు భ్రమరాంబికా మనోనాథు
గొనియాడుచున్నది గోరిక లలర
హరిత కందాహ్వయుండగు సిద్ధలింగ
గురుకర జనితుఁడా గురుసిద్ధలింగ
మతిభక్తి (?) శ్రీగిరి కురవంజి
హితవుగా రచియించె నీప్సితార్థములఁ
కరుణించు శ్రీ మల్లికార్జున స్వామి
కురవంజి వ్రాసినఁ గూర్మిఁ జదివిన
హరుభక్తివిన్నను నంబికానాథు
స్థిరతరైశ్వర్యంబు చెన్నొందుచునుచు

నాయురారోగ్యంబులాభివృద్ధియును
దానిచ్చి యాచంద్రస్థాయిగాఁజూచు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పు లున్నవి. శైథిల్యము లేదు గ్రంథపాఠములు లేవు.

శ్రీ మహాదేవుడు హిమవంతుని పుత్త్రియగు పార్వతిని వివాహమాడు కథ కురవంజి యక్షగానరూపమున రచింపఁబడినది. గ్రంథకర్త పేరు గురుసిద్ధలింగము.

---

## No. 1857. కురవంజి.

## KURAVAÑJI.

**Substance, palm-leaf. Size. 15¾ × 1¼ inches. Pages, 9. Lines, 7 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.**

Begins on fol. 21*a*. The other works herein are :—Pātalu, etc. (Songs) 1*a*. Rāmēśvaralingadaṇḍakamu 19*a*. Sāmudrikalakṣana, etc. 25*b*. Hanumaddandakamu 29*a*.

Complete.

An allegory, written on the lines of Prabōdha candrōdaya in Sanskrit, describing in the form of yakṣagāna, the marriage of ఓంకార (bridegroom) with మనశ్శాంత mind (bride) as narrated by a soothsayer. Some of the topics relating to Yōga and Vēdanta are herein dealt with.

The author is Kōvuri Gangadharakavi, son of Pāpamāmbā and Pullamarāju.

**Beginning ;**

ఓంకార మహాత్మ్యంబునకు అద్వైత బాహ్యంబైన ముక్తికాంతా మనోవిభుండైన వేదాంతంబునకు కురవంజి కథాక్రమంబెట్టిదనిన:—అవ్వోయవ్వ యెఱుకసాని వచ్చెనట యెటువలెను.

రంగుమీఱఁగ నాత్మ రంజిల్లుచుండ - పొంగుచువచ్చెను పోలుపొందుమదని
పంచభూతంబులు బంధించికట్టి - పంచవింశతి తత్త్వభావంబులనిన
ప్రాణావసానంబు పరగంగఁగూర్చి - వీణచేఁబట్టుక వెలఁదిశావచ్చె
స్థిరమనుపుటికను శిరమునసుంచి - కరయుచేఁబట్టియు గ్రమమొప్పుచుండ
సమము మనోవాయు సంయోగమగుచు - అమనస్కమనుచును నాపుట్టిదించి
హృదయపద్మంబున నొప్పుతోనుంచి - కదలకకూర్చుండి ఘనముగాఁజెప్పె.

వ. ఇట్లు యెఱుకలసాని మనశ్శాంతకు ఎఱుకచెప్పే సమయంబున దేవతాప్రార్థనంబు చేసెనటు యెటువలెను,

శ్రీ వేంకటాధీశ చిత్తంబులోన - భావించి మ్రొక్కెద భక్తితో నిపుడు
కంచివరదరాజ కనకాద్రివాస - పంచరాముల నేను ప్రస్తుతించెదను
శ్రీశైలమల్లేశ శివపారిజాత - శ్రీశైలభ్రమరాంబ చెలువంపు బొమ్మ
అన్నపూర్ణా నిన్ను నాత్మలోఁదలఁతు - వన్నెమీఱఁగ నాత్మవెన్ను నిఁదలఁతు

*　　*　　*　　*

మాచెర్ల చెన్నుని మదిలోనఁదలఁతు - కాచి రక్షించు మీ కంబుకంధరుడ
కారెమపూఁడిలో క్రమముతో నున్న - కోరి చెన్నుని నిన్ను గుఱుతుగాఁదలఁతు

*　　*　　*　　*

ఎలమందకోటప్ప యీశ్వరానిన్ను

*　　*　　*　　*

పరగగోగులపాటి పట్టణవాస - కరుణచేయుము మమ్ముఁ గాలకంరేశ

*　　*　　*　　*

కలికావతారమై క్రమముప్పినావు - నీకువందనమయ్య నీరజాక్షుండ
నాకువాకున నిల్చిమమ్మురక్షించు.

వ. ఊర్ధ్వమూల మధశ్శాఖమనే యుపనిషద్భగవద్వాక్యములు అర్జునునకు జెప్పె దేదే మాయవ్వ కర్మబద్ధుండైన జీవుండు బహురూపంబుల నానాజంతు గర్భంబుల శుక్ల శోణి తంబులచేత నండంబై యటుమీదట పిండంబౌను తదనంతరంబు కరచరణంబు లేర్పడును.

**End :**

వ. జీంకారానికి మనశికాంతకు వివాహంబు చేసే క్రమంబెట్టిదనిన :

ద్వి. జోడుమేళంబులు కూడి మ్రోయంగ - యిడపింగళానాడి యొలమిశోభనము
పాటలుపాడెటి పణతులుగలరు - పాటుగా నీమముల్ పరగనేత్రములు
తనువుపుందిటిలోన తవనరుగులుధి - మనసున సద్గురుమాటనేసలును
మూలమంత్రమనేటి ముగుదనుగూర్చి - నాలాయమున తెర వరుసతోఁబట్టి
పొంగుచుతలబ్రాలు పోసిరచ్చటను

*　　*　　*　　*

శుభశోభనంబాయె శుభముహూర్తమున - అభిమతముగ మేము యొఱక చెప్పితిమి.

**Colophon :**

ద్వి. సరసోక్తిగా యజుశ్శాఖాన్వయుండు - గురుతుగా హరిత సగోత్రోద్భవుండు
వరనమై కోసూరి వంశంబునందు - గాంభీర్యనిరతుండు గంగరాజునకు
పుణ్యపుత్రుఁడు పుల్లమరాజగలఁడు - ఆతనికిఁగులసతి యగుపాపమాంబ
ఆయింతి గర్భంబునందుదయించి - గంగాధరుండును కవినామచంద్రు
స్థిరబుద్ధితో భక్తిశ్రేష్ఠునిగాను - మీఱఁగఁజేసిన దీనరక్షకుఁడు

బుధులు రాజులు కవిశ్రేష్ఠులుమెచ్చ - బాగుగా నోంకార ప్రణవనాదంబు
శ్రీకరంబుగ మోక్షసిద్ధిని జేయు - నీకథయెవ్వరు వివేకమునను
చదివినభక్తియు సాధించవచ్చు - క్రమమొప్ప దేవునిఁ గనుఁగొనవచ్చు
చదివివ్రాసిన సత్పురుషులాకు - ముదముతో పరమాత్మ మోక్షంబులిచ్చు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

వేదాంత విషయకమైన యీ యక్షగానమం దోంకారమునకు మనఃకాంతకు వివాహము జరిగుటయను కల్పనాకథ ఎఱుకత యొఱుక సెప్పునట్లు రచింపఁబడినది. ఇందు రూఢవేదాంత విషయములు గొన్ని వివరింపఁబడినవి. సంస్కృతమునఁగల ప్రబోధ చంద్రోదయాది నాటకముల పద్ధతి కిదియనుకరణ మనవచ్చును. గ్రంథకర్తయగు కోసూరి గంగాధర కవి పాపమాంబా పుల్లమ రాజుల కొడుకు. విశేషముల కుదాహృత గ్రంథభాగముఁ జూచునది.

ఇందీ గ్రంథాంతరములు గలవు.

1*a* పాటలు మొదలగు చిల్లర, 19*a* రామేశలింగదండకము, 25*b* సాముద్రిక లక్షణము మొదలగు చిల్లర, 29*a* హనుమద్దండకము.

---

## No. 1858. కురవంజి.

## KURAVANJI.

**Substance, palm-leaf. Size, 13½ × 1¼ inches. Pages, 15. Lines, 5 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.**

**Begins on fol. 1 *a*. The other works herein are ;—Guruśiṣya Samvādamu, etc., 8 *a*.**

**Incomplete.**

**Same work as the above.**

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

8a గురుశిష్య సంవాదము, పాటలు వగైరా చిల్లర.

## No. 1859. కృష్ణజననము.

## KṚṢṆAJANANAMU.

**Substance, palm-leaf. Size, 12½ × 1⅛ inches. Pages, 17. Lines, 4 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.**

**Incomplete.**

**About the birth of Sri Kṛsna. The name of the author is not known.**

**Beginning :**

వలనొప్పదేవకి వనిత తెన్నంగ - నెలదప్పినంతలో నెలంతుకమేలు
చిన్నెలు పొడసూపెఁ జెలియవేవిళ్లు - అన్నంబు ముట్టదు అతివ ప్రియమయిన

**End :**

మంత్రసానిని బిలువవలె, నమ్మాలార,
మంత్రసానిని బిలువలె నమ్మా !
ఎన్నడూ నేనెఱుగనే అమ్మా, నో
వెన్ని విధములు దిరుగునే,
నిన్నవేళనుంచి నిద్దురయినా పట్టనియ్యదు
కన్నవిన్నవారు యేమనుకొన్న నేమిక సిగ్గుపోచదు.
పక్కబిగ బట్టరే, దేవళ్లకయినా
మొక్కిమీఁదులు గట్టరే
అక్కరో ఇక నొప్పులధికము ఒక్క నిమిషము తాళజాలను,
గ్రక్కునను గరుణించి యిప్పుడు కక్కసములాడక వేగమె,
మంత్రసానిని బిలువక, స్వతంత్రమేటికి చేసెదరుమీ
మంత్ర తంత్రము ఋనిగొనదు నడుమంతరము యేమింతలేటికి,
మంత్రసానిని బిలువరమ్మా.
మొగవాడు గల్గెనమ్మా మోహనాంగికి
జగము లెల్లనునేలు శంఖచక్రములున్నవి.
బోటిరో పాటిగాఁజూచి బొడ్డుగోయ్యారే
నేటిగాను వేగమున కాలి నీళ్లు చల్లారే
అంగములు చక్కఁగఁజేసి అంగిలొత్తరే, వేగమున
ఆముదానవేళ్లు గుడుపరే
రంగైనట్టి నిమ్మపండ్ల రసమునుంచారే
. . . ళుపాన్ని నీళ్లపోనేటంతలోనే పొత్తిళ్లపరవలె (క?)
కట్టారే బాలెంతకు వాసెన ఘట్టిగా వోశమ్మ, నుదటు,
బెట్టారె యిద్దరికి చుక్కబొట్టు వోకొమ్మా !

ఇక్కడికిసరి.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పుల కుప్ప. శైథిల్యము, గ్రంథపాత ములు లేవు.

శ్రీకృష్ణుని జననము వట్టిదియేదో యక్షగానములోనిది గాదగును. కర్తపే రెఱుఁగరాదు.

---

## No. 1860. కృష్ణవేషకథ.

## KṚṢṆAVĒSAKATHA.

Substance, palm-leaf. Size, 16⅞ × 1¼ inches. Pages, 57. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured and wormeaten. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 1a of the MS. described under No. 1849 ante.

Complete.

This forms a portion of Bhāgavata Yakṣagāna and describes the story of Kṛṣṇa's search for his eight queens, his union with Radha and such other love episodes.

**Beginning :**

వ. హాహాహావోరీ మాధవా - యెవరయ్యా స్వామీ॥
వోరీ మాధవా.

గీ. శ్రీకైవల్య ఫలముల - నేకముగా నొసగి కరుణనేలి జగములన్
ప్రాకటముగ రక్షించెడి - లోకారాధ్యుండ నన్నేలుగదా సుగుణా.

వ. హాహాహావోరి మాధవా, విన్నావటరా వోరీమాధవా॥
విన్నాను, కొన్నాను, తిన్నాను, మీరుయెవరయ్యా స్వామీ॥
వోరీనన్నెరుగ వటరావోరీ మాధవా॥
నేనుయెరుగను గదవయ్యా॥
అయితే తెలియ జెప్పతునాను వినరావోరీ మాధవా.

సీ. బ్రహ్మాదిసురలసంప్రార్థనగైకొని - వసుదేవసుతుడనై వసుధవెలసి
నందనుండని మిగులనానంద మొందగా - పోషించ బాల్య విశేషణమున
పూతనచనుబాలు పుక్కిటనటుబిల్చి - కుటిలాత్ము శకటుని కూలదన్ని
మత్తులై చెనగొన్న మద్దుల బడగూల్చి - కంసాదిబలుల దోర్గర్వమణచి
బలుడు మొదలైన యాదవబలముతోడ - ప్రబలియుందుము ద్వారకాపట్టణమున
కార్మిసతి మాకు రుక్మిణీకోమలాంగి - వరుస నాపేరు గోపాలవల్లభుండు.

* * *

**End :**

హో రాధా, నేనుపోయి వత్తునటవే – హోకృష్ణా.

ఆది. యేమిశేతు తాళజాల చెన్నకృష్ణా – యెంతగా వేగింతునోయి చెన్నకృష్ణా
ఆలాగేకూడి యుండా మీ వోరాధా – అతివేగ వచ్చెదనే వోరాధా
వేగముగ రాగదోయి వీరరాఘవా – వేగింపలేనోయి చెన్నకృష్ణా
పోయివత్తునటవే పూబోణీ – పోయివేగ రావోయి చెన్నకృష్ణా.

అటతాళం. సింహాసనంబులు యెక్కుడనున్నవి చెన్నకృష్ణా
యిన్నివిధంబులు యిప్పుడె బోయిరావోయి చిన్నికృష్ణా.
రామారాఘవ రాజీవలోచన – కామితవరదా కరివరదా.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

ఇది భాగవత యక్షగానములోని భాగమై యుండును. ఇందు కృష్ణుడు తన కష్టభార్యల నన్వేషించుట, రాధంగలయుట మున్నగు కథ గలదు. వెకలి శృంగారముతో నిది పరమ పామర రంజకముగా నున్నది.

ఇందలి గ్రంథాంతరములకై కాళింగమర్దనము చూచునది.

---

## No. 1861. కృష్ణవేషకథ.

## KṚṢṆAVEṢAKATHA.

Substance, paper. Size, $11\frac{3}{4} \times 8\frac{1}{4}$ inches. Pages, 30. Lines, 27 on a page. Character, Telugu. Condition, uninjured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 200a of the MS. described under No. 1847 ante.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

ఇందలి గ్రంథాంతరములకు కాళింగమర్దనము చూచునది.

## No. 1862. కృష్ణవేషకథ.

## KṚṢṆAVĒṢAKATHA.

**Substance, paper. Size, 13½ × 8 inches. Pages, 12. Lines, 23 on a page. Character, Telugu. Condition, fair. Appearance, not old. Mode of writing, fair but not free from mistakes.**

Begins on fol 1*a*. The other works herein are : Āndhradīpika 12*a*, Dēśīyapadanighantuvu 23*a*, Vaidyanighantuvu 48*a*, Śivayōgasāramu 108*a*, Caudappaśatakamu 120*a*, Vemanapadyamulu 129*a*, Vijayavilāsa (com.) 141*a*.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

ఇందలి గ్రంథాంతరములివి :—

12*a* ఆంధ్రదీపిక, 23*a* దేశీయపద నిఘంటువు, 48*a* వైద్య నిఘంటువు, 108*a* శివయోగసారము, 120*a* చౌడప్ప శతకము, 129*a* వేమన పద్యములు, 141*a* విజయవిలాస వ్యాఖ్యానము.

---

## No. 1863. కృష్ణవిలాసము.

## KṚṢṆAVILĀŚAMU.

**Substance, palm-leaf. Size, 14¾ × 2 inches. Pages, 36. Lines 10 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good but not free from mistakes.**

Incomplete.

The wonderful deeds of Sri Kṛṣna as described in the tenth Skandha of Bhāgavatapurāṇa form the subject of this Yakṣagāna. Compositions, such as ēlalu, daruvulu, tribhangulu, ardhacandrikālu, gobbiḻḻu, etc., which are peculiar to Āndhradēśa, are introduced in this. The name of the author is Vennamudda Ganapati Peddakavi.

**Beginning :**

శా. శ్రీరామా నిను నెంతు నేనుమదిలో సీతామనోనాయకా
ఘోరాకారమదారిదైత్య హరణా కోట్యర్క తేజోమయా
నీరేజాసన సేవితాంఘ్రి కమలా నీవాండ నన్నేలుమీ
కారుణ్యాకర రాఘవాన్వయమణీ కాకుత్స్థవంశాగ్రణీ !

వ. ఇట్లు కృతీశ్వరుండైన రామస్వామిని నుతియించి హరిహరబ్రహ్మాదుల నేమని కొనియాడుచున్నాఁడు.

త్రిపుట.

సిరికిఁజెప్పక సురికి మకరిని నరికి వేగమె దరికినీడ్చు
కరికి నభయంబొసగు నరహరికి శరణు
మంటి రథమట గుంటివిల్లట జంటనాలుక యల్లెత్రాడట
కంటిమంటల మరునిఁగెలిచిన ఘనునిఁగొలుతు.

* * * *

వ. ఇటువలె సకల దేవతాప్రార్థనంబును సుకవులకు వందనంబు నాచరించి శ్రీమన్మహాభాగవతంబునందు శ్రీ కృష్ణలీలలు వర్ణన సేయందలంచియున్నాఁడు.

సీ. నిగమగోచరుఁడైన నీలాద్రినిలయుండు - విప్రవేషముదాల్చి వేడ్కతోను
ఒకచేతఁబెత్తము నుత్తరీయంబును - ముసిముసి నగవుతో మోదమునను
మధ్యాహ్నవేళ నామందిరంబునవచ్చి - దాహంబుదెమ్మంచుఁ దరువులిడుచు
మాధవుచరితలు మంచివాఁడవు నీవు - రచియింపుమిఁకఁజాల రమ్యమౌను
వినుము మాపల్కులన్నియు వీనులలర - కనుము మోక్షంబు శ్రీహరికథలవలన
మనుము సుజ్ఞానివై చాల మక్కుఁదలఁచి - మనసురంజిల్ల నిట్లనె మాధవుండు.

క. నడవడిగలిగిన యప్పుడె - యడయఁగవలె విష్ణుభక్తి పదిలుఁడవైతే
విడువకు కృష్ణునిచరితలు - కడువేడుక వెన్నముద్ద గణపతిపెద్దా !

* * * *

వ. ఆ సమయంబున వ్రేఁతలు పాలున్నేతుల వసంతంబులాడిరట యెటువలెను.

త్రిభంగులు.

పసుపులందము మేనఁబూసి, మంచి - పాలునేతులు చల్లఁబోసి,
బిసరుహాక్షులు గుములుగూడి, దొడ్డ - బిడ్డనుచు వసంతంబులాడి
గోపకాంతలు వగలనేర్చి, శౌరి రూపరేఖలు మదినిజేర్చి
మాపురేపును ముద్దుబాలా, మన - చూపులకు వింతౌరాఁబాలా.

వ. అని యిటువలె వసంతంబులాడి 'యల్లో నేరేళ్లు' పాడిరట యెటువలెను.

అల్లో నేరేళ్లల్లో - పల్లవి.

చెలువకృష్ణుండనుచుఁ జెప్పరేమీరు అల్లో నేరేడల్లో
కలివేల్పుమనదొరకుఁ గలిగెనే నేఁడు
సిరివరునివలెనితఁడు చెలంగుచున్నాఁడు అల్లో నేరేళల్లో
తరుణి యశోదకు తనయుఁడైనాఁడు

గుటికానివలె నితఁడుగునియుచున్నాఁడు అల్లో నేరేడలో
మింటఁబుప్పులవాన మెలఁతగురిసేనే
వింటికే భేరీలు వేడ్కమొరసేనే అల్లో నేరేడల్లో

* * * *

పొంగుచును జేజేలు పొగడుచున్నారు
పొంగళ్లుపెట్టుదము పురుడెపుడుదియ అల్లో నేరేడల్లో

వ. మఱిన్నీ వెన్నెలాటపాడిరట యెటువలెను.

నూకలమ్మను గొల్వగానె వెన్నెలాలో
అక్కలమ్మకు సారెఁబోయా వెన్నెలాలో, ఇపుడు
లెక్కలేని కదుపులాయె వెన్నెలాలో
కుందులమ్మపుణ్యాన వెన్నెలాలో, మన
నందునికి కొడుకుగల్గె వెన్నెలాలో
పొంగళ్లుపెట్టుదము వెన్నెలాలో, మంచి
బోనాముముద్దలంది వెన్నెలాలో,
జాతరాలు సేయవలె వెన్నెలాలో, ఈ
జాతులాన నడవడిని వెన్నెలాలో,

* * * *

అర్ధ చంద్రికలు.

చరులన్ జూచుచు గిరులన్ మేపున్ - కోనలుగడచుచుఁ గానలమేపున్
వేవేయనుచును వేలలుపాడున్ - సంగడిగొల్లం గొంగడులాడుచున్
తేనెలుఫలములు దెమ్మనిపిలుచున్ - జాడలఁబోవుచు నీడలనిలుచున్.

* * * *

గొబ్బి పాట.

గొబ్బిళ్లో కొమ్మలారరారె ముద్దు గుమ్మలారరారె
ఇంతులారరారెమరుని దంతులారరారె గొ॥
అతివలారరారె పసని ప్రతిమలారరారె !
జాణలారరారె చిగురుబోణులారరారె !
ఆశ తెల్లఁదీరను ఆకేశవునిఁబాడరె
గబ్బివయసు చెలులురారె గొబ్బిళ్ళాడమీరు.

**End :**

అంత రామకృష్ణులు యాదవులు తముఁగొలువ మథురాపురంబు ప్రవేశించి రాజ మార్గంబున వచ్చునపుడు పురాంగనలు వారల రూపరేఖావిలాసంబులు సూచి మేడల మీదనుండి యాతెఱంగుతోణులేమనుచున్నారు.

సీ. వీఁడటే పూతనవిషము చన్నులపాలు - బాలితోఁ ద్రావిన బాలకుండు
వీఁడటే బలుబండి విఱ్ఱవీఁగుచుఁగాలఁ - దురుసునఁదన్నిన దుండగీఁడు
వీఁడటే సుడిగాలి విధమెల్లఁదాఁదెల్సి - పట్టుక మెడవైచి పాఱవైచె
వీఁడటే మొనవ్రేల వేగమైఁగొండెత్తి - జేజేలదొరతీవి చిదిమివైచె
వీఁడు యమునఁగాళింగుని వెడలనడిచె - వీఁడు దొంగిలెనింటింటు వెన్నలెల్ల
వీఁడు కార్చిచ్చుగబళించి వేగమ్రింగె - వీని మహిమలు వివరింపవింతలమ్మ !

మఱి న్నేమనుచున్నాఁడు.

సీ. ఇతఁడటే నీటిలోనీఁదుచు బెళుకుచుఁ - జమవ్రులుదెచ్చిన సాహసుండు
ఇతఁడటే తరిగొండయెత్తి వీపునదాని - జివ్వంబు (?) పుట్టించు పుణ్యమూర్తి
ఇతఁడటే కొమ్మునవిలయెత్తి రక్కసుఁ - దునిమి కింకలువెట్టుదుండగీఁడు
ఇతఁడటే . . . . యింపుతోఁ గంభాన - వెడలికీలించిన వేషధారి
గబ్బిరాజులు చెలరేగ నబ్బులణఁచె - నంపకోలను మున్నీటినాచినాఁడు
ఇతఁడు వ్రేఁతలకెల్లను నింటిమగఁడు - ఇతఁడు బుద్ధుఁడుకలికని యెంచఁదగును.

(వి-వి.)—

ఆసమగ్రము తుదిపట్టుకొంచెము తక్కువేమో ! వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము కలదు. గ్రంథపాతము లంతగాలేవు.

కృష్ణవిలాసమని పేరుగల యీ యక్షగానమున భాగవత దశమస్కంధమునఁగల్గు కృష్ణలీలలు వర్ణితములైనవి. ఇందు షిలలు, దరువులు, త్రిభంగులు, అర్ధ చంద్రికలు, అల్లో నేరేళ్లు, గొబ్బిళ్లు, వెన్నెల పదములు, మొదలగు ఆంధ్రదేశ రచనలు కొన్ని గలవు. గ్రంథకర్త వెన్నముద్ద గణపతి పెద్ద కవి.

---

## No. 1864. గంగాగౌరీవిలాసము.

## GANGĀGAURĪVILĀSAMU.

Substance, paper. Size, 12¼ × 7½ inches. Pages, 19. Lines, 23 on a page Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 275*a*. The manuscript contains also fragments of a large number of miscellaneous works.

Incomplete.

The marriage of God Śiva with Ganga and Gauri, and their amorous sports are described in this. The name of the author is Pedakemparaya.

**Beginning :**

శా. శ్రీ గౌరీపతి చంద్రశేఖరసతీ చిత్తాబ్జరోలంబ స
న్నాగాధీశ్వర హారమారమథనా నాకేశసంసేవితా

యోగీంద్రార్చిత పాదపద్మయుగళా యోషామయార్ధాంగ

. . . . . హిరియకెంపన్నృపతిన్ రక్షించు సోమేశ్వరా.

క. . . . . . . . ద - గంగాగౌరీవిలాసకథ మృదువచనా

నారంబులుద్దిజడ న - ట్లారజముగఁ గవులుపొగడ సతులప్రౌఢిన్.

క. సుకవులకు సారమైబహు - కుకవుల కెదశూలమై యకుంఠితధారై

చకితచకిత వాద్యములై - వికసించును బెద్ద కెంప విభుసత్కవితల్.

క. గంగాగౌరివిలాసము - సంగతిఁబద పద్యములకు సరసతమీఱన్

రంగద్భూషణములు చెలఁ - గంగా పెదకెంప రాయఘనుఁడొనరించెన్.

క. తనప్రాణేశుని వెదకుచు - వనితామణిగంగ పిచ్చువైఖరియేలా

గననెల్లనాఁడు నేఁడనఁ - గనఁగొనవలె సకలజనులు కాంక్షరహించన్.

ఆటతాళం - అర్ధరేకు.

శంకారునిఁజూపరె నవమీనాం కునిఁజూపరె॥ ౧॥

ఈశునిఁజూపరె నాప్రాణేశునిఁజూపరె॥ ౨॥

* * * *

**End:**

క. అంగజుకేళినిమది యు - ప్పొంగఁగరతి నేలి సోలి బోటిరహిల్లన్

బంగారు గిండిఁబట్టుక - ముంగిటికిని వెడలెఁజాలకు రెపెంబలరన్.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

శివుఁడు గంగాగౌరుల వివాహమాడుట, వారితో వినోదించుట! వారి సవతి తన పుఁదగవు ననురీతిని శృంగారప్రధానముగా నీయక్షగానముగలదు. కర్త పెద కెంప రాయఁడు.

ఇందు చిల్లరవిషయము లనేకములు గలవు. ఈ పుస్తకమునకు 'చిల్లర కావ్యముల పుస్తకము' అని పేరు.

---

## No. 1865. గరుడాచలవిలాసము.

## GARUDĀCALAVILĀSAMU.

**Substance, paper. Size, $7\frac{7}{8} \times 7\frac{7}{8}$ inches. Pages, 43. Lines, 16 on a page. Character, Telugu. Condition, Slightly injured. Appearance, old. Mode of writing, good but full mistakes.**

**Begins on fol. 1*a*. The other works herein are : Ramacandraśatakamu 49*a*, Mannārukṛṣṇaśatakamu 65*a*, Gēyamulu 87*a*, Gōvyāghra caritra 114*b*. Nṛsimhadaṇḍakamu 124*a*,**

**Complete.**

A very popular but not of a high standard of yakṣagāna describing the marriage of God Nṛsimha worshipped at Ahobila, with a girl belonging to the Cenou tribe. The author is Obayamantrī of Nandavaramu.

**Beginning :**

క. శ్రీ గరుడాచలదేవుం - డాగమవేద్యుండు దురితహరుఁడు నృసింహుం
డా గజవరదుండనిశము - బాగుగమముఁ బ్రోచు సత్కృపామతితోడన్.

వ. మఱిన్ని దేవతా సార్వభౌము నేమనికొనియాడుచున్నాఁడు.

అటతాళము.

పటుల జగదాధారనరహరిభవవిదూరా
యగణిత భవవిదూరా ! నరహరి
చటులదైత్యవిదార గరుడాచలవిహారా !

* * * *

వ. అని యిట్లు దేవతాప్రార్థనంబుచేసి కవీశ్వరుండు కృతికధీశ్వరుండైన గరుడాచలేశ్వరునకు షష్ఠ్యంతంబులు రచించెనట యెటువలెను.

ఝంపె.

సురరాజసంస్తుతికి సురుచిరాసమమతికి
కరుణారసోన్నతికి గరుడాద్రిపతికిన్.

* * * *

వ. అంకితంబుగానా యొనర్పంబూనిన గరుడాచల విలాసంబను యక్షగానంబు నకుఁగథా క్రమంబెట్టిదనిన.

ఝంపె.

రథగజాశ్వపదాతి। రమణీయసంకులము
పృథులపుణ్యస్థలము పెదయహోబలము.

* * * *

నలువొందునట నాదినారాయణుండు

* * * *

బలువిడియక్కుఁగంబంబున వెడలి - చలమున హేమకశ్యపుఁజీరియచటఁ
జెలరేఁగి నవనారసింహరూపమున - మెలఁగుచు లక్ష్మీసమేతుఁడైతాను
వేదాచలంబుపై విహరింతుననుచు - నాఁదటఁదలపోయనతిముదంబునను
ఖరిచారకులును సంభ్రమలీలబెగడఁ - గరమర్థివిడుదులుగావించిరెలమి,

**End :**

అటతాళము.

చెంచుబలగము నేలివారిలోఁ జెలియతానూ ।
    మెలఁగుచుఁ జెంచుయోబళపతియనంగఁ బ్రసిద్ధికెక్కెన్ ॥
ధరణిలోఁ దనునమ్మికొలిచిన దాసులకునూ ।
    వరములుఁ గరుణతోనొసఁగుచును విశ్వాకారుఁడగుచూ ॥
సత్యమూర్తియనంగ గరుడాచలమునందూ
    చాయక నిత్యనిరుపమ వైభవంబులనెగడుచుండెన్ ॥

**Colophon :**

ద్వి. అనుచు నా సకలలోకాధీశు వేర
    వనజభవామరవందితు వేర
. . . . . . .
సన్నుతిమీఱంగ సరసులౌననఁగ
    వన్నెకెక్కిన నందవర శాస నుండు
చెన్నమాంబాగర్భసింధు చంద్రుండు
    ఉన్నతకీర్తియానుజ్జ్వలగుణుఁడు
దినకరతేజుఁడాది నవహోబ
    ఘనునియోబయమంత్రి కవివరేణ్యుండు
గరుడేశ్వరుని పాదకమలంబులకును
    బరమభక్తిని సమర్పణముగాఁజేసి
విరచించెనీ కథవిఖ్యాతి వెలయ
    ధరణిలో నాచంద్రతారార్కముగను ॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది, తప్పులుచాలఁగలవు. అక్కడక్కడ గ్రంథపాతములునుగలవు. వ్రాఁత కాగిదమున కొక ప్రక్కనేకలదు. పాఠభేదములు పెక్కులు బంతులనడుమఁ జేర్పఁబడినవి.

ఆహోబలస్వామియగు నృసింహదేవుఁ డొకచెంచుకన్నియను గరుడాచలమునఁ బెండ్లాడుకథ యిందుగలదు. ఈ యక్షగానము మిక్కిలి ప్రచారముగలది. గ్రంథకర్త నందవరపు—ఓబయమంత్రి—దీన ప్రతి భేదములు చాల పాఠభేదములుగలవి.

ఇందీ గ్రంథాంతరములుగలవు. 49*a* రామచంద్రశతకము, 65*a* మన్నారుకృష్ణశతకము, 87*a* గేయములు, 114*b* గోవ్యాఘ్రచరిత్ర, 124*a* నృసింహదండకము.

## No. 1866. గరుడాచలవిలాసము.

### GARUDĀCALAVILĀSAMU.

**Substance, palm-leaf. Size, $11\frac{3}{8} \times 1\frac{3}{8}$ inches. Pages, 55. Lines, 6 on a page Character, Telugu. Condition, Slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.**

Complete.

Same work as the above, but contains different readings.

Date of transcription.—Thursday, the new moon day of the month Bhādrapada in the year Sarvajit.

Name of the Scribe, Parangi Bāvayya.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్నది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వ వర్ణితములైన రెండిటికిని పాఠభేదము లున్నవి.

సర్వజిన్నామ సం॥ భాద్రపద బహుళామావాస్య గురువారంనాడు పరంగిబావయ్య ప్రతి లేఖనము ముగించినట్లు గ్రంథాంతమందు గలదు

## No. 1867. గరుడాచలవిలాసము.

### GARUDĀCALAVILĀSAMU.

**Substance, palm-leaf. Size, $15\frac{1}{2} \times 1\frac{1}{8}$ inches. Pages, 38. Lines, 5 on a page Character, Telugu. Condition, Slightly injured. Appearance, old. Mode of writing, good but full of mistakes.**

Same work as the above.

Date of transcription—Thursday, the fourth day of the first half of the lunar month of jyesṭha in the year Saumya.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వము వలె,

సౌమ్యనామ సంవత్సర జ్యేష్ఠ శుద్ధ చతుర్థి గురువారమునాటి కిది వ్రాయఁబడెను.

## No. 1868. గరుడాచలవిలాసము.

### GARUDĀCALAVILĀSAMU.

**Substance, palm-leaf. Size, $13 \times 1\frac{1}{2}$ inches. Pages, 12. Lines, 6 on a page Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.**

Begins on fol. 9(a). The other works herein are—Vēmanapadyamulu 1(a) Ramakirtana 13(a)

**Incomplete.**

**Same work as the above.**

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁతమంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వముకోఁత.

ఇందలి గ్రంథాంతరములు.

1a వేమన పద్యములు, 13 a రామకీర్తన.

---

## No. 1869. గరుడాచలవిలాసము

## GARUDĀCALAVILĀSAMU.

Substance, palm-leaf. Size, 16¼ × 1¼ inches. Pages, 36. Lines, 5 on a page Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, not good and not free from mistakes.

**Incomplete.**

**Same work as the above.**

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వముకోఁత.

---

## No. 1870. గురునంబిచరిత్ర.

## GURUNAMBI CARITRA.

Substance, paper. Size, 11¾ × 8 inches. Pages, 36. Lines, 20 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing good and fairly free from mistakes.

Begins on fol. 301(a). The other works herein are—Daśāvatāracaritra 1(a). Mollarāmāyanamu 63 (a). Bālabhāgavatamu 126 (a). Balarāmacaritra (Prabandharājasirōbhūṣaṇamu, 173 (b). Sāmbavilāsamu 229(a). Sārangadhara caritra 255(a). Guruparampara 280(a) Lingadhāranacarca 319 (a). Sugrivavijayamu 325 (a).

**Complete.**

Describes the story of Sundaramūrtinayanar also known as Udavanambi and Paramanāci two great devotees of śiva. Regali Nimmanātha, son of Parvatalinga is the author.

**Beginning :**

క. ధవళగిరిసన్నివాసుని - ధవళోరగభూషితాంగు ధవళాంశుధరున్
ధవళభసిత త్రిపుండ్రుని - ధవళాంగునిఁ జూచి కల్పదైవముఁగొలుతున్.

వ. అట్టిదేవు కారుణ్యంబున రాచవీటి పట్టణంబు నభివర్ణించెద నెటువలెను ;

జంపె.

సారమగు తనువేడు, సజ్జనుల మదివేడు
కారూఢినిడుజోడు, శ్రీరాచవీడు.
చవసరంబులకీడు భజియింపనొనగూడు
శివభక్తతతిజోడు శ్రీరాచవీడు.
ఆగమంబులజోడు అఘములను నుఱుమాడు
శ్రీగిరికి సైదోడు శ్రీరాచవీడు.

* * * *

వ. ఇట్టిదేవుని కారుణ్యంబున రాచవీటి పట్టణంబున కధీశ్వరుండయిన వీరభద్రేశ్వరుంగీర్తించెద నెటువలెను,

జంపె.

కరుణాసముద్రయస్ఖలితవిజయోన్నిద్ర
స్థిరతరమహారౌద్ర శ్రీ వీరభద్రా !
మాఱటు శ్రీరుద్రమహిమాదికాచ్ఛిద్ర
శ్రీరస్తు శతరుద్ర శ్రీ వీరభద్ర !

. . . శ్రీ వీరేశునకును—అంకితంబుగా నాయొనర్పంబూనిన పడయనంబెన్న చరిత్రయను యక్షగానంబునకుఁ గథాక్రమం బెటువలెను ;

సీ. శ్రీరజతాచల సింహాసనస్థుండు - గౌరీవివాహ సంకల్పితంబు
చేసిన హర్యజ జీమూతవాహన - ప్రముథాదు లతులసంభ్రమముతోడ
పదునాల్గులోకముల్ ముదమందఁ బార్వతీ - పరమేశ్వరుల పెండ్లి ప్రకటితముగ
వేదోక్తిఁగావించి విశ్వేశుఁబెండ్లి కు - మారుఁజేసిన ముఖమంటపమున
నిల్వుటద్దంబు కెదురుగా నిల్చినంత - పార్వతీశుల ప్రతిబింబ భావములకుఁ
బ్రాణమొసఁగియు సుందరప్రమథులనుచుఁ - గూర్మి పేరిడి సేవ గైకొనుచునుండె.

* * * *

త్రిపుట

సుందరుండొక రుద్ర కన్యకఁజూచి శృంగారంపు వనతరు
బృందమధ్యమునందుఁ బొందిన చందమొఱిఁగి,

దేవదేవుఁడనిరా నత్తిరునావలూరనుపురము సేనను
భూవిభుఁడుపాలించు మర్త్యంబునను వేడ్కఁ
పాళినచటను మీరు మానవులై జనించి సుఖించుఁడని శశి
మౌళిసుందరి సుందరులకా మహిమఁదెలిపెఁ.

* * * *

ఎఱుకల జంపె.

ఆఱు నెలలు మళ్లనేని యూరిలోకి వచ్చిజడా
యూరియింటికరుగ నాకొమూరు వడుగుసేయ
యత్నపెట్టినారు చూడు పాపకర్మలెల్ల రాజ
రత్నమా పరామరించు రమణ మా మొఱాలకించు
మనఁగనంతలోనె బాప లల్ల వచ్చి రాజసముఖ
మున కరోషమునను గినికి యతనిఁదిట్టి కొట్టబోవ.

* * * *

పాళికేకులు.

తాళములు మద్దెలలు ఢక్కయుఁదాంబురల్ వాయింపఁగా
తాళమానమొకింత దప్పక వాలుగంటి నటింపగా,
ధిమికిధిమికిటా. ధిమికిధిమికిత ధిన్నతోంగణి దివిజులంబరపదమునఁ
నమరిచూడఁగఁ బరమనాంబా రాదెనతులిత ముదమునా !
ధిమికిధిమికిటా.
వనితచక్కఁదనాల కుప్పనివరులు పురజను లెంచఁగా
తనినఖుణమే తీరదనుచును జనులు తను నుతియింపఁగా
ధిమికిధిమికిటా !

* * * *

జంపె.

అవనము చెంతగల కావేరియుదకమున
శైవచ్ఛ్రాహ్మణ స్త్రీ యొక్కతయును,—
నొడయనంటెన్న నాయొడయనంటెన్న నా
కొడుకనంటెన్న యొక్కడ దాగియున్నా—

* * * *

అతుల కుమార నిను నేటిపాల్ సేసి యే
నాటికిని మఱతునని బోటి వెతపడఁగా.

కని నంబి సతిదుఃఖమునకు వివరము దెలిసి
కొనెను బరిచారకులఁ బిలిచి యిట్లనను,—

*　　　*　　　*　　　*

వ. అంత నాకావేరీ తీరంబుననున్న పుణ్యాంగనలు ధవళంబుఁ బాడిరటు లుంటువలెను.—

ధవళం.

జయజయా జ్ఞాన సంపన్నా - జయజయా నిన్ను బుధు లెన్నా
జయము నీపదములూ గన్నా - జయమహాసు వొడయనం బెన్నా.

*　　　*　　　*　　　*

ఝంపె.

పరసతుల వరియింప నరకమని మీఱవెట్టు
ధారయూశాస్త్రములు దెల్లఁ దుంగలోఁ ద్రొక్కి
పరనారి పంటిలోఁ బరమేశుఁ బరికించి
పరమజారుఁడు నంబి పరమపదమేఁగెఁ.
శిశుహత్య చేసి మును చిఱుతొండ భక్తుండు
పశుపతినిగూడెఁ దన పట్టణముతోడఁ
గోటండు తండ్రి తలగొట్టి కైలాసము క
వాటములు దెఱవ శశిజూటులోఁ గలసెఁ.

*　　　*　　　*　　　*

**End :**

ద్విపద.

పరమనాంచారియుఁబైనమైవచ్చి - నరపతివెంటనే నంబెన్నఁగలసె
ఆరాయఁడునసంఖ్యాతమాహాత్మ్య - రారాధనముల నిహము మఱచియుండె
ననిదత్తయజ్ఞావ హారునిపేర - మునుకొని విశ్వతో ముఖమూర్తిపేర
వలనగు కళ్యాణ వాసునిపేర - వినుతింప శ్రీరాచపీటనివాస
ఘనభద్రకాళికా కాంతునిపేర - నంకితంబుగసదా పారైకవర్తి
శంకరపిడుపర్తి సద్గురుమూర్తి - కరజాతుఁడగు చుండి కలికేశుపేర
పరకవీశ్వరుఁడు పర్వతలింగసుతుఁడు - నిరుపమరెంగళిగ నిమ్మనాథుండు
నరసురాద్భుత గురునంబి చరిత్ర - యక్షగానము చేసె ననుపమప్రీతి
వసుత నాచంద్ర తారార్కముగను - నిదివిన్నఁ జదివిన నీప్సితార్థములు
సదములమతులకు సమకూర్చు శివుఁడు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

సుందరమూర్తినాయనారని, ఉడయనంబి యని పేర్లుగల ద్రవిడశివభక్తుని చరిత్ర మిందు వర్ణింపఁబడినది. పార్వతీపరమేశ్వరుల ప్రతిబింబములే సుందరమూర్తి పరమనాచి యనువారుగా జన్మించుట, సుందరమూర్తి పరమనాచి పూర్వ యను రాగవిలాసములు, తిరునావలూరి వాల్మీకేశ్వరుఁడు వారికిఁ గుంటెనతనము చేయుట, తుదకు వారికి శివలోకప్రాప్తి యనుకథా విషయమిందుఁ గలదు. పర్వతలింగము పుత్రుఁడగు లింగిగ నిమ్మనాథుఁడు చుండి కలికేశ్వరస్వామి కంకితముగా దీని రచించెను. ఇందు గొన్ని దేశిరచనలు గలవు. ఉదాహృత గ్రంథ భాగమున వాని తీరుచూడఁ దగును.

ఇందిరి గ్రంథాంతరములు గలవు.

1*a* దశావతార చరిత్ర, 63*a* మొల్ల రామాయణము, 126*a* బాలభాగవతము, 178*b* బలరామ చరిత్ర (ప్రబంధరాజ శిరోభూషణము), 229*a* సాంబవిలాసనము, 255*a* సారంగధర చరిత్ర (ద్విపద), 280 గురుపరంపర, 319 లింగధారణచర్య, 325*a* సుగ్రీవ విజయము.

---

## No. 1871. గురునంబిచరిత్ర.

## GURUNAMBICARITRA.

Substance, palm-leaf. Size, 16¼ × 1⅜ inches. Pages, 33. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Complete.

Same work as the above.

Date of transcription :—Wednesday the twelfth day in the second half of the lunar month Mārgasira in the year Vibhava. Name of the scribe—Lingayya, son of Ayyagāri Rājappa.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

గ్రంథాంతమందు వ్రాంతగలదు :—

"విభవనామ సం॥ మార్గశీర్ష బ ౧౨ బు॥ సాయంత్రం వర్కు వడియనంబెన్న చరిత్ర యక్షగానం పుస్తకం అయ్యగారి రాజప్ప కుమారుడు లింగయ్య వ్రాశి గుంప్మడి పెద్దయ్యకు ఇచ్చేను."

---

## No. 1872. గురునంబిచరిత్ర.

## GURUNAMBICARITRA.

Substance, palm-leaf. Size, 15 × 1 inches. Pages, 59. Lines, 4 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Complete.

Same work as the above.

Date of transcription :—Saturday the third day in the first half of the lunar month Vaiśākha in the year Bhāva. Name of the scribe—Mājēṭi Sarvēśalingam.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువో. శ.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

"భావనామ సంవత్సర వైశాఖ శు॥ 3 స్థిరవారాన యీ వడియనంబి చరిత్ర యక్షగానం సంపూర్ణంగా మాజేటి సర్వేశలింగం వ్రాశెను."

---

## No. 1873. గొల్లవేషకథ.

## GOLLAVĒṢAKATHA.

Substance, paper. Size, 11¾ × 8¼ inches. Pages, 44. Lines, 27 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair, but full of mistakes.

Begins on fol. 234*a* of the MS. described under No. 1861 ante.

Complete.

Works entitled గొల్లవేషము కథ, భామవేషము కథ, భామకలాపము etc., are all varieties of poetic composition known as Yakṣagāna. Of the ten kinds of dramatic composition in Sanskrit. "Vīthi" is similar to the Telugu Yakṣagāna. It usually begins with the entrance of a shepherd girl in a street with a pot of butter-milk. Then a Brahmin (of the nature of a clown) meets her and begins to converse with her in a humourous manner,

enquiring her caste, manners, etc. Towards the end a ruffian called Koṇḍa (supposed to be one who collects customs duty) stops the girl, insists her to pay the duty, and talks all sorts of vulgar, while she tries n a clever way to evade him. Finally the mother-in-law of the girl appears on the scene and takes away her daughter-in-law. The immodest and vulgar talks of Sunkari Koṇḍa only show the mean character of the persons in charge of the collection of customs in those days. The author Bhārati Rāmarāju has dedicated this work to Sri Hari worshipped at Potladurti.

**Beginning :**

క. గణవదను నేకదంతుని
త్రిజగన్నుతుఁ బరమపురుషుఁ ద్రిపురారి సుతున్
భుజగేంద్ర హారు గణపతి
విజితేంద్ర నిఁ (త్రియు) ? గొల్తు సకల విద్యలకెల్లన్.

క. శ్రీపోట్లదుర్తి హరికరు
ణాపూర్ణ కటాక్షలీల నవరసఘటితన్
భూపతులు మెచ్చఁ జెప్పెద
వేపూనియు గొల్లభామవేష మనంగన్.

(ఆటతాళం॥ సారంగా రాగంవల్లనే యీ గొల్ల కలాపం యావత్తూ వినకరి చేస్తూన్నారు. కొందరు ప్రత్యేకంగా రాగములు పాడుతారు.)

గొల్లభామ వచ్చెనూ
చల్లోయని - గొల్లభామ వచ్చెనూ
గొల్లభామ వచ్చె - పల్లవపాణిరే
పల్లెవాడనుంచి - చల్లలమ్ముకొనుచు (గొల్ల)
ముంగివెన్నెలచీర - చెంగులు జారగ
రంగుల రవిక చ - నుంగవ మెఱయఁగ. (గొల్ల)

*　　*　　*　　*

**End :**

వ. ఆయత్తా యిట్లాగంతా నన్ను చికాకుజేసి, ఛ్యాకబరన్నాడే, లంజ, లొత్తు, నిన్ను గాడిదెలుగొట్ట, నిన్ను గుర్రాలు కుక్కలు మొత్త అనక ఛ్యాక బరన్నాడే.

అద. కొండాడెందుండి వచ్చెనే కోడాల నేడు (కొండా)
నాకుద్దు పిచ్చిగొని కొడుకే మాటలన్నాడే
నీ కొంగు బట్టినాడట వేకొమ్ము నా కొడుకూ (కొండా)

నీ పిడత పగలకొడుతు వాంటితోడుమా నీకొడుకు
వాడు పాద్యేవాడుగాడో చల్లపోయరాదటే (కొండా)

ద్విపద. అని సుంకరిని దూరి నాగోపజరత - తనకోడలికి బుద్ధి తగజెప్పుకొనుచు
నెమ్మితో తోడ్కొని నిజపురికేగె - సమ్మదంబుగనుండె సమ్మతులుగలిగి.

**Colophon :**

అనిరమాపతిపేర నఖిలేశుపేర - స్థిరదయా గురుపేర శ్రీపోట్లదుర్తి
హరిపేర జన్మ సౌఖ్యంబందుకొఱకుఁ - బ్రవిమలమతిని భారతిరామరాజు
కవి రచియించె సత్కృతుల సమ్మతిని - విరివాందునీగొల్ల వేషంబుకథయు
ధరణిలో నాచంద్ర తారార్కముగను.

ఆది తాళం

దధిమథనా - మధుసూదనా ॥ కృష్ణా
దధిసుధనా యం - బుధిశయనా ॥ కృష్ణా

* * * *

హరిర్హర్త్రివి - స్ఫూర్తిమూర్తి మ
మూర్తికీర్తి శ్రీ - పోట్లదుర్తి హరి (దధిమథనా)
రామారాఘవ - రాజీవలోచన
కామితఫలదా - కరివరదా.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

గొల్లవేషము కథ, భామవేషము కథ, భామ కలాపము అని పేరులుగల గేయ రచనములిట్టివి యక్షగాన భేదములలోఁ జేరినవే యనవచ్చును. సంస్కృతమున దశరూపకములలోనిదగు వీథి యిట్టిదే. ఇందు బ్రాహ్మణ వీథిలో నొక గొల్ల పడుచు చల్ల కడవఁదాల్చి చల్లనమ్ముకొనుచుఁ బోవుచుండుటయు, నొక బ్రాహ్మణుఁడు (ఈతఁడు విదూషకప్రాయుఁడు) ఆమె కులజాత్యాచార వ్యవహారాదులఁ బ్రశ్నించుట, యామె బదులు చెప్పుట, గాపెక్కు వింతవింతల ప్రసంగములుంగలవు. ఇందు తుదిని కొండఁడను పేరు గల ధూర్తుఁడు త్రోవ నడ్డగించి చల్ల యమ్మకపు సుంకము దెమ్మని యా గొల్ల పడుచును నిర్బంధించుచు బిందుబూతు ప్రసంగముల జరపుట, ఆమె చతురముగా దప్పించుకొనఁజూచుటయు, ఆమె యత్తగారంతటవచ్చి కోడలిని దోడుకొనిపోవుటయునను తీరునఁ గథముగియును. ఇందు సుంకరికొండని రోఁత సంభాషణము, గ్రంథమున నాకాలమునాటి సుంకరుల ధౌర్త్యమును దెలుపును. ఏతద్గ్రంథకర్త భారతి రామరాజు, పోట్లదుర్తి శ్రీహరికిది సమర్పితము.

ఇది 'యానాము' అను గ్రామమున లభించిన పుస్తకమని గ్రంథారంభమునఁ గలదు.

ఇందిలి గ్రంథాంతరములకు కృష్ణవేష కథ చూచునది.

---

## No. 1874. గొల్లవేష కథ.

## GOLLAVĒṢA KATHA.

Substance, palm-leaf. Size, 16¾ × 1½ inches. Pages, 96. Lines, 5 on a page Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair and fairly free from mistakes.

Begins on fol. 1 (a). The other work herein is—Gollavēsakatha (a different work) 49 (a).

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లంతగాలేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

ఇందలి గ్రంథాంతరము.

49 (a) గొల్లవేష కథ (వేఱురచన).

---

## No. 1875. గొల్లవేష కథ.

## GOLLAVĒṢA KATHA.

Substance, paper. Size, 11¾ × 8¼ inches. Pages, 12. Lines, 27 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good, but full of mistakes.

Begins on fol. 256 (a) of the Ms: described under No. 1861 ante.

Incomplete. A small portion is wanting at the end.

Similar to the work described under No 1873 ante. But the story of Sunkari Konḍa is not found in this. The name of the author is not known.

**Beginning:**

ద్విపద. శ్రీకరంబైనటి క్షితిమండలమున - పెక్కువ సంపదల్ విలసిల్లి యెల్ల
జనులకు సుఖములు సాగియే కాల - భోగముల్ జెందియే పొదలుచుండు దుము
హరిమాయనగరంబు అళకాపురంబు - సురరాజువీడు భాసురపతిప్రోలు
మొదలైన దేవతా ముఖ్యవాసమునా - కుదరక కరుణించుచూడను సుమీ
పాడిపంటల తల్లి భాగ్యములవల్లి - వేడుకవిలసిల్లి చెదచల్లి వల్లి
రేపల్లె మాపల్లె ప్రేలు నందుండు - దీపింప పంద్రెండు స్థిరమైన గొల్ల
కులములుగలవవి కూర్మి వినుపింతూ.

**End :**

శ్లో. స్వర్గాధి నాథస్య సురాగ్ర జస్య కపర్దినో యక్షపతేర్మురారేః
తేషాంచ యోషాజన సంతతీనాం తక్రంయథా దుర్లభమాహు నూత్నం.

టీక. స్వర్గాధి నాథస్య। స్వర్గస్య అధినాథః స్వర్గాధి నాథః। తస్య స్వర్గాధి నాథస్య। స్వర్గాధి నాథయోః। స్వర్గాధి నాథానాం। స్వర్గాధి నాథశబ్దః। అకారాంతః పుల్లింగో షష్ఠ్యేకవచనాంతః। స్వర్గాస్వర్గానకు అధినాథస్య ప్రభువైనటువంటి। దేవేంద్రునియొక్క.

* * * *

యేషాంచ వీరలయొక్క యోషాజనసంతతీనాం స్త్రీజనసమూహానకు నూత్నం సజ్జన సమ్మంధమైనటువంటి తక్రంచమూయొక్క చల్లయథా నిరంతరమున్నూ ఆశు శీఘ్రుంగా నున్న దుర్లభం లభించేది ప్రయాసంగదవయ్యా.

(వి-వి.)—

అసమగ్రము. తుదపట్టు కొంతకొంతగా నున్నట్టున్నది. వ్రాంత మంచిది. తప్పులు చాలఁ గలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది నె 1873 రున వర్ణితమైన గ్రంథమును బోలినదే. రెండు రచనములు వేఱువేఱు తెలుఁగులవి. ఇందు తుదిని సుంకరి కొండనికథ గానరాదు. దీని కర్త పేరెఱుఁగరాదు.

ఇందలి గ్రంథాంతరములకు కృష్ణవేష కథ చూచునది.

---

## No. 1876. గొల్లవేష కథ.

## GOLLAVĒṢA KATHA

**Substance, palm-leaf. Size, 16¾ × 1½ inches. Pages, 28. Lines, 4 on a page, Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair, but full of mistakes.**

Begins on fol. 49 (a). The other work herein is Gollovēsakatha (different work).

**Incomplete.**

**Same work as the above.**

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వవర్ణిత ప్రతికిది మాతృక (1873).
1 (a) గొల్లవేష కథ (వేరొకరచనము).

## No. 1877. గొల్లవేష కథ.

## GOLLAVĒṢA KATHA

**Substance, palm-leaf. Size, 12½ × 1¼ inches. Pages, 15. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured and worm eaten. Mode of writing, fair, but not free from mistakes.**

Begins on fol. 1 (a). The other works herein are :—Samudramathanamu 8 (a). Sri Kṛsṇunipavvaḷimpusēva 14 (a) Grāmadēvatadaṇdakamu 25 (a). Rajarajesvaripadyamulu 28 (b).

Incomplete.

Similar to the work described under No. 1873 ante. But the vulgar conversation of Sunkari konda is not found in this. Tammaya of Āereyapura is the author.

**Beginning :**

ఉ. అంజలిచేసి మ్రొక్కెద మదంబకు దివ్య సరోజమాలికా
పుంజసుగంధ గంధకచ పుష్పరస భ్రమరీ కదంబకున్
రంజిత కంఠహార నవరత్న విడంబిత వజ్రకింకిణీ
మంజల మేఖలావలయ మధ్యనితంబకు శారదాంబకున్.

దరువు గొల్లభామ వచ్చెను । పల్లవపాణి । గొల్లభామ వచ్చెను॥
గొల్లభామ వచ్చె । ముల్లోకములవా
రెల్ల మెచ్చచల్ల । చల్లోయనుచూను గొల్లభా॥

* * * *

పోలిక నాత్రేయ । పురిగోపాలూని
కేళికిదాకన్న । గీటుచూ నీవేళ గొల్లభామ॥

క. జనులార సరసవిద్వ - జ్జనులార సమస్తసభలఁ జాతురిమెఱయన్
వినరయ్య గొల్ల కథగాఁ- దనరెడు నాత్రేయపురపు తమ్మయకవితన్.

* * * *

**End:**

ద్విపద * * * *

మొదవెఱ్ఱగొల్లలు ముష్టి గొల్లలును - పెదవీటి గొల్లలు పెయ్య గొల్లలును
కోటికోటులు మందగొల్లలు పాక - నాటిగొల్లలును పూనాటి గొల్లలును
అలిగంప గొల్లలు నాల గొల్లలును - ఇలవూడి సజ్జగొడీ జాతులైన
గొల్లల పండ్రెండు కులములలోన - కొల్లగా మే మెఱ్ఱ గొల్లలమయ్య
రాజులెల్లను మెచ్చ రాణింతుమయ్య - మాజాతి కొక్క నీమంబున్నదయ్య
రవిజూచియును మ్రొక్కరాదదిగాక - రవికయు దొడగంగ రాదెప్పుడైన
చుక్కబొట్టెప్పుడుంచుట లేదు నుదుట - ముక్కుకు వగమీఱ ముక్కఱ లేదు
తల్లెరుగస్మైలేర్పడబెట్టరాదు - అడ్డగట్టును లేదు ఆడుగుఱ్ఱమున

ఎడ్లెలపై యెద్దునెక్కఁగ రాదు - పరికింప హనుమంత బసవ శంకరము
సరస సింహతలాటు జయనామములును - బిరుదులు గలవయ్య పేర్వేరమాకు
వరుసతో నీరీతి వర్తింతుమయ్య.

* * * *

**End:**

సీ. సకలామయసమూహసంహారచక్రవి - స్తరపరాక్రమము యాత్రక గుణము
శుభ్రాభ్రహిమశశిస్ఫురిత తేజః పుంజ - కౌముదీ సంపూర్ణ కాంతిపదము
ఘనసారి జాత వికస్వర పుష్పాగ్ర - ఘుమఘుమ పరిమళ ఘూర్ణితంబు
జీవనాధార సంజీవనద్రవ్యోప-ధక్రియ దేహసుందరరసంబు
షడ్రసోపేతమగు వస్తుసాగరంబు - బహుసుధాసార రుచికర పానకంబు
గయినయాచల్లయిది దేవతార్పితంబు - అనుభవింపుడిజనులుమీకగునుశుభము.

* * * *

ఆ. ఉదయకాలమందు నొక మునికోపాన - శాపదగ్ధుఁడైన జాడదేడ
సౌరిదిప్రొద్దు పొడుపుసూర్యునిఁ గనుఁగొని-మ్రొక్కఁ వేయరాదె ముద్దుగుమ్మ.

తే. పాలకోపల శశిపుట్టెఁ బాలలోనఁ - బంకజారాతి పుట్టె కల్పద్రుమంబు
పుట్టెసుధపుట్టెఁగా ప్రొద్దు ప్రొద్దులేచి - వినవెపాల్కడవకు మ్రొక్కవేయువమ్మ.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁతతిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

నెం 1873, 1875 రుల వర్ణితమగు గ్రంథమువంటిదేయిది. కాని సుంకరికొండని రోఁత సంవాదమిందు లేదు. ఆత్రేయపురపు తమ్మయ దీనికర్త.

ఇందీ గ్రంథాంతరము గలదు.

8 (a) సముద్రమథనము. 14 (a) శ్రీకృష్ణునిపవ్వళింపుసేవ, 25 (a) గ్రామదేవతా దండకము, 28 (b) రాజరాజేశ్వరీ పద్యములు.

## No. 1878. గొల్లవేషకథ.

## GOLLAVĒṢAKATHA.

Substance, palm-leaf. Size, $16\frac{5}{8} \times 1\frac{3}{8}$ inches. Pages, 27. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, bad and full of mistakes.

Begins on fol. 1 (a). The other works herein Samudramathanamu 15 (a), Gēyamulu 43 (a).

Complete.

Similar to the work described under No. 1873 ante but the mode of composition is different. In the mode of composition it resembles the work described under No. 1877 ante. The name of the author is not known.

**Beginning :**

గొల్లవారము గొల్లవారము గొల్లవారమయా ఓబాపనయ్యా.

క. వారము వొకనాటిది శని - వారము మరునాడు జేయు నాటంవారం
వారము మతిగలశేతుము - వారముగా మయ్య్య గొల్లవారము ధాత్రిన్.

దరువు. గొల్లభామ వచ్చెనూ - పాలోయని గొల్లభామ వచ్చెనూ
గొల్లభామవచ్చె ములోల్లికములవా - రెల్ల మెచ్చగొల్ల చలోల్లియనుచూను.

* * * *

పొగడాగా నాత్రేయపురిగోపాలుని - మాటికిదాకన్ను గీటుచు యీావేళ్ల.

**End :**

ముజ్జగంబులు గొల్లలయా బాపనయ్యా.

తే. ముజ్జగంబులు బొజ్జలో గలిగియున్న - యిజ్జగము లేలుచున్నట్టి యీశ్వరుండు
యదుకులంబున జన్మించినందుచేత - జగతిపైనున్న జనులెల్ల గొల్లలధిప.

* * * *

క. గొల్లలు ధర్మగుణజ్ఞులు - గొల్లలు పుణ్యాత్ములవని గోపాలకులున్
గొల్లలె యెక్కువధీరులు - గొల్లలకును సాటియెవరు కోరినతింపన్.

(తె-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిదిగాదు. తప్పులు హెచ్చు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది నెం 1873-75 రుల వర్ణితమయిన గ్రంథమును బోలినదే. ఆ కథయె, కాని రచనము వేఱు. నెం 1877 రున వర్ణితమయినదానితో దీనికిఁ గొంత రచనాసామ్యము గలదు. గ్రంథకర్తపేరిందుఁ గానరాదు.

గ్రంథాదిని "ఇది యేడిదభాగవతము" అనియు, గ్రంథాంతమున, "విరోధి నామ సంవత్సర జ్యేష్ఠ బహుళ షష్ఠీ సోమవారమునాటికి జదువబడినదనియు" వ్రాఁత గలదు.

పైఁ జెప్పఁబడిన 'యేడిద' గోదావరీ మండలమునఁగల గ్రామమయియుండును. ఏతద్ ఈ గ్రంథకర్త యాయూరివాఁడు గాఁదగును.

ఇందీ గ్రంథాంతరములు గలవు.

15a సముద్రమథనము, 43a గేయములు.

---

## No. 1879. గొల్లవేషకథ.

## GOLLAVEṢAKATHA.

**Substance, paper. Size, 16⅝ × 1½ inches. Pages, 26. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured and worm eaten. Appearance, old. Mode of writing, good, but full of mistakes.**

**Begins on fol. 1 (*a*). The other work herein is Samudramathanakatha 15(*a*).**

**Complete.**

**Same work as the above.**

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతచక్కనిది. తప్పులు చాలఁగలవు. శైథిల్యము గ్రంథపాతములులేవు.

ఇది నెం 1878 రున వర్ణితమైనదే. కాని అక్కడక్కడ కొంతకొంత భేదము గానవచ్చుచున్నది. ఇదియు 'విడిద భాగవతము' అనియే పేర్కొనఁబడినది.

'దుగ్గిరాల రంగసాని కూఁతురు శ్యామలాంబ తాడిపత్రి చలమయ్యారొయొద్ద నీగ్రంథము చదివి పార్థివసంవత్సర పుష్య బహుళైకాదశీ శుక్రవారమునాటికి ముగించినట్లు చివర వ్రాంతగలదు.

ఇందీ గ్రంథాంతరముగలదు. 15(a) సముద్రమథన కథ.

---

## No. 1880. చిక దేవరాజ విలాసము.

## CIKADĒVARĀJAVILĀSĀMU.

**Substance, palm-leaf. Size, 14⅞ × 1⅝ inches. Pages, 66. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good and free from mistakes.**

Incomplete.

**Deals with the life of Cikadēvarāya, King of Mysore, who ruled also over Srirangapaṭṭana It contains also a few historical details. The name of the author is not known.**

**Beginning :**

శా. శ్రీరంగైక విహారి శౌరి భువనత్రేమం కరప్రాభవో
దారస్ఫారకృపాకటాక్షములచేతఁ విశ్వవిశ్వంభరా

ధారంధర్యకళావిశేష విలసద్బాహార్గళుండైన మై
సూరి శ్రీచికదేవరాయలకు నిచ్చుఁ శాశ్వతైశ్వర్యముల్.

* * * *

వ. శ్రీ మన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర ప్రౌఢప్రతాపతపన శ్రీ వీరచికదేవ మహారాయ మహామండలాఖండలుపేర పద్యాంతంబులు రచియించెనట యెటువలెను.

క. శ్రీమంతున కవిరతనత - సామంతున కఖిలవిమత జనవనజవనీ
హేమంతున కత్యద్భుత - ధీమంతున కనుపమాన ధృతిమంతునకున్.

* * * *

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన శ్రీచికదేవరాయ విలాసాభిధానంబును శృంగారరసప్రధానంబునునగు యక్షగానంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన.

**End :**

సీ. కురువిరాటవరాటకరహాటనృపజూటు - తటకిరీటములపైఁ దాఁకితాఁకి
చోళనేపాళపాంచాలభూపాలవి - స్ఫాలఫాలములపై ప్రాలిప్రాలి
అంగగౌళకళింగవంగబంగాళరా - డుత్తమాంగములపై నురికియురికి
కుకురనాథకరూశకోసలక్ష్మాధీశ - మాంసలాంసములపై మలసిమలసి
యెవ్వని భుజాల జయలక్ష్మి యొనసియుండు
నతఁడు పొగడొందునెందును నసమసమర
విస్మృమర మదాంధసింధుర విఘటితారి
రణజయవిహారి ! చికదేవరాయ శౌరి.

మ. అఖిలాశక్రతితయంబునంగలుగువా రాకారరేఖాకళా
ఘనకీర్తి ప్రతిభావిశేషములు వర్ణించంగ శ్రీరంగప
ట్టణసామ్రాజ్య ధురంధరుండవయి వేడ్కన్ ధాత్రిఁబాలింపుచున్
మనుమీ శ్రీచికదేవరాయనృపచంద్రా ! సాంద్ర తేజోనిధీ !

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత బాగుగా నున్నది. తప్పులు లేవు. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు గలవు.

ఇది శ్రీరంగపట్టణము నేలిన మైసూరి చికదేవరాయని ప్రశంసాత్మకముగా నెవరో రచించినది. ఇందుఁ గొన్ని చరిత్రాంశము లెఱుఁగనగును. కర్తపేరిందుఁ గానరాదు.

---

## No. 1881. జలక్రీడ.

## JALAKRĪDA.

Substance, palm-leaf. Size, 16 × 1¼ inches. Pages, 11. Lines, 5 on a page, Character, Telugu. Condition, much injured and worm eaten. Appearance very old. Mode of writing, fair but full of mistakes.

Begins on fol. 9 (b). The other works herein are Rukmiṇīvēsakatha 1(a) Savatulakayyamu 15(a).

Complete.

Describes the Bhāgavata story of Sri Krisna taking away the cloths of Gopis when they were bathing. The name of the author is not known. Some of the stanzas of Bammera Pōtana's Bhagavata are included in this.

**Beginning :**

క. మామా వలువలుకుట్టకు - మామా కొనిపోకుపోకు మన్నింపదయన్
మా మానమేలకొనిరాదు - మా మానసహారణమేల మానర కృష్ణా.

*        *        *        *

దరువు. అపుకృష్ణా చీరెలుగొని మమ్ము - ఆరడి బెట్టితివికాను
మ, మ్మారడి బెట్టితివికాను.
కూరిమి నాపైఁ గలయింతులే మిము - ఆరడియనుమ . . . రే॥
కూరిమి నెప్పుడు దొరకుదువోయని - కోరి భజింతుము కృష్ణయ్యా.
కోరిభజించినవారికి శుభములు - కొంగుమల్లెగాదటా రే॥
చిన్ననాఁటనుండి వలయించెద మిము - జిక్కించుకొంటిమి కృష్ణయ్యా॥
మిము॥

కన్నెలార మీ కౌగిటఁజేర్చన - ఘనతాకు రుక్కువగలదా॥ మీ॥
వాలాయముగ నిన్నెకోరిన వనితలముర - శ్రీ కృష్ణయ్య॥ మేము॥
మేలుగవ్రవధూకేశుడనై మిమ్మే మేలుదునిభగతులారా॥ మి॥
మానము హరియించెద మిము బట్టక - మానము మదనగోపాలా॥ మిము॥
మానకపోతే మరిమేలాయెను - మానవతులజేసె దాను॥ మిము మానవతు॥
అపురా కృష్ణా.

**End :**

మ. వ్రతముల్సేయుచు నొక్కమాటయిన నెవ్వాని న్విచారించినన్
వ్రతభంగంబులు మానునట్టివర దున్ వామాక్షులీక్షించి సం
గతచేలాప్లవనంబునేఁడు వ్రతభంగంబంచు శంకించి ఫా
లతటిన్యస్తకరాబ్జలై సరసలీలన్ మ్రొక్కిరత్లుందరున్.

తే. ఎలమి మేఘుము మొదురుయేతెంచినట్లూడె - చిరతరంబుగ నడియేరు లడ్డమటుడె
సలలితంబుగ గజుని పలికితీవు - సింహమని తెలిసివచ్చునె చిగురుబోణి.

**Colophon :**

(వి-వి.)—

సమ్మగము. వ్రాంత తిన్ననిదే కాని తప్పులు హెచ్చు. శైథిల్యము గ్రంథపాత కములు లేవు.

శ్రీ భాగవతమందలి గోపికావస్త్రాపహరణకథ ననుసరించి రచితమయిన యక్ష గానరచన మిది. కర్త పేరెఱుఁగరాదు. బమ్మెర పోతరాజుగారి భాగవతములోని పద్యములిందుఁ గొన్ని చేరినది.

ఇందు గ్రంథాంతరములు గలవు :—

1a రుక్మిణీవేషకథ. 15a సవతుల కయ్యము.

---

## No. 1882. జలక్రీడ.

## JALAKRĪDA.

Substance, palm-leaf. Size, $15\frac{1}{4} \times 1\frac{3}{8}$ inches. Pages, 13. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good, but not free from mistakes.

Begins on fol. 8*b*. The other works herein are Rukminīvēśakatha 1*a*. Savatulakayyamu 18*a*. Erukalavēśakatha 31*a*.

Complete.

Same work as the above. The work has been dedicated to God Vīrarāghavaswami worshipped at Trivellore.

**Beginning :**

వీడుగో వీడుగో నమ్మలారా, మా చిన్ని కృష్ణుఁడు
వీడుగో వీడుగో నమ్మలారా !

ద్విపద.

జయదీనమందార జగదేకవీర
నయగుణసముదార నందకుమార
యేమయ్య నీకిదె యేము మ్రొక్కెదము
మా మనవాలించి మా కోకలిమ్ము
వట్టి నీరాడేటి వనితల చీర
లట్టె కొంపోవ న్యాయముగాదు నీకు

పరులెవ్వరైన నీ పనికిఁ జొచ్చినను

* * * *

పనులిబువంటివి భావ్యంబుగాదు - మా వలువలు మాకు మగుడ నిమ్మసినా

**End :**

అందమైన సందిటి దండలందుకోవె చెలుంతకారి
కుందనంపు బొమ్మా నీ వెందుఁబోయేవే
కందువాతో నిన్నుఁ జూచి కరగిందె నా మనాను
అందమైనా సందిటి దండ లందె వుంచరా !
ఊరిపేరు తిరువళ్ళూరు ఉవిదరో వినావే నా
పేరు వీరరాఘవుఁడు ప్రేమతో వినవే !

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

శ్రీకృష్ణుఁడు జలక్రీడలాడ గోపికల వస్త్రముల హరించు కథ యిందు వర్ణితము. ఏతద్రచయిత తిరువళ్ళూరి ప్రాంతపువాఁడు కావచ్చును. తిరువళ్ళూరి వీరరాఘవస్వామి పేర నిందలి రచనములు గలవు.

ఇందలి గ్రంథాంతరము లివి :—

1a రుక్మిణీవేషకథ. 18a సవతుల కయ్యము, 31a ఎఱుకులవేషకథ.

---

## No. 1883. జ్ఞానకురవంజి.

## JNĀNAKURAVANJI.

Substance, palm-leaf. Size, 16½ × 1¼ inches. Pages, 11. Lines, 7 and 8 on a page. Character, Telugu. Condition, injured and worm eaten. Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Incomplete.

A small portion in the beginning is wanting. Deals with the Advaita philosophy supposed to have been related by a gipsy. Sannidhiraju Jagannāthakavi a disciple of Śaṅkarācārya of Sṛngerimutt, is the author.

**Beginning :**

చోడిగాడు వచ్చేను సొంపుపెంపు హెచ్చేను
చోడిగాడు వచ్చె నిడుగో నాడకాడ జాడఢలియ

నాడి పాడుకొంటు వెత్తి కోడిగములు వాడవాడ
నాడెముగను నెఱుకజెప్పు చేడె విడనాడె నింక
నేడు పువ్వుబోడితోడ వేడుకలర క్రీడలాడ॥ బో॥
వెక్కిరించు వక్క మొగము తక్కు చెక్కు ద్వక్కు నిక్కి
నిక్కి చూచు చెల్ల దిక్కు లొక్కసారె వలపు
సిక్కటిల్లు మిక్కుటంపు డొక్క లెదర పిక్కలదర
చొక్కముగను ద్రొక్కు చిందు తక్కులాడి నెక్కడనుచు॥ బోడిగాడు॥

**End :**

భ్రమలఁ జెందినందువల్లను జన్మానకు వచ్చును గనుక పుణ్యపాపసంయుక్తులంజేసి మానవకోటిని మనము ఇద్దఱము పడిసూత్రువుండవలెనే సింగి ! ఎవరి భావనల కొలందిని వారిని మునుపు చెప్పిన క్రమంబున మోక్షకర్మాలు రెంటినిన్ని త్రిప్పవలెనే సింగి

ఏల

నీవూ నేనూ గూడీ భావనా కొలఁదీ
కేవల బ్రహ్మన గీలు కొల్పుదమూ॥ నీవు॥
సారెసారెకు వారీ సరసాసంగములా
తీగాగా జగమూలా ద్రిప్పుచుందామే
జ్ఞానమార్గుల కెల్లా ధ్యానామూ లొసగే
మానకా మోక్షార్థ మహిమ చెల్పుదమూ॥ నీవు॥
మానవాగణములనూ మమత నొందించీ
పూని భ్రాంతులలోనఁ బొరలఁ జేయుదమూ॥ నీవూ నేనూ గూడి॥

**Colophon :**

శ్రీమదద్వైతవేదాంత రహస్య ప్రణవగుహాంతరాళనిలయ పరమహంస పరివ్రాజకాచార్యవర్య సర్వతంత్ర స్వతంత్ర శృంగ భేరీ సింహాసనస్థిత శ్రీమచ్ఛంకరాచార్య పాదారవింద మకరంద పానమిళిందాయమానమానస సన్నిధి రాజవంశపారావార రాకాశశాంక తిమ్మయ సుపుత్త్రి జగన్నాథనామధేయ ప్రణీతంబైన జ్ఞానకొఱుకల కురవంజియను మహా ప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము సంపూర్ణము.

గ్రంథాంతరమం దిట్లు గలదు :—

‘శ్రీమద్గురు వక్కలగడ్డ వీరేశలింగేభ్యోనమః బహుధాన్యనామ సం॥ మాఘ శు 10 సు॥ మెండు తాతయ్య జీవయెఱుకలకథ సంపూర్ణంగా వ్రాసెను.’

(వి.వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

అద్వైత వేదాంతమును ఎఱుకతయెఱుకరూపముగా నిందు వివరింపఁబడెను. శృంగేరీ మఠాధీశ్వరులయిన శంకరాచార్యులవారి శిష్యుఁడగు సన్నిధిరాజు జగన్నాథకవి దీనికిఁ గర్త. గ్రంథమునఁ దొలిభాగమిందు లేదు.

---

## No. 1884. జ్ఞానకురవంజి.

### JNĀNAKURAVANJI.

Substance, palm-leaf. Size, 16½ × 1¼ inches. Pages, 55. Lines, 6, 7 & 8 on a page. Character, Telugu. Condition, injured and worm eaten. Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Incomplete.

Same work as that described under No. 1852 ante. Date of transcription, Friday the 8th day in the second half of the Lunar month Phālguna in the year Bahudhānya.

Name of the scribe—Mendu Tatayya.

(వి-వి.)

అసమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె 1852.

గ్రంథాంతమం దీ వ్రాఁతగలదు :—

"బహుధాన్య నామ సంవత్సర ఫాల్గుణ బ 8 శు॥ వరకు ప్రతినున్న క్రమానను మెండు తాతయ్య వ్రాసెను. ఎరుకల కురవంజి వ్రాసెను. పూజారి జగ్గయ్యగారు చెప్పిన జ్ఞానయెరుకల కురవంజి సంపూర్ణము."

---

## No. 1886. త్రిపురసంహారము.

### TRIPURASAMHĀRAMU.

Substance, palm-leaf. Size, 14 × 1¼ inches. Pages, 3. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing fair and fairly free from mistakes.

Begins on fol. 71*a*. The other work herein is Pāṭalu (songs), etc., 1*a*.

Incomplete.

The story of the destruction of the three cities by God Siva is described herein. The name of the author is not known.

**Beginning:**

శ్రీశైలలింగ మీచరితా కథామృతము జీవనము బహు జన్మపావనంబు
సంగీత సాహిత్య సకల విద్యలగురువు గణనాయకుని మదిఁగనిభజింతు
కావ్య చందంబులు గణపద్ధతులు దెలియ వ్యాసాదిమునులకెల్లాను
మ్రొక్కేను కాళిదాసాది కవుల కెల్లాను
త్రిపుర సంహారంబు తెనుఁగునరచియింతు వివయముగ జనులకు విన్నవింతు.

**End :**

పురహరుండేఁడని పురుషోత్తముఁడు పిల్చి జయభేరి వేయించె జగతి మెఱయ
తలఁచిన కార్యంబు తత్క్షణములోనాయె తేరు మరలింపుమని తెలియఁబలికె
కైలాసగిరి త్రోవకై చనిరి సురలెల్ల గయాలాలూ పాడూచూ నడచిరీ
రాతిరి శివుని జోలాలూ పాడూదామనిరీ !

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

శివుని త్రిపుర సంహార కథ యిందు వర్ణితము. కర్త పేరెఱుఁగరాదు.

1 (a) పాటలు వగైరాలు.

---

## No. 1886. దాదినీవేష కథ.

## DĀDINĪVĒṢA KATHA.

Substance, paper. Size, 11⅝ × 8¼ inches. Pages, 5. Lines, 25 on a page Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good, but too full of mistakes.

Begins on fol. 270 (b) of the MS. described under No. 1847 ante.

Complete.

The story in this runs as follows,—At the instigation of the King of Magadha, a thief known as 'Pagalucukka' kidnaps the daughter of King Bhoja of Ujini (Ugjain) On the way the King of Māḷva, who had been out for a hunting happens to see this, rescues and restores her to her father, Bhoja. Thereupon King Bhoja who was very much pleased, gives his daughter to the King of Māḷava in marriage.

It is not clean how this work came to be known as దాదినీ వేషకథ.

**Beginning:**

క. శ్రీ వారణ వక్త్ర పద శ్రీ వర్ణపదలమ్ము లాత్మ సేవించెద కా
శ్రీ వర్ణ గాత్రుడనుదగు శ్రీ వర్ణుఁదలంత భీష్టసిద్ధి రయొసంగన్.

వ. అని నుతియించి రాజకంఠీరవుండనందగు నాంభోజ రాజ కుమారియగు నీలావతి విజయంబను నాటకంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన—

ద్వి. శ్రీకర మగధ దేశేశ్వరుడైన యా కీర్తితుని చెంతకట రొక్కనాఁడు
పారోహితుండొచ్చి ప్రకటించిపలికి ఓ రాజచంద్ర నీ కుర్విలోపలను
సకల రాజ్యంబులు జంభారివిభవ మకలంకముగ గలదైనను వినుము
ఇట్టి నీ సంపదకెనయైన లేమ పుట్టియున్నది విన్ము భోజరాజునకు
ఆలేమనీ యింతియై యుండెనేని చాలభాసిల్లు నీ సంపద లెల్ల
అని తెల్పిచనినయ్య వనీశ్వరుండు మనమున హర్షించి మమతరెట్టించి
పిన్న పెద్దలనంపి ప్రియమొప్ప వెళ్ల నన్నరనాయకుండటుగూడదనిన

* * * *

దర్వు. అట తాళం.

దర్వు. బాలనమ్మా, నె బాలనమ్మా బాలన పకీర్తి పాలైతినమ్మా
దొడ్డరాజు బిడ్డానైతి చెడ్డదొంగాచై చిక్కితి
మానధనమా గలిగీనపుడే, మానవతికి బట్టినట్టి
పీడు దెచ్చుటెరుగాలేక, అడుకుండూరెల్లా వారూ
హీనుచేత జిక్కినపుడే యెక్కువాలు చెప్పనేమీ
బంతికాడై కర్ణాకరుడూ ప్రాప్తమయ్యే దేమినేతు
రాజరాజైనా భోజారాజునకు తలవంపులాయె
పరమాపావనుడై అల్లంపాటి మదన యాజూనే బాలనమ్మా !

**End:**

దండును మరలించి తోడ్కొని యుజిని, మాంకాళి పట్టణమందలి జార
శంకలు మాని యజ్ఞ న నాయకుండు, మాళవపతిని సన్మానించినాఁడు
జాలి మాన్పితివయ్య సద్బాంధవుడవు కనుక నా పుత్రిక గైకొమ్ము ఇత్తు
నను పెంద మొప్ప వివాహంబుచేసె సురలు కిన్నరులు భూసురులు గీర్తింప
పరమాత్ముఁ డర్లమపాటీశు కరుణ వెలయుదు రీకథవిన్నఁజదివిన
కలిమియు బలిమియొక్కటి . . . తలఁపగా నాచంద్ర తారార్కముగను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పుల కుప్ప. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఉజినీ (ఉజ్జయినీ) మహాకాళీ పట్టణమేలెడు భోజరాజు కూతును, పగలుచుక్క యను దొంగ మగధ రాజు ప్రేరణమున దొంగతనముగా ఎత్తుకొని వచ్చుచుండగా త్రోవ

లో వేఁట వెడలిన మాళవ రాజు చూచి దొంగను తొలగించి యామెను ఉజ్జయినీ మహాకాళీ పట్టణమునకుఁ జేర్చుటయు తన్నగరాధీశ్వరుఁడగు భోజరాజు ముదితుఁడై తనకూతు నా మాళవ రాజున కిచ్చి పెండ్లి చేయుటయు నిందలి కథ. దీనికి చాదినీ వేష కథయని పేరేల వచ్చెనో తెలియదు. పగటి భాగవతాలాడువారీ వేషము వేయుదురు. అర్లమపాటీశ్వరుని కంకితముగా నిందలి దరువులు ద్విపదలు గలవు.

ఇందలి గ్రంథాంతరములకు నెం 1847 రు చూచునది.

---

## No. 1887. దారుకావన క్రీడ.

## DĀRUKĀVANAKRĪDA.

**Substance**, palm-leaf. Size, 8½ × 1 inches. Pages, 50. Lines, 4 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good and free from mistakes.

Complete.

The amorous sports of God Śiva in the forest Dāru are described in this. The author is Pālanki Pinakabōdi. For details regarding the author see extracts below.

**Beginning:**

శ్రీసుధాంశుధారు సుప్రకాశు రొంపిచెర్ల శంక
రేశు దురితనాశు గగనకేశుఁ గొలిచెదా !
కొండయందుఁబుట్టి పైఁడి కొండవిల్తుఁ జెట్టవట్టి
కొండఁగాపురంబునున్న కొమ్మఁగొల్చెదా ?
విద్దెలెల్ల నేర్చి చాల బుద్ధిమంతుఁడైన శివుని
పెద్ద కొడుకు నేకదంతుఁ బ్రేమఁబొగడెదా !
దక్షసంహారకారు దైవతాధ్యక్షుసుజన
రక్షురాచవీటి వీరభద్రు నెన్నెదా !
సుకవివరుల వినుతి చేసి కువిజనుల గేలిచేసి
యొక్కసువల నేరచింప నూహసేయుచు
మక్కలంబు నేర్పరింతు మహిని గులజులయినవారు
సత్కులంబు శైవమనుచు సన్నుతింపఁగా !
శైవకులపయోధి పూర్ణచంద్రుఁడనఁగ వెలసి శీ
లా విలాసమందు బాలంకయనఁగనూ
అతని కులవధూటి పర్వతమ్మ గర్భమునను వెలయ
సుతులు ఆఱుగురు విఖ్యాసుర యశోనిధుల్

వారిలోన నతుల ధర్మవర్తనుండు మానఘనుఁడు
చారుకీర్తి యన్నదానచక్రవర్తనన్
రాజసమున వెలసె నీధరాజనంబు లెల్లఁ బొగడ
రాజధరుని కృపను గుజ్జము గణేశుఁడూ
అతనిభార్య సోమనూంబ అన్నపూర్ణ యనగమించి
సుతులమమ్ముఁగనెనువి బుధనుతుల ముప్వురిన్
అన్నమాంబ కీర్తి సంపన్నుడైన పెదకపోది
యన్ననైతి నేను రాచన్న గారికిన్
పేరు పినకపోదియంద్రు పెద్దలెల్ల నన్నుఁజూచి
పేరుకలావిద్యలందుఁ బెద్దయంమరూ
శంకరేశ్వరుని వరప్రసాదమునఁగవిత్వమేను
శంకలేక పూనినాఁడ సరసు లౌనన్
మారసంహరుండు తొల్లి దారు వనములోన మునుల
చానుముఖులతో రమించు జార విద్యలన్
తేటగనేనే సువాలపాటగా రచించువాడ
పాటలాగంధులెల్లఁ బ్రౌఢిఁ బాడఁగా
హరుఁడు వాక్కునాఁడు తారకాచలంబునందు తనకు
నర్హమైన రత్న సింహాసనంబునా

**End:**

ఈ సువాల నిత్యమును జరించువారికెల్లఁ గృత్తి
వాసుఁ డిచ్చు నడిగినట్టి కాంధితార్థముల్
దారువనము క్రీడలనఁ గ దనరనుండు నీసువాల
పూరితముగ నా చంద్ర తారకమ్ముగా
జయతుజయతు పార్వతీశ జయతుజయతు స్వప్రకాశ
జయతుజయతు రొంపిచెర్ల శంకరేశ్వరా !
జయతు జయతు సద్విచార జయతుజయతు దురితదూర
జయతుజయతు రొంపిచర్ల శంకరేశ్వరా !
జయతు గానలోల జయతు జయతు స్వప్రతాప జయతు
జయతుజయతు రొంపిచెర్ల శంకరేశ్వరా !

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతము లేవు.

శివుఁడు దారువనమున జరపిన శృంగార విహారము లిందు వర్ణింపఁబడినవి. పాలంకి పినకటోదియను కవి దీని రచించెను. ఆతని వంశవృత్తాంత ముదాహృత గ్రంథభాగమునఁ జూడనగును. కవి యీ రచనమును 'సువల' యని పేర్కొనెను. ఇది గేయ రచనమగుటచే యక్షగానములఁ జేర్పఁబడినది.

---

## No. 1888. నంజరాజయశోభూషణము.

## NANJARĀJAYAŚŌBHŪṢAṆAMU.

Substance, palm-leaf. Size, 17¼ × 1½ inches. Pages, 53. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good, but not free from mistakes.

Complete.

This is a Telugu rendering of the model drama contained in the Sanskrit work called Nañjarāja Yaśōbhusana, on poetics, written by Narasimhaśāstri (who had the title of Ahinava Kālidāsa) in honour of Nanjarāja, King of Mysore. The name of the author is not known.

**Beginning :**

శ్రీరంగపట్నం ప్రభుత్వంచేసిన నంజరాజు చరిత్ర, శ్రీరంగపట్నం అని ఒకపట్నం. అనాదియై కావేరీతీరమందు ఉండెను. ఆ పట్నమందు అనేక దినములనుంచి బహు భాగ్యవంతుడున్ను భగవధ . . . డున్ను అయిన నంజరాజు అనేరాజు ప్రభుత్వం చేస్తూ ఉండెను. ఆ పట్నమందు ఆదిరంగస్వామి అనే శ్రీరంగనాథస్వామి స్వయం వ్యక్తమై ఉండును. ఆ స్వామియందు నిండా భక్తికలిగి సకల ఉత్సవాలు . . . . . . ఆ విద్వాంసులలో సకల శాస్త్రాలు చదువుకున్న బ్రాహ్మణుడు శివరామ శాస్త్రులు అని పేరు గలిగి ఉండును. ఆయన కుమారుడు నవీన కాళిదాసు అని పేరుగల్గిన నరసింహ శాస్త్రులు: నేను మీ విషయంగా ప్రబంధ నిర్మాణం చేస్తానని ప్రభువుతో మందలించినాఁడు. ఆ తర్వాత ఆ ప్రభువు బహుసంతోషపడి సకల బహుమానం చేసి తాంబూలం చేతికి ఇచ్చి ప్రబంధ నిర్మాణం చెయ్యుమన్నాఁడు. ఆ శాస్త్రుల్లు ప్రబంధంచేసి ఆ ప్రబంధాన్కి నంజరాజ యశోభూషణం అని నామంచేసెను.

**End :**

నీకు ఇంకా యేమి ప్రియంచేతును అని చెప్పినాఁడు. రాజున్ను జ్యోతిర్మయేశ్వరుడియొక్క అనుగ్రహంచేత మూడు లోకాలయందున్న పూజ్యురాలు అయిన యీ స్త్రీ నాచేత పొందబడెను. దీనికంటె నాకు ఏమి యిష్టార్థము ఉన్నది అని చెప్పినాడు. ఈ కథాంతమందు సకల బ్రాహ్మలు ఆశీర్వాదంచేసి బహుమతిపొంది తమతమ దేశాలకు పోయినారు. రాజున్ను అనేక బ్రాహ్మణాశీర్వాదంవల్ల సుఖంగా ప్రభుత్వం చేస్తూ అనేక దినములు మైసూరు అనే పట్నంలో ఉన్నాడు. సకల దేశాలయం

దున్ను ధర్మాలుచేస్తూ ఉన్నవాడు ఆయెను. ఈ రాజు ప్రభుత్వం చేస్తూ ఉండే టప్పుడు నిత్యా ఒక గజదానమున్ను పది గోదానములున్ను విద్వాంసులకు ఇస్తూ వచ్చినవాఁడాయెను. గజదానానికి వేయి వరహాలు దక్షిణ, ఒక గోదానానికి నూట పదహారు వరహాలు దక్షిణ, ఈ ప్రకారంబు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులున్నవి. శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

మైసూరి ప్రభువగు నంజరాజు పేర, అభినవ కాళిదాస బిరుదాంకితుఁడగు నరసింహ శాస్త్రి రచియించిన నంజరాజ యశోభూషణమను సంస్కృతాలంకార శాస్త్రగ్రంథమందలి నాటకోదాహరణమున కిది యాంధ్రవచనానువాదము. కర్త పేరెఱుఁగరాదు. వ్యవహార భాషలో నీరచనము గలదు.

---

## No. 1889. నల చరిత్రము.

## NALACARITRAMU.

Substance, palm-leaf. Size, 16½ × 1¼ inches. Pages, 176. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, not old. Mode of writing, good, but full of mistakes.

Complete.

The story of King Nala is described in this, beginning from his marriage with Damayanti, the loss of his kingdom in a game of dice with his cousin Puṣkara to his getting back the kingdom after undergoing many troubles. The name of the author is not known.

**Beginning :**

క. శ్రీమించు బిల్వపురమునఁ - బ్రేమతో భక్తులను నేలి ప్రియమలరంగా
నేమఱక వరములొసఁగెడు - సోమేశుని దలఁచి నేను గథ రచియింతున్.

క. గజవదను నేకదంతునిఁ - ద్రిజగన్నుతుఁ బరమపురుషుఁ ద్రిపురారిసుతున్
భుజగేంద్రహారు గణపతి - విజితేంద్రియుఁ గొలుతు సకల విద్యలకెల్లన్.

* * * *

చ. కలకల నవ్వుమోము తెలిగన్నులు కన్నులఁజూచినంతనే
తొలఁగును పాపపుంజములు తోడనె కల్గు సమస్త సంపదల్
ఇలనినునంటి దైవమిఁక నెన్నఁగలేదు రమామనోహరా
విలసిత భావ వయ్యపురి వేంకటనాయక శైలనాయకా!

ద్వి. శ్రీకరంబుగ సదాశివునిఁ బూజించి
కోకిలాంబను మదిఁగోరి నుతించి
హేరంబదేవు మహేశు వీరేశు
తోరంబు షణ్ముఖు స్తోత్రంబుచేసి
సాకల్యగుణయగు శారదఁగొలిచి

* * * *

వ. అని యీ విధంబున నుతియించి నేనేర్చుతెలుంగునఁ గావించు నీ నల నాటకంబునకుఁ గథాక్రమం బెఱుఁగవలెను.

ద్వి. శ్రీసుధాకరకుల శీలధర్మజుఁడు
ఆసుయోధనునిచే నవని తానోడి
లలనతోఁ బర్ణశాలను నేవురుండ

**End :**

దరువు.

వచ్చేవిభవము సూడరే, రాజేంద్రుడంత
వచ్చే విభవముచూడరే
వచ్చేవిభవముచూడు, వరుసతోడుత నేడు
మచ్చికతోనుకడు, ముచ్చటగాను జూడు ॥ వచ్చే ॥
పన్నగపుష్కరునిగూడి పగడసాలలాడివేగ
నెన్నగతన రాజ్యమును దా నేలుకొఁటకు వేడ్క॥
మురల దీవనలువడసి సుందరముగఁజూడ
అరుదుగ రాజేంద్రుడట్టి పూర్ణచంద్రునివలెను వచ్చె.

ద్వి. అంతఁ బుష్కరుఁడు తానంతయుఁదెలిసి
చింతచే మదిలోన శీఘ్రంబుగాను
నలరాజు ముందుగా నరుదెంచివేగ
కళవళముసుబొంది కడుభీతినొంది
కావవే నను రాజ కంఠీరవేంద్ర
నీవె గతియనుచును నిదెవచ్చినాను
నావల్ల వచ్చినట ? నరనాథ కాదు
భూవల్లభామీకు బొందెనితెల్పు
శరణసొచ్చితి దేవ శీఘ్రంబుగాను
కరుణతో ననుఁబ్రోవు కారుణ్యమూర్తి.

వ. శరణుశరణయ్యా రాజా నేనుచేసిన తప్పులెల్లా వొప్పుగాగైకొని నన్ను రక్షించి మీ రాజ్యం మీరే యేలుకోరయ్యా మహారాజా.

మహారాజశ్రీ రారా కేతినాయడా యీ పుష్కర రాజుకు సకలబోమతులూ చేసి అంపిరారావోరి ఆసమయంబున,

ద్వి. అప్పుడు రాజేంద్రుఁ డానందమంది
ఒప్పుతో దమయంతి యువిదనుగూడి
సురతెల్లఁ బొగడగా సుస్థిరంబుగను
అరయగా నపు డెంతొ ఆనందమంద
చట్టుముమీరగా సంతోషముగను
పట్టముగట్టుక పరగంగ వేడ్క
దానంబులును చాలఁ దనరఁగావేడ్క
మనమున పుష్పాంగి మఱివొప్పుచుండె.

వ. ఆడదనంబున రాజుకుపురజనులు శోభనం బాడిరటు యెటువలెను.

శోభనమే సరసునకు సురుచిరాకారునకు
శోభనమే దమయంతీ - సుందరీ రమణునకు
సుందరాకారునకు కందర్ప తేజునకు
కరుణావిధేయునకు శోభనమే !
మంగళమే జయామంగళమే.

* * * *

మంగళమే జయమంగళం నిత్య
మంగళమే శుభమంగళం.

(వి-వి.)—

సమగ్రము. గ్రాంథమంచిది. తప్పులమయము. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

నలమహారాజు కథయిందు వర్ణింపఁబడినది. నలదమయంతీ వివాహాదిగా నలుఁడు పుష్కరునికి రాజ్యమోడిపోయి యడవులపాలై యిడుములఁబడి తుదకు మరల రాజ్యమును దమయంతిని బడయుటదాఁక నీకథ కలదు. దీని రచనము మిక్కిలి నీరసమును తప్పులమయమునుగానున్నది. కర్త పేరు లేదు. బిల్వపురమున వెలసిన కోకిలాంబా కామేశ్వరదేవులిందు స్తుతింపఁబడిరి.

---

## No. 1890. నల నాటకము.

## NALANĀTAKAMU.

**Substance, paper. Size, 11¾ × 8¼ inches. Pages, 100. Lines, 26 on a page. Character, Telugu. Condition, uninjured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.**

**Begins on fol. 136*a* of the MS. described under No. 1847 ante.**

**Complete.**

Describes the story of King Nala beginning from the loss of his kingdom in a game of dice with his cousin Puṣkara, to the end, i.e., his regaining the kingdom after many troubles. The name of the auhtor is not known.

క. శ్రీమించు బిల్వపురమున - ప్రేమతో భక్తులను నేలి ప్రియమలరంగా
వేమరకవరము లొసఁగెడి - కామేశునిఁదలఁచి నేను కథ రచియింతుఁగా.

*　　　*　　　*　　　*

చ. కలకల నవ్వుమోము తెలిగన్నులుకన్నులఁ జూచినంతనే
తొలఁగును బాపపుంజములు తోడనెకల్గు సమస్త సంపదల్
ఇల నినువంటిదైవమిఁక నెన్నఁగలేదు రమామనోహరా
విలసితభావ ! వయ్యపురి వెంకటనాయక శైలనాయకా !

*　　　*　　　*　　　*

కురుచ జంపె - నాట రాగము.

జయపార్వతి తనూజ, జయభక్తకృతపూజ
జయసుధాకరతేజ జయవిఘ్న రాజా ! జయజయా,
జయసదాజితకామ, జయదేవతాస్తోమ
జయవినాయకనామ జయగుణోద్దామ !
జయశైల జారమణ, జయమునిస్తుతచరణ,
జయబిల్వపురిధురీణ జయభుజగభరణా
జయమదనమదభంగ జయతువృషభతురంగ
జయగౌరి హృద్భృంగ జయకోమలాంగా
శ్రీ వెలయ మిము భజనసేయు జనులకునెల్ల
నీవు దిక్కుగదమ్మ నిఖిలజగదంబా !
భూవలయమున నిన్నుఁ బొగడనేరనినన్ను
ప్రోవుదయ శ్రీబిల్వపురికోకిలాంబా ! జయజయా !

వ. అని యీ విధంబు ననుతియించి నానేర్చు తెలుంగున నేఁ గావించు నళ నాటకంబునకుఁగథా క్రమంబెటువలెను ;

*　　　*　　　*　　　*

వ. హో వినరయ్య సభాస్థాన సంపన్నులయినటువంటి విద్వాంసులు భట్లు గాయకులు షణియాచకులు ఇతిహాసులు పురాణీకులు కలిగినటువంటు మహానుభావు లల్లావిన

టుట్టుగా ఈ నళచరిత్రంబు నాటకంబుగా నా నేర్చుపాటి వినిపిస్తున్నాను. తప్పులెల్లా ఒప్పుగా గైకొని చూడ నవధరించరయ్యా సభా—ఆసమయంబున నళమహారాజు నా స్థానంబునకు పిన్న పెద్దయయిన కేతినాయండు వచ్చేమార్గం జేటువలెను.

**End:**

ద్విపద. అప్పుడు రాజేంద్రుండానందమంది ఒప్పుతో దమయంతి యువిదనుగూడి
సురవెల్లంబొగడగా సుస్థిరంబుగను అరయంగానపుడెంతో యానందమొంద
చట్టముమారంగా సంతోషముగను పట్టముగట్టుక పరగంగవేడ్క
దానంబులను జేయందనరంగా వేడ్క మనసునను పొంగిమతియొప్పుచుండె

వ. ఆతదనంతరంబున పురజనులు రాజుకు శోభనంబాడిరటు చూటువలెను.

శోభనమెసరసునకు సురచిరాకారునకు
శోభనమెదమయంతీ సుందరీరమణునకు
సుందరాకారునకు కందర్పతేజునకు
కరుణావిధేయునకు శోభనమే.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు.

నల మహారాజు కలిప్రేరణచే పుష్కరునితో జూదమాడి సర్వస్వమును గోల్పోయి దమయంతితో నరణ్యమున కరుగుట మొదలుగా నల మహారాజు మరల దమయంతీ సహితుండై రాజ్యమును బడయుట దాంకంగల కథయిందు వర్ణితమయినది. గ్రంథ కర్త పేరిందు గానరాదు. బిల్వపురిని వెలసిన కోకిలాంబయందు స్తుతింపబడినది.

ఇందలి గ్రంథాంతరములకు నె 1847 రు చూచునది.

---

## No. 1891. నిజలింగ చిక్కయ్య కథ.

## NIJALINGA CIKKAVYA KATHA.

**Substance,** palm-leaf. **Size,** 9⅜ × 1⅜ inches. **Pages,** 102. **Lines,** 5 on a page. **Character,** Telugu. **Condition,** good. **Appearance,** not old. **Mode of writing,** good but not free from mistakes.

**Complete.**

**Same work as that described under R. No. 279.**

**Date of transcription.—Monday the Second day in the first half of the lunar month Māgha in the year Vijaya.**

**Name of the Scribe,—Parangi Bāpayya.**

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్నది. తప్పులు కలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 279 రున వర్ణితము.

గ్రంథాంతమున నిట్లు వ్రాయఁబడినది.

"శ్రీ విజయనామ సం॥ మాఘ శు 2 విదియా సోమవారం రోజుకు శ్రీ భద్రకాళీ సమేతం ఉపాంగల రామలింగార్పణంగా కురంగి బాపయ్య నిజలింగ చిక్కయ్య కథ యక్షగానం సంపూర్ణంగా వ్రాశి సమర్పించెను."

---

## No. 1892. నిజలింగ చిక్కయ్య కథ.

## NIJALINGA CIKKAYYA KATHA.

Substance, palm-leaf. Size, 14¼ × 1¼ inches. Pages, 101. Lines, 4 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

**Complete.**

**Same work as the above.**

Date of transcription—Thursday the Seventh day of the second half of the lunar month Magha in the year Frājotpatti.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్నది. తప్పులున్నవి. శైథిల్యము కొంతకలదు. గ్రంథపాతములును కలవు.

పూర్వము లేదు.

గ్రంథాంతమందీ వ్రాఁతకలదు.

"ప్రజోత్పత్తి నామ సంవత్సర మాఘ బ 7 గు॥ చదువుల లింగయ్య ప్రతిక్రమాన నిజలింగ కథ సంపూర్ణంగా వ్రాసినాను."

---

## No. 1893. నిజలింగ చిక్కయ్య కథ.

## NIJALIṆGA CIKKAYYA KATHA.

Substance, palm-leaf. Size, 16⅜ × 1⅝ inches, Pages, 26. Lines, 9 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

**Complete.**

**Same work as the above.**

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత బాగుగానున్నది. తప్పులు గలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వము పోలె.

గ్రంథాంతమందిట్లు గలదు.

" నందన సం॥ ఆని నెల 11 తేది శుక్రవారం వరకు రాలించెటి రాచవేటయ్య వ్రాసిన నిజలింగ చిక్కయ్య చరిత్ర. "

---

## No. 1894. నిజలింగ చిక్కయ్య కథ.

## NIJALINGA CIKKAYYA KATHA.

**Substance paper. Size, 12⅝ × 7⅞ inches. Pages, 43. Lines, 18 on a page. Character, Telugu. Condition, most injured. Appearance, new. Mode of writing, good.**

Begins on fol. 157 (*a*). The other works herein are —Hariścandropākhyānamu 1*a*. Padminiparinayamu 133 *a*. Uttararāmāyanamu 181 *a*

Complete.

Same work as the above

(వి-వి.)—

సమగ్రము వ్రాంత మంచిది. పాఠభేదములు ఒంతుల నడుమ నిఱికింపఁబడినవి. గ్రంథ పాతములు లేవు. శైథిల్యము లేదు. ఈ ప్రతి 1841 సం॥ మూడు ప్రతుల పాఠ భేదములతో వ్రాయింపఁబడినదట. గ్రంథారంభమున రెండు పత్రములందు బ్రవున్ దొరగారింగ్లీషున కథా సంగ్రహము వ్రాసిరి.

పూర్వము పోలె.

ఇందలి గ్రంథాంతరము లివి.

1 అ-హరిశ్చంద్రోపాఖ్యానము, 133-అ పద్మినీపరిణయము, 181-అ ఉత్తర రామాయణము.

---

## No. 1895. నిజలింగ చిక్కయ్య కథ.

## NIJALINGA CIKKAYYA KATHA.

**Substance, palm-leaf. Size, 15⅝ × 1½ inches. Pages, 31. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing bad and full of mistakes.**

Complete.

**Same work as the above.**

(వి-వి.)—

వ్రాంత మంచిదిగాదు తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.
పూర్వము వోలె.

గ్రంథాంతమందీ వ్రాంత గలదు :—

“ చిత్రభానునామ సంవత్సర ఆషాఢ శు 5 ఆ॥ బడ్ల సూకనగారి ప్రతిని వ్రాసిన చిక్కయ్య కథా. మాదేటి రాముడు వ్రాసిన పొస్తకం ”

తుదను రెండు పుటలలో చాటు శ్లోకములు గొన్నియును, 6 పుటలలో భవాని శంకర వచనములు కొన్నియును గలవు.

---

## No. 1896. నౌకా చరిత్రము.

## NAUKĀ CARITRAM.

Substance, paper. Size, 8⅜ × 6½ inches. Pages, 48. Lines, 13 on a page. Character, Telugu. Condition, most injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 185 of the Ms. described under No. 1520 ante.

Complete.

The story described in this runs as follows:—

Once Sri Kṛṣṇa along with Gopis was floating in a pleasure boat in the waters of the River Yamuna , and while Sri Krisṇa was playing on his flute, the Gopis were listening at the divine music completely for getting there own selves At that time the water began to enter into the boat through a hole at the bottom. Then the Gopis stopped the water, by removing all their garments and putting them in to the whole and made a complete surrender of themselves to Sri Kṛṣṇa. Pleased at the devotion of the Gopis, Sri Kṛṣṇa warded off the danger.

The famous Tyagaraju of Kakarla is the author.

**Beginning:**

నాటు రాగము.

క. శ్రీగణనాథ పరాత్పర వాగీశ సురేశవంద్య వరగుణసాంద్రా
వేగమె నినుఁగొల్చెదనను బాగుగఁ బాలింపవయ్య పార్వతి తనయా !

* * * *

క. శ్రీమోక్షద దేశికవరునకు శ్రీమోక్షద ధర్మార్థ కామమోక్ష ప్రదకుణ్
శ్రీమోక్షదఁబదములకనిశము శ్రీమోక్షద శ్రీరామకృష్ణమోదాఖ్యునికిణ్.

క. ఇలసత్కవులకు ప్రేమెక్కుడఁ దెలియక పద్యములు కృష్ణదేవుని పై నే
లలితముగా రచియించిన పలుకులందపొప్పులున్నఁ బాటించరయా !

క. కాకర్లాంబుధిచంద్రుండు శ్రీకరుండగు త్యాగరాజ చిత్తనివేశా !
నాకాచరిత మొనర్చిద శ్రీకాంతా చిత్తగింపు శ్రీరఘురామా !

క. ధరలో హరికృతి నాకా చరితంబును విన్నవారు సన్మార్గముచేఁ
జిరజీవులై చెలంగుచు వరసుత ధనములను బడసివర్ధిల్లుదురో !

ఎరుకల కాంబోది రాగము.

శా. లోకానుగ్రహకారియై మునురమాలోలుండు నందాత్మజుం
డాకాంతామణులన్ రమింపమదిలో నాహ్లాద సంయుక్తుఁడై
పాకారిప్రముఖుల్ మునీంద్రగణముల్ బ్రహ్మేశ్వరుల్ మెచ్చఁగా
నాకాక్రీడనసల్పె గోపికలతో నారాయణుండత్తఱిన్.

శా. చిత్రంబేమని విన్నవింతు వినరే చిన్మాత్రుఁడా కృష్ణుచా
రిత్రం బెల్లవినంగ నిందు సుఖముల్ రేపల్లెలోఁ దోచఁగాఁ
బత్రాహారముచేత నిర్మమతులై బ్రహ్మజ్ఞులీ రీతిగా
బుత్రాగారధనంబులన్ మఱచిరే పుణ్యాత్మకా గోపికల్.

పంతువరాళి రాగము.

వ. ఆ సమయంబునఁ బరమాత్ముఁడైన కృష్ణదేవుండు గోపికలయందుఁ బ్రేమగలవాఁడై వేణుగానంబు సేయుచున్నాఁడు.

* * * *

వ. అంతట గోపికామణులు శ్రీకృష్ణదేవునిఁదోడ్కొని ఆటపాటలతో వేంచేసే మార్గంబెటువలెను.

దరువు; సురటి, ఆది.

శృంగారించుకొని వెడలిరి, శ్రీకృష్ణునితోనూ
అంగరంగ వైభోగముతో గో
పాంగనామణులు ఎంతో సొగసుగ. శృంగారిం॥
నవ్వుచు కులుకుచు నొకతా, కొప్పున
పువ్వులు ముడుచుచు నొకతా
దువ్వుచు కురులను నొకతా, కృష్ణుని
రవ్వసేయుచు నొకతా, వేడ్కగ. శృంగారించుకొ॥

దర్వు-పున్నాగ, ఆది.

గంధము పుయ్యరుగా, పన్నీరు, గంధము పుయ్యరుగా,
అందమైన యదునంద నునిపై, కుందరదన లిరవందగ పరిమళ గంధముపు
య్యరుగా॥
తిలకము దిద్దరుగా, కస్తురి, తిలకము దిద్దరుగా,
కలకలమను ముఖ కళగని సొక్కుచు, పలుకులనమృతము లొలికేస్వామికి, తిల
కము॥

చేలము గట్టరుగా, బంగరు, చేలము గట్టరుగా,
మాలిమితో గోపాల బాలురతో, ఆలమేపిన విశాలనయనునికి, చేలము॥
హారతు లెత్తరుగా, ముత్యాల హారతు లెత్తరుగా,
నారీమణులకు వారము యౌవన (?) వారక మొసగేవారి జాతునికి, హారతు॥
పూజలు సేయరుగా, మనసార, పూజలు,
జాజులు మరి విరజాజులు దవనము, రాజితముగ త్యాగరాజ నుతునిపై, పూజ
లు సేయరుగా॥

**End:**

వ. అంతట గోపికామణులు అత్యంత కుతూహలముచే కృష్ణదేవునిఁ దోడ్కొని విడిదిలోనుంచి మంగళం పాడెదెటువలెను.

సురటిరాగం.

మాతులముల కీకవరములిచ్చిన నీకు మంగళం జయమంగళం,
మాతులం బ్రోచిన మదనజనక నీకు మంగళం జయ॥
మదగజ గమనమానిత సద్గుణా, నీకు మంగళం,
మదనమోహన రహిత మంజుళరూప మతి నీకు మంగళం,
మనసిజ వైరి మానస సదనా నీకు మంగళం,
మనవిని విని మమ్మేలుకొన్న నీకు మంగళం.
మా మనసుల నేలకొన్న కృష్ణా నీకు మంగళం,
మా మనోహరపాలిత త్యాగరాజా మంగళం జయమంగళం.
త్యాగరాజ కృతాంపుణ్యాం కథాం సాధు మనోహరామ్,
యే శృణ్వన్తి నరా లోకే తేషాం కృష్ణః ప్రసీదతు.

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులుగలవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

నౌకా చరిత్రమని పేరుగ యీ మనోహర యక్షగానమునందలి కథా సారమిది ! గోపికలు శ్రీ కృష్ణునితో యమునానదిపై నౌకా విహారము సల్పుట, శ్రీ కృష్ణుని మురళీ గానమున గోపికలానంద పరవశలగుట, ఓడలో రంధ్రమేర్పడి లోనికి నీరువచ్చుట, కృష్ణోద్బోధమున గోపికలు తమ రవికలను చీరలను, ఆ రంధ్రమునఁ జొప్పించి నీరు నిలు

షుటు, శ్రీ కృష్ణునికి గోపికలాత్మార్పణము చేసికొనుటు, అపదఁబాయుటు, శ్రీ కృష్ణుని మంగళముపాడుటు, ఏ తద్గ్రంథకర్త సుప్రఖ్యాతుఁడగు కాకర్ల త్యాగరాజు.

ఇందలి గ్రంథాంతరములకు, నె 1520 రు చూచునది.

---

## No. 1897. పద్మినీ పరిణయము.

## PADMINĪ PARIṆAYAMU.

Substance, paper. Size, 12⅝ × 7⅞ inches. Pages, 48. Lines, 20 on a page. Character, Telugu. Condition, uninjured. Appearance, old. Mode of writing, good, but not free from mistakes.

Begins on fol. 133(a) of the Ms. described under No. 1894 ante.

Complete.

The story of Sri Ranganathaswāmi marrying Padminidēvi, daughter of Rāyacauhattamallu is given in this. Vēnkaṭapati Kavi iṣ the author.

**Beginning:**

ఉ. శ్రీ కుచదేశ కుంకుమ విచిత్రతరోపమ చిత్రితాంబు భే
లాకలిత ప్రమోదగళిలక్షణ నీరచరాంక పత్రముల్
శ్రీకరనక్రకుండల విశేషములొందు కపోల పాలికల్
లోకము లెన్నఁ గల్గుహరి లో భజియించెద నిష్టసిద్ధికిన్.

వ. అనికృతి కర్తయగు రంగభర్త నేమని కీర్తింపుచున్నాఁడు.

అటతాళం.

రజనిచరకులదూథ తిమిరశరజనిరోధ, జయజయ,

* * * *

భయవిరాజునకు సురపద సార్వభౌమునకు
రయవదరి ధామునకు రంగధామునకు,

వ. సమర్పణంబుగా నా యొనర్పంబూనిన పద్మినీ పరిణయంబను యక్షగానంబునకు నిధాన ప్రధానంబగు కథావిధంబెటువలెను.

**End:**

జంపె.

పసిడిచే నిర్మింపఁబడిన తండులము లీ
వసుధ మున్నూట యరువదికలము లొసఁగెన్.
అసమాన రత్న దివ్యాంబరాభరణములు
లీసము లొప్పఁ బెక్కువాహనములు నొసంగెన్.
సతతంబు నారతులు సలుప నృత్యంబాడ
వితత రూపాంగనలు వేవేల నొసఁగెన్.

వ. మఱియుం దక్షిణ యుచితంబులు సలిపి రమణీయమణిమయగోపుర ప్రాకార మంటపంబు లనేకంబుగఁ గట్టించి సకల భోగోత్సవంబు లెసంగ సమకట్టించి జగజ్జనకుండగు రంగవిభునకు లోకైక జననియగు పద్మినీ పద్మలోచనకుం దనకలుగు సంపదలుసమర్పించి రాయచౌహత్తమల్లుండనెడి రాజవల్లభుండు పరమవిజ్ఞానానంద సంపదం జెంది భక్తిపరత గాంచి తత్పాద తాత్పర్యుండై యుండెనపుడు మఱిన్నెటువలెను

క. గురుభక్తిఁ బద్మినీసతి చరితము జను లెవ్వరైనఁ జదివిన వినినన్,
సరసగతి వ్రాసినను శ్రీ హరికరుణ భీష్టములు మహత్త్వము గాదున్.

ద్విపద. అని భక్తజన రక్షణాధారు పేర ననుపమ ధర్మ దయాధారు పేర
నతుల కౌస్తుభ రత్న హారుని పేర నతిలోక కీర్తి విహారుని పేర
నందనీ కృతవచో నాథుని పేర నందక చక్రసనాథుని పేర
నీరజ మిత్రాబ్జ నేత్రుని పేర నీరంధ్ర సౌవర్ణ నేత్రుని పేర

* * * *

దారిద్ర్యహర రంగధాముని పేర
నంకితంబుగ సమస్తార్య కైంకర్య సంకలితాది కేశవనాథపాద
పంకేజపూజనా భవ్యమానసుఁడు పంకదూరస్థైర్య భట్టరాచార్య
మానితాలంబి రామాయణనంబి సూను వెంకటనంబి సుకృతి నందనుఁడు
పరమవైష్ణవ పాదపద్మ సేవకుఁడు సరస వెంకటపతి సత్కవీశ్వరుఁడు
ప్రచురోక్తిఁ జెప్పిన పద్మినీ పరిణయ చరిత్రమనియొడి యక్షగానంబు
చారుసుధారసా సారంబురీతి నారవితారాబ్జమై యొప్పఁ గాత!

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులుగలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

రాయచౌహత్తమల్లుఁడను రాజుకుమార్తను పద్మినీదేవిని శ్రీ రంగనాథస్వామి కల్యాణమాడుట యిందలి కథ ఏ తద్గ్రంథకర్త వేంకటపతి కవి. విశేషములకు దాహృత గ్రంథభాగములఁ జూచునది.

ఇందలి గ్రంథాంతరములకు నెం. 1894 రు చూచునది.

---

## No. 1898. పవళింపుసేవ.

## PAVALIMPUSĒVA.

**Substance, palm-leaf. Size, 14½ × 1½ inches. Pages, 9. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good and free from mistakes.**

**Begins on fol. 14 (*a*) of the Ms. described under No. 1877 ante.**

**Complete.**

The last item of worship is to make the God and his wife to go to bed The work under notice contains songs sung on such occasions. The songs are meant for the worship of Venugopālaswāmi at Cocanada. The name of the author is not known.

**Beginning:**

గుమ్మ కాంభోది రాగము—ఆటతాళము.

మందారాంగి నీ కెమ్మోవి, విందుచేసి చనుబంతు
అందనియ్యవే యీ వేళనూ, ఓ మోహనాంగి !
కుందసంపుగోలును లిచ్చేనే,
పందెమేఁమూ చేసేవూ, మామగారున్నారిచ్చోటు,
కందువా మాటాలాడాకురా, గోపాలదేవా,
వందనము చేసేద పోరా !

* * * *

తూరుపు దిగ్భాగాధీశ, ఐరావతారూఢ శచీ
సమేత దేవేంద్రా ఓహోహోయీ, కాకినాడ
పట్టణమందు శ్రీవేణుగోపాలస్వామివారు
రుక్మిణీసమేతంగా పవ్వళించియున్నారు, నీ స్థ
లమందు జాగ్రత ! జాగ్రత ! ఓహోయీ !

**End:**

నందివాహనారూఢ ! పార్వతీసమేత, సాంబశివా ఓహోహోయీ కాకినాడ పట్టణమందు శ్రీవేణుగోపాలస్వామివారు లక్ష్మణా సహితంగా పవ్వళించియున్నారు. నీ స్థలమందు జాగ్రత, జాగ్రత, ఓహోహోయీ ! రుక్మిణీ జాంబవతీ సత్యభామా కాళిందీ మిత్రవిందా సుదంతా భద్రా లక్ష్మణాసమేత శ్రీవేణుగోపాలాయనమః.

తర్వాత మూఁడు పుటలలో వేణుగోపాలస్వామివారిమీది లాలిపాటలున్నవి.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులులేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

దేవాలయములలో పవళింపుసేవ, అని రాత్రివేళ, స్వామిని అమ్మవారిని, పెజ్జపైఁ బరుండఁబెట్టి జరపు నుత్సవమునఁ బాడఁబడు పాటలు, ఇక్కడ నిందుఁగలవు. కాకినాడలో వెలసిన వేణుగోపాలస్వామివారి సేవకై యిది రచితము. కర్త పేరెఱుఁగరాదు.

ఇందలి గ్రంథాంతరములకు నెం 1877 రు చూడునది.

## No. 1899. పారిజాత ప్రబంధము.

## PĀRIJĀTA PRABANDHAMU.

Substance, paper. Size, 11⅝ × 6⅞ inches. Pages, 112. Lines, 22 on a page. Character, Telugu. Condition, injured, and worm eaten. Appearance, old. Mode of writing, good, but full of mistakes.

Complete.

Same work as that described under R. No. 550; where it is named as "Āṭabhāgavatam" This is one of the popular yakṣagānas usually staged in villages.

**Beginning:**

కీర్తన. అంబుజాసనురాణి హరిరాణి, కొలువగా అబావో భ్రమరాంబావో!
తుంబూరు నారదాదులు హెచ్చిపాడేరు అంబావో!

తే. సరస నరుకూరు ముత్తధీవరుని గాళె మాంబతనయుండ విశ్వకర్మాన్వయుండ
నమితయశుఁడను నారాయణాఖ్యకవిని నేరచించుకథాక్రమంబెట్టిదనిన,

వ ఇట్లు పారిజాత ప్రబంధంబను యక్షగానంబునకుఁ కథాక్రమం బెట్టిదనిన,

**End:**

ద్వి. అనియిట్టులీకథ నాద్యంతముగను జనమేజయునకు వైశంపాయనుండు
వినిపించెనయ్యా కోవిదజనాధార ఘనవెలుగోటి బంగరుయాచనృపతి
తనయకుమారేచ ధరణీతలేంద్ర వినవయ్య యిది జగద్వినుతప్రభావ
మిదిపుణ్యచారిత్ర మిది బుధస్తోత్ర మిది జన్మసాఫల్య మెవ్వరువిన్న
జదివిన వ్రాసిన జనులకునెల్ల ముదమునాయువ భీష్టమును సమకూడి
ధరణిలో నాచంద్ర తారార్కముగను పరమకళ్యాణులై ప్రబలియుండుదురు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు చాలఁగలవు. శైథిల్యము మిక్కిలి హెచ్చు. అంచుచే గ్రంథపాతము లేర్పడినవి. గ్రంథారంభము తొమ్మిది పుటల తర్వాత నున్నది. తొలి తొమ్మిది పుటల గ్రంథము తర్వాతఁ జేర్చవలసినది.

ఇది ఆర్ నె 560 రున వర్ణితము.—ఈ ప్రతిలోనిది 'ఆట భాగవత'మని పేర్కొనఁబడినది. ఇది గ్రామములలోఁ బ్రదర్శింపఁబడు యక్షగానములలోఁ బ్రధానమయినది.

---

## No. 1900 పారిజాత కథ.

## PĀRIJĀTA KATHA.

Substance, palm-leaf. Size, 15¾ × 1¼ inches. Pages 10. Lines, 6 on a page, Character, Telugu. Condition, much injured and worm eaten. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Similar to the work described under No. 1899.

**Beginning:**

ద్విపద. . . . . . . . . . . . . . . రమునఁ

బూని తెల్లని కాంచన పుష్పనాళంబు మసలి గాదలి రేకు మానిపైఁబెట్టి
పాసగించి బిందుసోపునఁబడకుండ బిసముతో నాడను బిగియించికట్టి
మొగలి పుష్పాడిమందు ముసివ్రేల్లఁబట్టి ముగినాళమునఁబోసి మొదలుతాటించి
కలువతీగె సలాకుగాఁ గఘటించి మలయుచు వెలిబొడ్డు మల్లెపూగుండ్లు
వేసిరంజకమతి వేగాననూతి వాసికెక్కిన మరువంపు పూనిప్పు
జేసివాదరలోనఁజెక్కితుపాకి మోనుగానెత్తి రొమ్మునతండు . .
గాలువేసుక యొక కనుమూసికరుణ మాలియు నొక కనుమాత్రంబెదెరచి
జోకఁ బాపమటంచుఁ జూడక చెలఁగి రాకేందుముఖి మిఠారంపుపాలిండ్లు
సందు కాకీయ నూటి చక్కఁగాఁజూచి కందువతో రంజకము తటుక్కనఁగ
వెసడమీయన వేసినందు . . . . .
కుసుమ కోమలికుల్కు గుబ్బలనడుమఁ దాఁకినవోయని ధరణిమూర్ఛిల్లె.

**End:**

ద్వి. వలనొప్పఁగాను దేవతలసన్నిధికిఁ గొలఁదిమెఱంగ సద్గురులసన్నిధికె
ధరణిలో రిక్త హస్తములవచ్చుటకుఁ బరువడిశాస్త్ర సమ్మతిగాదు గనుక
గరిమతో నింద్రలోకమునకుఁబోయి సరసిజేక్షణ పారిజాత పుష్పంబు
స్థిరమొప్పఁగానుక దేచ్చితిననుచుఁ గరమొప్పనొసఁగె శ్రీకాంతుఁడంతటను
భావంబులో సత్యభామను దలఁచి (యీవిరిగొనిపోముయింతికియ్య
నీయింతిచూఁ సహింపదీమాట న్యాయంబటంచును
మానసమునందలంచి యెడయకరుక్మిణియింతికినియ్య
తొడమీఁదనిడుకొని సంతోషంబుమీర.

(వి-వి.)---

అసమగ్రము. 18 నుండి 20 దాక సంఖ్యలుగల యీ యాకులకు వెనుక ముందుల నుండవలసిన యాకులు పోయియుండును. వ్రాఁత చక్కనిది. తప్పులు గలవు శైథిల్యము గ్రంథపాతములు గలవు.

ఇది నెం 1899 రున వర్ణితమయిన గ్రంథమును బోలినదే. కాని యిది యల్ప భాగమాత్రమే. ఇందును నరుకూరి మురారి ప్రస్తుతికలదు.

---

## No. 1901. పారిజాత కథ.

## PĀRIJĀTA KATHA.

Substance, palm-leaf. Size, $16\frac{3}{4} \times 1\frac{1}{8}$ inches. Pages, 58. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode writing, fair, but full of mistakes.

Complete

Similar to the work described above.

Nandavaramu Singana who lived at Bukkapaṭṭana, is the author. The work has been dedicated to God Kṛṣṇa worshipped at Kambham.

**Beginning:**

క. తిరుమల రంగాచార్యుల తిరువడిఘులు దలఁచి కృష్ణదేవునికరుణన్
ధరబుక్క పట్టణంబున శృం (?) గారముగ (?) పారిజాత కథ పెంపొందన్.

గీ. చంద్రకాంత శిలామయ జగతిమీఁద వరుసతోడుత నుద్యానవనము చెంత
బలసియింతులుచుట్టును గొలువు సేయఁ గొలువఁగూర్చుండె గోపాలకృష్ణుడపుడు.

సీ. వసుదేవదేవకీ వరగర్భజలధికిఁ బున్నమ చంద్రుఁడై యున్నవాడు
లాలించి పదియారువేల గోపస్త్రీలఁ జెలఁగుచు రతికేళి సలుపువాఁడు
చాణూరమల్లుల సమయించి కంసుని దారుఁడై కోర్కులఁ దనరువాఁడు
సురయక్షకిన్నర వరమానిజనులు నుతించ లోకములు రక్షించువాఁడు
దేవతాసార్వభౌముఁడు దివిజనుతుఁడు శౌరిదిఁ జల్లనిచూపులఁజూచువాఁడు
భక్తజనములపాలికల్పకమితండు కృష్ణదేవుండు మమ్ము రక్షించుఁగాత!

వ. ఆ ద్వారకాపురం బెటువలెనంటేను,

* * * *

సీ. పలుమారుచెలులనేఁ బంపి వేసారితి రాకయున్నాఁడు పరాకుచేసి
కమ్మకస్తూరిపువ్వు కానుకలంపినా అవియైనఁదన కేల నంట డాయె
సారెసారెకువాని దూరి వేసారితిఁ జెవిఁజేర్పఁ డేమాటఁ జిత్తగించి
మక్కువవానికి మ్రొక్కి వేసారితి కొంతైనదయయుంచి కూడఁడాయె
వానికిని నేనదగులని వలచియుంటి తానునిచ్చిన బాసలు తప్పిమఱచె
నెందరెంపణు రతికేళి యిందుముఖులు రాఁడు గోపాలకృష్ణుఁడు రాపుఁజేసి.

* * * *

ఘంటా రాగం—పదం జంపె.

గగనముగమునను డి దిగివచ్చెన్, వచ్చి మగువ రుక్మిణినేలమెచ్చెన్, మెచ్చి
తగుపారిజాతమేలిచ్చెన్, ఇచ్చి జగడములతబిసి మచ్చరమేలబెంచెన్
ఇకనేటిమాటలోయమ్మా అల్లి, వగమీరు కృష్ణునిది వలపుతుమమ్మా.

* * * *

జంపె తాళం.

విరహవేదనచేత మరుగుసొచ్చినవారి తతిమికొలువులఁజూడఁదగునయ్య నీకు!
చందమామా! ఓ చందమామా! (పల్లవి.)
ఓ చందమామయ్య! నీ చందములుమాని నాచెంతఁ జేర్పవలె నాప్రాణవిభుని,
చందమామ!

* * * *

**End:**

కీర్తింపఁగంథము కృష్ణునిపేర నంకితంబుగఁ జేసె హరిపాదయుగళ
పంకజభక్తుఁ డౌబళమంత్రిసుతుఁడు నందవారాఖ్యుండు నారాయణుండు
అందమా బుక్కపట్టణవిహారుండు అతనినందనుఁడు సింగన కవీశ్వరుడు
చతురతవాచంద్ర తారార్కముగను.

శోభనపాటలు.

అర్జునకు వేదము లతివేడుక నిచ్చు సుజనస్తుతునకును,శోభనమే,

స— * * * * *

పురుషోత్తమునకు బుక్కపట్నముహరి సురుచిరాగమునకు శోభనమే.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

అబద్ధాలు చాలవున్నవి ప్రతిచూచి దిద్దుకోవలసినది. కోపం చాయవద్దు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతిన్ననిది. తప్పులు చాలఁగలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది పూర్వవర్ణితములగు గ్రంథములను బోలినదే. అదే కథ ; రచనము వేఱు, బుక్కపట్టణ వాస్తవ్యుఁడగు నందవరము సింగన దీనికిఁ గర్త. కంథము కృష్ణదేవున కిది సమర్పితము.

---

## No. 1902. పారిజాత కథ.

## PĀRIJĀTA KATHA.

**Substance, palm-leaf. Size, 15½ × 1¼ inches. Pages, 80. Lines, 4 and 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.**

**Complete.**

**Same work as that described under No. 1901 ante.**

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. శైథిల్యము, గ్రంథపాతములు కొలఁదిగాఁగలవు.

ఇది నె 1901 రున వర్ణితమయిన గ్రంథమే. దానికిది మాతృక.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

“ విరోధికృతునామ సంవత్సరం భాద్రపద శుద్ధ అష్టమి మంగళవారమునకు బుక్కపట్టణం పారిజాతం వ్రాసి నిరవరినది. ఈ పుస్తకం కలవాయి కాళహస్తి భక్తుని కొమారుడు పాపయ్యది ”

## No. 1903. పారిజాతము.

## PĀṚIJĀTAMU.

Substance, palm-leaf. Size, 12⅞ × 1⅝ inches. Pages, 22. Lines, 7, 8 on a page. Character, Telugu. Condition, injured and slightly worm eaten Appearance, old. Mode of writing, bad and full of mistakes.

Incomplete.

The same story of the seizure of the pārijāta tree contained in the poetical work " Pārijātāpaharaña " of Mukkutimmana, is herein written in the form of Yakaṣagāna. The name of the author is not known.

**Beginning :**

శ్రీ గౌరిపుత్రు నంచితను చారిత్రు వాగీశనుతుమేరు వాకౌరదారు (?)

* * * *

అనియిట్లు గణనాథు నతిరమ్యముగను పూజించి కీర్తించి పొందుఁగా నేఁడు
నా జన్మమిలఁ బావనంబు గానాదు భావంబులో గనపారిజాతంబు
యక్షగానముః చేతునని సంతపిల్ల.

* * * *

ఆదౌ దేవకి దేవిగర్భ జననం గోపీ గృహేవర్ధనం
మాయాపూతన జీవితాపహరణం గోవర్ధనోద్ధారణమ్ !
కంసచ్ఛేదనకౌరవాదిహరణం కుంతీసుతాపాలనం
ఏ తద్భాగవతం పురాణకథితం శ్రీకృష్ణ లీలామృతమ్ ॥

* * * *

కాంభోజి రాగం, త్రిపుట.

ఎన్నాఁడు వానికి ఏలలానైతినో వెన్నెలారో, వాఁడు
నన్నెదదలచడు నేనేమి చేతును వెన్నెలారో !
చాలాగా నమ్మితాఁ చక్కని చెలిమికి వెన్నెలారో, నా
మేలును నింతైన మనసు నుంచడాయె వెన్నెలారో
వలపునిల్పరాదు వశముగాదు ఇంక వెన్నెలారో.

* * * *

పదం.

మనవి నొక్కటి చెప్పేనే రామచిలుకా, నా
మనవి గైకొనవే వో రామ చిలుకా !
ఉజ్జిరం గాల్చేనే వో రామ చిల్కుకా, వాని
బుజ్జగించి తోడితేవె రామ చిలుకా !

ఆహారము సైపదాయె రామచిలుకా, నా
  హారములు నీ కిచ్చేనే వో రామచిలుకా !
మందులిమారి రుక్మిణిరో రామచిలుకా, దాని
  మందులు తన కెక్కెనయ్యో రామచిలుకా ।

* * * *

**End :**

. . కుసుమంబు రుక్మిణి కొప్పుననుంచి - రసికత గాంచియు రావుప్రాణేశ
యేగతి వేగింతు నెటొప్పోర్తు ననుచు - కౌగిలి నెంత కట్టిడినయిన
దిగనాడ నొల్లదు దిక్కునీవనుమి - ధనమిచ్చు పుచ్చుకోఁ దగవుగాకనుమి
చనవిచ్చి తప్పిన సతులోర్వఁ గలరె - అని విన్నపము నేయ నంపించెనపుడు

ఉ. శ్రీమీతు బుద్ధిమంతునకుఁ జిల్కలరాజుకు వన్నెకానికిన్
  కాముని రూపవంతునకుఁ గొఁగటనుంచిన యెమ్మెకానికిన్
  నామది ప్రాణనాథ నిను నమ్మితిఁ జైకొని విన్నవించుమా
  ప్రేమకటాక్ష ముంచుమని వేగమే జాబులు చిత్తగింపుమా !

చ. కిలకలపల్కు చిల్కకును గేరెడు మన్మథుచేతి ముల్కికిన్
  నిలుకడలేని గాలికిని నిగ్గులవెన్నెలగుండె జాలికిన్
  నళినదళాక్షి తాళగలనా పతికివ్యథమెల్లఁ జెప్పుమా
  చిలుకలతాళి యిచ్చెదను శ్రీ జగదీశునిఁ దోడితేఁగదే !

వ. అప్పుడు మాధవితోను అన్ని వృత్తాంతాలు తెలియఁజెప్పి కృష్ణరాయుని వద్దికి
. . సత్యభామ చింతిస్తుండెను.

మ. మాసిన చీరగట్టుకొని—

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులు హెచ్చు. శైథిల్యము. గ్రంథ పాతములు గలవు.

ముక్కు తిమ్మనకవి పారిజాతాపహరణ ప్రబంధములోని కథయే యక్షగాన రూపమునగలదు. రచయిత పేరెఱుఁగరాదు. ఇది నె 1901 రున వర్ణితమగు గ్రంథమును బోలినది.

గ్రంథాంతమున రెండాకులమీద నీక్రిందఁ
జూపఁబడిన యారంభ భాగములుగల పాటలున్నవి :—

I. మంత్రములా నెల్లా మూలాము రామమంత్రము

II. పాహిరామ ప్రభో ! పాహిరామ ప్రభో

III. అభ్రనయ్యా భద్రగిరి విజయరామా, అనివారితాము మామీద నీ ప్రేమా !

IV. చిన్ని ముద్దులగోపాల కృష్ణా ! చేరారాగదరా ! నన్ను గన్నతండ్రి దృష్టి
తాకేనయ్యా నావద్దనే వుండుమీ గోపాలా

---

## No. 1904. పారిజాతము.

## PĀRIJĀTAMU.

Substance, palm-leaf. Size, 9¼ × 1 inches. Pages, 160. Lines, 4, 5 on a page. Character, Telugu. Condition, very much injured, Appearance, very old. Mode of writing, good but full of mistakes.

Incomplete.

Similar to the work described under No. 1903 ante. Some of the verses and prose passages appear in both the works, taken perhaps from a common source.

**Beginning:**

సకల సురగణ యక్షకిన్నర సేవితాపద పంకజా
నిఖిలమునిగణ వనసరోరుహ నిలయ ఆగమగోచరా !
శరన శరణు అహల్యాపావన శరణు దశరథ నందనా
శరణు తాటకి ప్రాణహరణా శరణు సీతావల్లభా ! శర॥

తరణివంశపయోధిసోమ దనుజకుంజర కేసరీ
కరుణాసాగర ఆదిదేవా కామితాఫలదాయకా !
త్రిజగకంటక దనుజసంహార దేవతాభయవారణా
భుజగకంకణ వినుత సింహాగిరి విజయ శ్రీరఘునాయకా !

వ. అంతట రుక్మిణీ సత్యభామా జాంబవతీ మిత్రవిందా కాళిందీ లక్షణా భద్రలు వీరు యెనమండ్రు పట్టపు దేవులు చెలికత్తెలతో యెవ్వరెవ్వగ పేళ్లు చెప్పుచున్న విధం బెఱుకపరెను.

**End:**

ద్వి. అనుచు ఆలోచించి అజుండును హరుడు అప్పుడు గారాబుహర్షంబుగాను
మదనునివల్లను మట్టుగుననుచు చిత్తజుగాలిచెను శీఘ్రంబుగాను
ఈవార్తలెల్లను నెఱుఁగగాఁజెప్పి పంపిరి మదనుని భాగుగానపుడు
తన బలంబులు వెంటఁ దగులుచురాగ అతివేగమునవచ్చి

(వి-వి.)—

ఆసమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పులు చాలఁగలవు. శైథిల్యము. కడు హెచ్చు. చాలప్రాంత ప్రతి. ఆకులుచాల చినిఁగిపోయినవి. గ్రంథపాతములు చాలఁ గలవు.

ఇది నెం 1903 రున వర్ణితమగు గ్రంథము వంటిదే. రెండింటను గొన్ని గద్యపద్యములు సరిపోవును. అవి రెండింటను వేరు గ్రంథములనుండి కైకొనఁబడి యుండవచ్చును. అసమగ్రము చాల శిథిలము నగుటచే నింతకంటె దీని దెలియదగిన విషయము లేదు.

---

## No. 1905. పారిజాతాపహరణము.

## PĀRIJĀTĀPAHARANAMU.

Substance, palm-leaf. Size, 11¼ × 1½ inches. Pages, 46. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, not bad, but full of mistakes.

Begins on fol. 27 (a) of the Ms. described under No. 1849 ante.

Incomplete.

This is a Yakṣagana based on the poetic work, Pārijātāpaharaṇa of Mukku Timmanna. The name of the author is not known.

సీ. శ్్రీమించు బంగారు చేలగట్టిన మేటి శేషాచలంబుపైఁ జెలఁగుజాణ
సంగతి నలమేలుమంగ నేలెడుసామి యురమునఁబూఁబోఁడి నుంచువేల్పు
కొరుడు బియ్యాలఁ జిత్తముంచినవాఁడు నడుగుమొక్కులచేత నలరు తండ్రి
విరిదామరలఁ బోలు వెడఁదకన్నులవాఁడు జలజ సుదర్శనోజ్జ్వలము రేఁడు.

గీ. వితతసురపతి ముఖ్యసద్విబుధమకుట ! రాజ నవరత్న దీపవిరాజితాంఘ్రి
వేంకటేశుండు సిరులింటవెలయఁ జేసి యించువేడుక-మమ్ము రక్షించుఁగాత !

వ. అని కృతిరచనాపరుండు కృతినాయకుండైన వేంకటనాయకు నేమని కొనియాడుచున్నాఁడు.

త్రిపుట.

మేలువాఁడయి చూడఁగల యలమేలుమంగను నేలుసామిని
వాలుప్రేమను జుట్టుగుడు సావాలువాని ॥

* * * *

జంపె.

మొక్కినంతనె యింద్ర ముఖ్యులౌ దేవతల-నిక్కంపుఁ బూజలను నీకైన శిరమా
మగువ కొంచఁగలేక మిగుల నసడ్డతో - తగవనక వాము పాదంబుతో ద్రోచె

భామిరోఁ గలదెకా పురుషులింతులపట్ల - తాము నేరము సేయఁ దాళుకోఁగలరే
అలుకగలిగిన చెలులకరిదియే యుచితము - మఱియు వ్యాపారంబు మఱచియుండు
[దురే
దానపదహాలిచేత మేనఁబుల కలునిండ - దానవారాతి యంతమునితోఁ
[బలికెఁ.

యకతాళి.

తరుణిరోభవదీయ దాసునినన్నును - సరసిజసమమృదు చరణంబునను
త్రోసిన నాకు సంతోషమెఱ్ఱైనను - ఓసతి నాతనుపునఁగలపులకల్
తాకిన నొచ్చుగదాయని పలికెద - తేకువ కోపము దీరదెమదిని.

యాలపదాలు.

మారుసేసి మారూదేసి - చేరీప్రేమాసి నేరాడాసి
కీరావారమేమి సేతురా ! ఓకంసవైరి - వారమేలు ఎట్లు దాతురా !
నిదురారాదుగతరా వాదు - లెదురాగాదుపదరానాదు
ముదురూ వెన్న విల్లాచేరఁగా, ఓకంసవైరి - ఉదుట వయసు పొయులు
[మీఁటఁగా.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁతయొకమాదిరిగానున్నదిగాని తప్పులు మెండు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు గలవు.

ముక్కు తిమ్మన పారిజాతాపహరణ ప్రబంధ రచనము పద్ధతినే యీ యక్షగానము గలదు. అందలి రచనావిధానము లిందుఁ జూపబడినవి. కర్త పేరెఱుఁగరాదు.

ఇందలి గ్రంథాంతములకు నె 1849 రు చూచునది.

---

## No. 1906. పారిజాతద్విపద.

## PĀRIJĀTADVIPADA.

Substance, palm-leaf. Size, 15¾ × 1⅝ inches. Pages, 2. Lines, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, bad and not free from mistakes.

Begins on fol. 31(*a*). The other works herein are :—Bhāmāvēṣakatha 1 (*a*). Radhavēsakatha 10 (*a*). Hindustani songs 32 (*a*). Murkhapanca-kamu 33(*a*). Bhadrādrirāmacurnika 35 (*a*).

**Incomplete.**

This incomplete work appears to be a portion of a complete Yakṣa gāna bearing on the puranic story of the seizure of the Parijāta tree by Sri Kṛṣṇa from the pleasure garden of Indhra. The other two works beginning on fol. 1 (a) and 10 (a) are also perhaps, portions of the same work.

**Beginning:**

ద్విపద. శ్రీ గోపికాధీశ జితదానవేశ నాగేంద్రశయన యో నాగేంద్రవినుత
నాగారి మర్దన నాగేంద్రగమన బాగొప్ప మ్రొక్కెదఁ బంకజనేత్ర
పరగంగ సురపతి పట్టణంబరయఁ గరమొప్పవీక్షింపఁ గడుఁజిత్రమయ్యె

*　　*　　*　　*

అట్టి నాకంబున కమరవల్లభుఁడు మట్టుగా నాస్థాన మంటపంబునను

*　　*　　*　　*

సలలిత సామ్రాజ్య సకలవైభవము లలరుచుఁ గొలువుకూటంబుననంత
అమరేంద్ర యెఱుఁగవాయాది కాలమునఁ బ్రమదంబుతో నేను బదరీపురందు
భువిని జతుర్యుగంబులను బొల్పొంద నవతారములఁ జెందునంచునే నాది

*　　*　　*　　*

**End:**

ఇలఁగాఁచితిఁ దలంప నిపుడు కృష్ణావతారమై వేడ్కతో ద్వారకయందు
ధీరతతో వసుదేవనందనుఁడనై పుట్టి వ్రేపల్లెయందు నింపొంద
గోపబాలురఁ గూడుకొని ప్రేమతోడ నందునయింట నానందంబు మీఱఁ
బొందుగా నీడేరి పాలుపందనంబు యదుకులోత్తముఁడనై యేలినయట్టి
సుదతులు పెక్కండ్రు సుందరీమణులు ఆమీఁదటనుగల రష్టభామినులు
ఆమాని నీమణులందఱియందుఁ బరగ రుక్మిణి సత్యభామల మిగుల
వరుస మన్ననచేసి వర్తింపుచుండ నరయఁగా నారదుఁడతివేగమునను
నరుదెంచి పారిజాతము భక్తినొసఁగ నారయ రుక్మిణికది యిచ్చియంత
వారిజాక్షికినిచ్చు వంతుకుసత్య భామకిచ్చెదనని పారిజాతంబు
నేమించుకొని వస్తినే నిందువేగ॥

(వి-వి.)—

వ్రాఁత మంచిదిగాదు తప్పులు గలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పారిజాతాపహరణ కథాంశముగల యీ ద్విపదరచనా భాగమేదేని యక్షగానములోనిదిగావచ్చును. ఈ సంపుటమందే 1 (a), 10 (a) పుటలలో ఆరంభములుగల భామావేష కథ, రాధావేష కథ, యను గ్రంథములకిది సంబంధించినదియేని కావచ్చును.

ఇందలి గ్రంథాంతరము లివి :—

1 (a) భామావేశ కథ, 10 (a), రాధావేష కథ, 32 (a), హిందుస్తాని పాటలు, 33 (a), మూర్ఖ పంచకము, 35 (a) భద్రాద్రి రామచూర్ణిక.

---

## No. 1907. పార్థసారథి విజయము.
## PĀRTHASĀRATHI VIJAYAMU.

Substance, paper. Size, $11\frac{3}{4} \times 7\frac{1}{4}$ inches. Pages, 606. Lines, 22 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, very good and fairly free from mistakes.

Complete.

Based on the Bhāgavata of Bammera Pōtana. The story of the tenth Skandha is herein written in the form of Yakṣagāna. The author is Kuppaṇakavi, son of Narasamāmba and Vēnkatēśvaraya, and a disciple of Kastūriranga. He was a devotee of God Narasimha worshipped at Triplicane (Madras). He has dedicated this work to Vēnkaṭacalapati who ruled at Cōlapuram

C.P. Brown states at the end of the work that it was transcribed in the year 1840, A.D.

**Beginning:**

శా. శ్రీలక్ష్మీవదనారవిందము నిజశ్రీదివ్యసౌందర్యని
ర్వేల స్ఫూర్తిని ముద్దుగుల్క జగతీవిఖ్యాత మిత్రాకృతిన్
జాలన్ రంజిలు పార్థసారథి యశస్సౌభాగ్య సద్వైభవ
శ్రీలన్ సానుజు వేంకటాచలవిభున్ జెల్వొందఁగాఁ బ్రోవుతన్ ॥

* * * *

మంగళం॥ . . . . . .

కైరవపుష్కరిణీ। ఘన కేళీలోలునికి మారజనకునికి । మంగళం॥
స్థిరభాస్కరవిమాన । దివ్యమందిరునికి మరువనివానికి । మంగళం॥
శ్రీనృసింహాకృతికి । శ్రీరుక్మిణీపతికి మానితధృతికిని । మంగళం॥
కాయజగురునికి । కంససంహారునికి మాయాపురవరునికి । మంగళం॥

* * * *

ద్విపద. . . . . . .

అందమైనట్టి మహాభాగవతము నందలి తనరు కృష్ణావతారైక
కథితమై ఘనభద్ర కరమైనదివ్య కథలెల్ల దశమమౌ స్కంధంబుగాన
నవి తెనిఁగింప నే నాత్మ నూహించి ప్రవిమలధీయుక్తిఁ బరగుచున్నంత—

* * * *

శ్రీవిలసితగుణ శ్రీధురంధరుఁడు శ్రీ వేంకటాచల క్షితి పాలవర్యుఁ
డనువొండ నొక్క నాఁడనుజానుమంత్రి జనములు మిత్రులు సత్కవీంద్రులును
హిత నిజాశ్రిత పురోహిత బంధువితతు లతిశయంబుగను జెన్నలరఁ గొల్వఁడి
నను నరసింహార్చనాసమున్నతుని ఘన సత్కవిత్వలక్షణ విచక్షణునిఁ
గస్తూరిరంగ సత్కవి శిష్యభూప కస్తుత్యుఁ గుప్పన కవిని రప్పించి
పలికెనిట్లని భవద్భవ్యసాహిత్య కలనాచమత్కృతి గాంచికాంచియును
మతిమతివినఁగ నెమ్మది నాసపడమె నరసి రామాయణ యక్షగానంబు
నచలితంబుగ మదీయాంకితంబుగను రచియించియొసఁగి తారవిత్తారకముగఁ
గావుననీవంటి కవివరాగ్రణిని నీవంటిమిత్రుని నే నెందుఁగానఁ
బరికింప శ్రీమహాభాగవతంబు హరికతి ప్రియమగు నందునన జూడ
నలదశమస్కంధ మతిచిత్రమదియు నలినలోచనుని కృష్ణావతారైక
చిరతర లీలావిశేష సంపదల భరితమై యొందును బ్రతిలేకయుండుఁ
గాన నమ్మహనీయ కథయెల్ల యక్షగాన ప్రబంధంబుగా సంఘటించి
జననుతంబుగఁ బార్థసారథివిజయ మనుపేరఁ దనర మదంకితంబుగను
నొసఁగుమటంచు సమున్నతరత్న లసితభూషణములు లాలితవస్తు
లతులితాంబర చతురంత యానాదు లతిదయ మీఱ నెయ్యముననొసంగి
మన్నన చేయ నమ్మహనీయుఁగాంచి పన్నగా నిట్లనిపల్కితి నెలమి

* * * *

గొనకొన్న యాత్రేయ గోత్రంబునందు జనియించునీదు వంశజుల వైభవము
లభినుతించెద . . . . .

* * * *

వారలలోఁ జాలవన్నియకెక్కి భూరితేజమున దామోదరాధీశుఁ
డాతఁడు చోళపు రావనుండగుచు ఖ్యాతిగామీఱఁ దత్కారణంబునను
బొగడొందగను జోళపురమువారనుచు నెగడిరి ధరలోన నీవారలెల్ల
నట్టి శ్రీదామోదరాధిపమణికిఁ బుట్టె శ్రీహరిదాస భూపాలమౌళి
యామహాత్మునికిఁ గామాక్షిమాంబికకు దామోదరేంద్రుండు తనయుఁడైపొడమె
నతఁడు పార్వతమ్మ నలర వరించెఁ బ్రతిలేకయతనికి రామకృష్ణేంద్రుఁ
డెనలేనిధృతివన్నెకెక్కి శీలమున ననఘుఁడౌ తిరువేంకటాధిపమౌళి
దినపతిద్యుతివాస్తు దేశాఖ్యనృపతి ఘనుఁడు కృష్ణేంద్రుండు కలిగిరెంతయును
వారలలో వైభవంబు చేఁ బ్రబలె వీరుఁడైనట్టి తిర్వేంకటేంద్రుండు

* * * *

అలరునా తిరువేంకటాధీశమణికి నలువొందునట్టి శ్రీనల్లమాంబికకు
నీవుజన్మించితెన్నికమీఱఁగాను నినుసన్నుతింపఁగా నెవ్వరిశక్య

మనువొంద శ్రీలక్ష్మమాంబికామణికి ననఘగోపాల నారాయణచంద్రు
లెనలేని రామానుజేంద్రుడుఁగలిగి రాయనుజులు ముప్పురతిభక్తి సేవ
సేయంగఁ గీర్తి రంజిల్లవర్ధిల్లె దటువంటినీకు నీయనుజన్మలకును
బటుయశోవిజయ లాభంబులుగోరి ఘనభాగవత యక్షగాన ప్రబంధ
మనువుగావించి త్వదంకితంబుగను దనివొందనిచ్చెదఁ దగనాలకించి

* * * *

నరసుతుఁడైననూ నరసింహుకరుణ మెఱయఁగా వర్ధిల్లుమీశాశ్వతముగ॥

వ. అని . . . . . . . .

త్రిపుట . . . . . . . . .

కులశైలాధిక గురుతరధృతికిన్ సలలిత వేంకటాచల నరపతికిన్॥

వ. అభ్యుదయ పరంపరాభి వృద్ధిగా నే రచియింపంబూనిన పార్థసారథి విజయం బను యక్షగాన ప్రబంధంబునకుఁ గథా సంవిధాన మెటువలెనుండును.

**End:**

ద్వి. అనిశుకుఁడీరీతి నభిమన్యుతనయుఁ గనివివరించిన క్రమమెల్ల సూతుఁ
డామునీంద్రులతోడ నంతయుఁబల్క వేమఱువారెల్ల వినిముదంబంది

* * * *

మరిమరియనుభక్తి మదిఁదళుకొత్త హరికథల్వేడ్కగా నాలించుచుండి

**Colophon:**

రని వేంకటేశ దయాన్వితు పేర జననుతాప్రతి మానచర్యుని పేర

* * * *

శ్రీవిలసితదయా సేవధిపేర శ్రీవేంకటాచలక్షితిపమణిపేర
నరసింహ సత్కరుణాధురీణుండు సరసకస్తురిరంగ సత్కవిశిష్యుఁ
డవిరళకవితామహత్త్వ శోభితుఁడు నవనినాలూరి వంశాబ్ధిచంద్రుండు
గురునుతకాస్యపగోత్రపావనుఁడు సురుచిరాపస్తంబ సూత్రసంభవుఁడు
శ్రీవేంకటేశ్వరక్షితి దేవసుతుఁడు పావని నరసమాంబానందనుండు
వరబుధాశీర్వచో వైభవోన్నతుఁడు పరమపుణ్యుండు కుప్పనకవీంద్రుండు
లలితమై సాహితీ లక్షణలక్ష్య కలితమైరచియింపఁగా మహోన్నతిగ
జననుతంబగు పార్థసారథివిజయ మనుభాగవత దివ్యయక్షగానంబు
ధరలోన రవిచంద్ర తారకంబుగను వరుసగా నైనలేక వర్ధిల్లుఁగాత॥

వ. అనుటయు.

* * * *

మాలిని . . . . .

లలితనిజచరిత్రా లక్ష్మమాంబాసుపుత్రా॥

గద్య. ఇది . . . . . . . . . . కుప్పన కవిరాజ ప్రణీతంబైన పార్థసారథి విజయంబను మహాభాగవత యక్షగాన ప్రబంధంబునందుఁ బ్రద్యుమ్న సంభవంబును . . . . . . . అనుకథలఁ బ్రథితంబగు దశమస్కంధంబున నుత్తరభాగము సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతకడుఁ జక్కనిది. తప్పులు నంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములును లేవు.

బమ్మెరపోతన యాంధ్రభాగవత దశమస్కంధ కథానుసారముగా రెండుభాగములుగా నీయక్షగానము గలదు. ఈరచనము మేలయినది. గ్రంథకర్త యాలూరికుప్పన కవి. ఆపస్తంబసూత్రుఁడు కాశ్యపగోత్రుఁడు, నరసమాంబా వేంకటేశ్వరార్యుల పుత్రుఁడు, కస్తూరిరంగకవి శిష్యుడు. మఱియునీకుప్పనకవి తిరువల్లికేణిపురమున వెలసిన నరసింహస్వామి భక్తుఁడు. తానింతకుఁ బూర్వము రచియించిన రామాయణ యక్షగానమును గృతినందిన చోళపురము వేంకటాచల భూవిభునకే యీ కృతినిగూడ నీతఁడంకితము చేసినాఁడు. వెంకటాచల భూపాలునివంశవృత్తాంతము దాహృత పద్యములఁ బట్టిగుర్తింపనగును. 1840 సంవత్సరమున నీప్రతివ్రాయఁబడెనని బ్రౌను దొరగారు తుదిని వ్రాసినారు.

---

## No. 1908. పారసారథి విజయము.

## PĀRTHASĀRATHI VIJAYAMU.

Substance, palm-leaf. Size 17⅜ × 1⅜ inches. Pages, 664. Lines, 6 on a page. Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, good and free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములుఁ జాల హెచ్చు.

పూర్వవర్ణితము. దానికిది మాతృకకూడ నగును.

## No. 1909. పార్వతీ కల్యాణము.

## PĀRVATĪ KALYĀṆAMU

Substance, paper Size, 12 × 7¾ inches. Pages, 147. Lines, 20 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good and fairly free from mistakes.

Begins on fol. 199 (*a*). The other work herein is.—Kalāpūrṇōdayamu 1 (*a*).

Complete.

The story of the marriage of Pārvati as contained in Vāyupurāna, is described in this. Kūrapāṭi Amaralingāmātya is the author. He was the son of Śarabhamāmbā and Pedarāmalingayya ; and a Śaiva Brahmin by caste Virabhadraswami of Vipūru is the author's family God. The work has been dedicated to God Mallikārjunaswāmi (Śiva) worshipped at Śri Śaila.

**Beginning :**

క. శ్రీరజతాచలశృంగవి-హారాబ్జకలాపసింధు రాసురమదసం
హారభుజంగవిభూషణ-తారకరిపుజనకమముఁ గృతార్థులఁజేయుఁ॥

* * * *

వ. శ్రీమద్వీపూరి పట్టణాధ్యక్షుండగు భద్రకాళీ మనోహరుండైన వీరభద్రుని
గొనియాడిన చందంబెటువలెను.

జంపె పంతువరాళి.

భద్రకాళీశుని రుద్రరౌద్రకృపాస-ముద్రు శ్రీమద్వీర భద్రుని నుతింతుఁ ॥

* * * *

వ. మరియుమదీయవంశానుక్రమంబభి వర్ణించెద॥ ద్విపద సావేరి.

* * * *

శ్రీమతుగూడూరి శిద్ధలింగయ్య-స్వామిహస్తాగ్రసంజాత పుత్రుండు
భాసురంబగు కూరపాటివంశాబ్ధి-ఆతనిఁ సుధాసూతియనమరలింగయ్య
ఆతని నిజపత్ని యమరెవీరమ్మ-ప్రీతినిర్వురకును బెంపొందుసుతులు
రామలింగయచిన రామలింగయ్య-వీరయ్య మల్లయ్య వీరభద్రయ్య
వారియేగురకును వంశవర్ధనుఁడు

* * * *

కమనీయమగు పెద రామలింగయ్య-కమలాక్షి నిజరాణికాంతశరభమ్మ
కుమతనిద్దరికేని మక్కువసుతులు-అమరలింగయ్య వీరయ్యయనంగ
తంత్రగజండను నమరలింగయ్య-బొంకుగా రచియింతుఁ బుణ్యచరిత్ర॥

వ అని కృతీశ్వరుండగు శ్రీ శైలమల్లికార్జున స్వామికి షష్ఠ్యంతంబులు జెప్పినట వ్రాయుచుండెను.

అర్ధచంద్రికలు సంతవరాళి.

శ్రీనాథార్చిత శితికంఠునకుఁ - పంచబాణసిత భసితాంగునకుఁ ॥

*     *     *     *

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన వాయుపురాణోక్తంబగు పార్వతీ కళ్యాణం బను యక్షగానంబునకుఁ గథాక్రమం బెట్టువలెను.

**End :**

వ అని గౌరీ వివాహోత్సవ క్రమంబు వాయుదేవుడు తెలియంజెప్పిన వినియమ్మహామునులానందభరితాత్ములైసుఖంబుండిరంత.

ద్విపద.

ఇదియ శ్రీ వీపూరి వీరభద్రేశ-సదయలబ్ధ కవిత్వసారరసజ్ఞ ॥
వరమించు కూడూరి సిద్ధలింగయ్య-గురుమూర్తి శిష్యుండు కోమటొప్పనేత
లింగనిష్ఠాపర వీలమానసుండు-జంగమ లింగప్రసాద సేవకుండు
హరిశ్చ శ్రీకూరపాటివంశాబ్ధి-పరిపూర్ణ చంద్రుండు భవ్యగుణుండు
ఆరుదొందనమరలింగయ్య పౌత్రుండు-వరరామలింగయాహ్వాయ సుపుత్రుండు
లీలశ్రీయుమరేశలింగనామాత్య-మేలుగా రచించె మేదినియందు
రమణీయవాయుపురాణోక్తమయ్యె-క్రమమొప్ప పార్వతీకళ్యాణమంత
గరిమతో యుతయక్షగానంబునందు

*     *     *     *

సరయ సర్వముఁదృతీయాశ్వాసమయ్యె
భాసుర శీతాద్రి జాసతీమానసో-ల్లాసమందస్మిత భాసవిలాసా
శ్రీసకలేశవిభాసితకమలనివాసచిగురుపాటి యాశరామేశా॥

మంగళం మంగళం మహాదేవా మంగళం మంగళం.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతచక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

వాయుపురాణ కథానుసారముగాఁ బార్వతీ వివాహమిందు వర్ణింపఁబడినది. కూరపాటి యమరలింగామాత్యుఁడు దీనికిఁ గర్త. శరభమాంబా పెదరామలింగయ్య లితనితలిదండ్రులు. ఈతడు శైవబ్రాహ్మణుఁడు. వీపూరి వీరభద్రస్వామి యీతని యిలువేల్పు. కూడూరి సిద్ధలింగయ్య యీతని పితామహుని గురువు. ఈ గ్రంథము శ్రీశైల

మల్లికార్జునస్వామి కర్పింపఁబడినది. ఇందు అర్ధచంద్రికలు, రచ్చరేకలు, లఘుత్రుటులగు దేశిరచనాభేదములు గలవుగాని, రచనము సలక్షణముగాదు.

ఇందీ గ్రంథాంతరము గలదు.

1వ కళా పూర్వోదయము.

---

## No. 1910. ప్రభావతీప్రద్యుమ్నము.

## PRABHĀVATĪ PRADYUMNAMU.

Substance, palm-leaf. Size, $16\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches. Pages, 81. Lines, 7 to 9 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair and free from mistakes.

Complete.

This is a Yakṣagāna adaptation of Piṅgaḷa Sūrana's poetic work Prabhāvatīpradyumnamu ; the name of the author is Gōpāluni Singayakavi , the work is dedicated to God Narasimha of Ahobila.

**Beginning :**

శా. శ్రీకాంతాల సదృక్చకోరములకున్ జెల్వంపు నెమ్మోమనే
రాకాశీతమరీచి రోచికతనన్ రంజిల్లఁగాఁ జేయుచున్
లోకాలోకపరీతవిశ్వము కృపాలోకాజ్ఞచే నేలు సు
శ్లోకుండైన యహోబలేశుఁడు రమాలోలుండు నన్బ్రోచుతన్.

*　　*　　*　　*

ద్విపద.

అని యిష్టదైవంబు నభినుతిచేసి - మును వాణి హృత్పీఠమున నిల్పి మ్రొక్కి

. . . . . . . . . . . . . .

కరమొప్ప మున్ను పింగళి సూరన కవి-వరుఁడు చెప్పిన ప్రభావతి ప్రద్యుమ్న (?)
మను ప్రబంధము మోదమావహిల్లఁగను - నను నేలినట్టి శ్రీ నరసింహదేవు
నకు నంకితంబుగా నా నేర్పు ఫణితి - సుకవులెల్లను మెచ్చ సొంపులు హెచ్చ
విను జనంబుల కెల్ల వేడుకమించ - ఘనరీతులను యక్షగానంబుగాను
వరచిత్రశృంగార వర్ణనమీఱ - విరచింతునంతయు విస్ఫుటంబుగను.

**End :**

లలిత॥ జులువ తాళము.

దానవశిక్ష భక్తమానవ పరిరక్ష
భానుతశీల వేణుగాన సంతతలోల
నేను నీకంకితముగ నీయక్షగానము
నేను నేర్చు గానరీతిఁ బూని చెప్పినాను జే కోర॥ప॥

. . . . . . . . . . . . .

మంజరి.

అని యిట్లు . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . .

సిరులిచ్చి మమ్మేలు శ్రీమంగళాద్రి - నిలయుఁడైనూతకి నెలకొన్న వరద
రాజగోపాలుఁడై రమణీయలీల - జనులకెల్ల సకలసంపద లిచ్చు
శ్రీ యోబళాద్రి నృసింహునిపేరఁ - దద్వర భక్తుఁడై ధరలోన వెలయు
నతుల గోపాలాన్వయాంభోధిచంద్రుఁ - డనఘ భాస్కరమంత్రి యాత్మజుఁడైన
వీరనమంత్రికి వెలదియోబమకుఁ - గూరిమితనయుండు గుణరత్నరాశి

. . . . . . . . . . . . . . .

నలువొప్పు సింగయనామధేయుండు - ఘనబుద్ధితో యక్షగానంబు చేసె
నా చక్రవాళశైలావనియందు - నా చంద్రనిత్య తారార్కమై వెలయ.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులు లేవు. గ్రంథారంభమునను ఇంక నక్కడక్కడను, శైథిల్యము కొంచెముకొంచెముగాఁగలదు. కొలఁది గ్రంథపాతములును గలవు.

పింగళి సూరనకవి రచియించిన ప్రభావతీ ప్రద్యుమ్న ప్రబంధమున కిది యక్ష గాన రూప పరివర్తనము. సూరనార్యుని పద్యములెల్లనిందు పలుతెఱఁగుల గేయములు గా మార్చఁబడినవి. యక్షగానములలో నిది మేల్మి గలదియగును గ్రంథకర్త గోపాలుని సింగయ కవి- వీరనమంత్రి ఓబ మకవి తలిదండ్రులు - మంగళాద్రి నూతకి పురముల వెలసిన యహోబల నరసింహదేవునకిది సమర్పితము.

---

## No. 1911. బసవమహిమామృత విలాసము.
## BASAVAMAHIMĀMṚTAVILĀSAMU.

**Substance, palm-leaf. Size, $13\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 109. Lines, 6 on a page. Character, Telugu. Condition, uninjured. Appearance, not old. Mode of writing, good but full of mistakes.**

Complete.

Gives on account of Basavēśvara the chief exponent of Viraśaiva religion. The author is Virabhadrudu of Kānūru who was popularly known as Viyyanna. He was a disciple of Sitārāma Sāstri, a devotee of God Sōmēśvara worshipped at Kolanupāka.

**Beginning :**

ఉ. శ్రీ గురుసోమనాధవర శ్రీచరణాంబుజములదలంచి

. . . . . . . . . . . . . . . .

రాగపరోషభోగు గతరాగును నాదరచెన్నయాహ్వయున్
వేగమె సంస్మరించి కడువేడుకఁ గక్కయగారిఁ గొల్చెదన్.

* * * *

ఉ. మ్రొక్కెద మాచిదేవునకు మ్రొక్కెదఁజేతులు మోళిగయ్యకున్
దక్కెదఁగిన్నరయ్యకును దాసుఁడనయ్యెద దాసుమయ్యకున్
మిక్కిలి భక్తితోడ మిరుమిండయనారును జేరి కొల్చెదన్
మక్కువతోడమల్లరసు మన్ననగాంతు ముదంబెలర్పఁగన్.

త్రిపుట తాళం.

శరణు శరణు శరణు హో
శరణు శ్రీ బసవేశమాంపాహి శరణు శ్రీ వృషభేశ్వరా !
శరణు శ్రీ గురుచరణ వరశరణాగ్రగణ్య పరాత్పరా !
శరణు శరణు శరణు హో !

* * * *

సీ. వీరభద్రారాధ్య వీరమాహేశుని - గురువుగా నమ్మినగురుఁ డనంగ
కొలనుపాకపురీశు నలిసోమనాథుని - గలిమిగా నమ్మిన ఘనుఁడనంగ
భక్తమాహేశ్వర భక్తిసంపన్నుఁడై - భక్తిమార్గముచూపు భక్తుఁడనఁగ
పరమతములఁబట్టి పరిమార్పఁజాలిన - కల్లినాథుని భద్రగజమనంగ
దండనాయకుఁ డుద్దండదండి ప్రమథ - మండనుండైన బసవనమంత్రివరుని
రాజమౌళినిఁ గొల్చు సీతారామ శాస్త్రి - పరగనెమ్మది నెప్పుడుఁ బ్రస్తుతింతు.

వ. ఇవ్విధంబున సీతారామ శాస్త్రులనుగొని యాడిబసవమహిమామృత విలాసం
బను కథ శ్రీసోమేశ్వరస్వామి యనుజ్ఞచేతను రచియింపవలెనని సంతోషంబున గూ
ర్చున్న సమయంబున నమ్మహాత్ముండేతెంచి । నన్నుఁజూచి యానందితుండై యిట్లనిరి.
బసవగీతంబులు పద్యంబులు వచనంబులు నేలలు ననేకవిధంబులఁగూర్చి బసవ
మహిమామృత విలాసంబు శ్రీ సోమేశ్వరస్వామికిఁ గృతియిచ్చి రచియించుటకు మాకు
లింగానంద భరితంబయ్యెఁగావున రచియింపుమని యాజ్ఞాపించిన నా శరణుని మృదు
మధుర వాక్యంబులకు సానందుండనై బసవేశ్వరుని సంస్తుతిగావించితిసది యెట్లనిన,

**End :**

ఇదిబసవాదిమాహేశ్వరదివ్య - పదపద్మ సౌరభ భ్రమరాయమాణ
లింగజంగమపాద లీనమ నస్క - సంగత సుఖసుధా శరధినిమగ్న
కరమొప్పు కానూరి వరవీరభద్ర - వరనామ వియ్యన్న సరసద్భక్తి
సుకవి ప్రణీతమై శోభిల్లి తనరి - యకలంక గుణనిధి యాదిబసవేశ
వరకృపాంచిత కవిత్వస్ఫూర్తిఁబేర్చి - పరమసద్భక్తిచే వరబసవేశు

మహిమామృత విలాసమహిని విలిసిల్లి - సహజజంగమలింగ సత్కృపచేత
చనుపురాతన భక్తఘన మహత్త్వంబు - అనుపమభక్తుల ఆనందమయ్యె.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు. "సర్వజిత్తునామ సంవత్సర మాఘబహుళ 6 బుధవారం వరకు పులిచేరిలో మాజేటి సర్వేశలింగం ప్రతిచూచి వ్రాసికొనెను."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్నని దేశాని తప్పులు చాలఁ గలవు శైథిల్యము గ్రంథపాతములు లేవు.

వీరశైవమత ప్రవర్తకుఁడగు బసవేశ్వరుని చరిత్రమిందు వర్ణితము. గ్రంథకర్త కానూరి వీరభద్రుఁడు. అతనికి వియ్యన్నయని వ్యవహారనామము. ఈతఁడు శ్రీ లనుపాక సోమేశ్వరస్వామి భక్తుఁడగు సీతారామ శాస్త్రుల శిష్యుఁడు. విశేషములకు దాహృత గ్రంథభాగములను జూచునది.

---

## No. 1912. భక్తాంఘ్రిరేణు చరిత్రము.

## BHAKTĀNGHRIRĒṆU CARITRAMU.

Substance, palm-leaf. Size, $15\frac{1}{2} \times 1\frac{1}{4}$ inches. Pages, 55. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good, but not quite free from mistakes.

Complete.

Describes the story of the Āḷwar known as Tondaraḍippodi Āḷwar, Vipranārāyana and Bhaktānghrirēnu. The author Uttararangakavi has dedicated this work to Ranganathāswāmi worshipped at Paścimaranga kṣētra.

**Beginning :**

శ్రీలలిత లీలావిలోల శుభవిశాల దృగ్జాల
పరిపాలిత జగత్కదంబే ! నీలనీలాలకవరా
లంకృతాంచత్కపోల పాళీజితస్ఫుటముకుర
బింబే ! సర్వసుజనసేవ్య పదారవిందే ! సదానం
దే త్రిపురసుందరి సుగుణబృందే ॥ వందే ॥
ప్రణతసురమకుట మణిగణ కిరణరంజితా
రుణసముజ్జ్వల పీఠికా వరోహ
రణిత కంకణ ఝణాఝణరవ ద్విగుణిత
క్వణిత వీణామృదుల వాదనోత్సాహే ॥ వందే ॥
హరవామభాగభాగమితానురాగసం
భరితనిరతస్థితి విభాసమానే

కరుణావిభూషణోత్తర రంగనిలయసో
దరితలో దరిభక్త పరమఫలదానే ॥ వందే ॥

వ. ఇవ్విధంబున విఘ్నేశ్వరుని బ్రస్తుతించి తదనంతరమున నుత్తరరంగరంగ ధామునికి సమర్పితంబుగా నాయొనర్పంబూనిన భక్తాంఘ్రిరేణు విలాసంబను నాటకంబు నకుం బ్రధాన గణ్యంబైన శ్రీరంగనగరం బెట్టిదనిన ;

వ. ఇట్లు చిత్తస్థలంబుగాం జూచి వికటుదాసరిన్ని తానున్ను తోటనేయ నారం భించిరట యెటువలెను.

ముఖారి – ఏకతాళం.

తోటకెల్లతవ్వటాము పెట్టివత్తాము రార
తోడుగాను పారచే బట్టి
అవునవును సామి
మాటవిడు నెత్తిమీద బేటి యెవ్వారిస్తేన
కూయకుంటే యెట్లు కూడు పుట్టు !
ఓరయ్య సభ్య –
గరికివేళ్లు మంటినంటివుంటే యే తీరుపైరుగావరా
లెస్సదియ్యకుంటే| అవునవును సామి !
పెరికె బేరమాడుకుంట వుండెదొవ సుంకము
బెట్టవేట్లబోనిచ్చేరుకంటె, ఓరయ సభ్య.

**End :**

వ. ఇట్లువినతులు సేయంగా సంతోషించి శ్రీరంగనాయకులు విప్రనారాయణుతో నేమనుతున్నారు.—

క. తావకభక్తికి మెచ్చితి – నావాడవు నీవు విప్రనారాయణ నీ
వేవరమడిగిన నొసంగెదం – గావలసిన కోర్కెదెల్పంగానగు ననఘా !

వ. విప్రనారాయణుం డెమనుచున్నాడు.

ద్విపద. శ్రీరంగనాయక చిత్తాంబుజాత – సారంగరక్షిత సారంగరంగ
ధన్యుండనైతి నాదైన్యంబు దొలంగె – నన్య మెుల్లను భవదాశ్రితచరణ
రజము పేరొదవువరం బిమ్ముమమ్ము – భజియించి నిశ్చల భక్తినుండెదను

వ. అనిన విని మందస్మిత సుందరవదనారవిందుడై యిందిరావల్లభుండతనికి తొండరడిప్పొడి యాళ్వారని పేరొసంగి చోడరాజునుజూచి యేమనుచున్నాడు.

చ॥ క్షితివరదీనికింబ సిండి గిన్నియయిచ్చిన వాడనేనె యీ
యతివమదాజ్ఞచేం బోడమునచ్చర, వందనమాలికాంశజుం
డితండును నేను వేడ్కకయి యిర్వురిం యూర్చితి నన్ను జూచిన
ట్లతులితభక్తింజూచి యనయంబు భజింపుము నాదుభక్తునిక్.

వ. అని శ్రీరంగనాయకుండ దృశ్యుండయ్యె

ద్విపద. అని శుభాకృతికి లోకాంచిత స్థితికి - దనచక్రధృతికి నుత్తరరంగపతికి
నర్పితంబుగఁ దదీయప్రసాద ప - సవ సమర్పిత గీతసాహిత్యహృద్య
తరతాళశాలి యుత్తర రంగసుకవి - ధరణి వైనాచంద్ర తారార్కముగను
పరిఢవిల్ల నొనర్చి భక్తాంఘ్రిరేణు - చరితనాటక విధి చదివి వ్రాసినను
శ్రీ సతీరమణుండు సిరులిచ్చుగాక.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులంతగాలేవు. శైథిల్యముగలదు. గ్రంథ పాతములు గలవు.

తొండరడిప్పొడియాళ్వారని, భక్తాంఘ్రిరేణువని, విప్రనారాయణుడని పేర్లందిన యాళ్వారి చరిత్రమిందు వర్ణితము. పశ్చిమ రంగమున వెలసిన రంగనాథస్వామి కర్పితముగా నుత్తరరంగకవిదీనిని రచించెను.

---

## No. 1913. భద్రకాళీ కల్యాణము

## BHADRAKĀLI KALYĀNAMU.

Substance, palm-leaf. Size, 16¼ × 1⅜ inches. Pages, 42. Lines, 5 on a page. Character, Telugu. Condition, uninjured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Describes the story of the marriage of Bhadrakāli and Virēsvara at Murumuḷḷa. The author is Peddayāmātya of Veluvali.

**Beginning :**

శ్రీశు బాణంబుగాఁ జేసిచేకొనిన గౌ
రీశు మురుముల్ల వీరేశుఁ దలఁతుఁ.
అంతంతకు సుజాలసంతోషమువహించి
దంతిముఖుఁడగు నేకదంతు మదిఁ దలఁతుఁ.
సరవి బ్రహ్మేంద్రాది సురలు సన్నుతినేయ
వరము లొసగిన మంచుగిరి కూఁతుఁదలఁతుఁ.

* * * *

జంపె.

పొడలుచక్కనిమేలు పుట్టంబు ధరియించి
తొడరు మదనవిభూతి యొడలెల్లనించి

కడిమి మెఱయను బన్నగము శిరంబున జుట్టి
చిడిపిపాములనెల్లఁ జేకట్టుకట్టి
వెడఁదపాములఁ బెనువివేసి జందెములుగను
కడఁగి సర్వేశ్వరుఁడు కంధరంబునను
మిన్నేఱుమకుటమున వన్నెమీఱఁగఁ గప్పి
యున్నతంబుగఁ జంద్రు నుంచె మకుటమున
చెలువుమీఱఁగనిట్లు సింగారము వహించె
మలహరుఁడు బ్రహ్మాండముల వారుమెచ్చ.

**End :**

తనరంగ నరులు కీర్తనలిట్లు సేయ - ఘనుఁడు శంభుఁడు భద్రకాళియుఁదాను
సమితహూకట్నంబు లగ్గిరిచేతఁ - గొమరొప్పఁగా నందుకొని సంభ్రమమునఁ
గైలాసమునకేఁగి కడు సుఖంబున్న - వేళభక్తులు చాల విన్నవించఁగను
మురుముళ్ల యనుపురం బునకు వేంచేసి - యిరవుగా భద్రకాళీశ్వరితోను
సల్లాపములఁ బ్రొద్దు జరుపుచు జనులు - యుల్లంబు చల్లఁగా నొదువఁ బ్రోవుచును
ఋషవాహనుఁడుండె.

* * * *

కళ్యాణియా భద్ర కాళికా దేవి - కళ్యాణమిర వొప్పఁగా విరచించె
బెంపొంద వెలువలి పెద్దయామాత్యుఁ - డింపుగా నీకథ యెవ్వరైనగాని
వివినవ్రాసిన జదివిననిచ్చువారి - కెనయంగ వీరేశుఁడీప్సి తార్థములు.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

ఈ గౌరీకళ్యాణం వెల్లూ నాగన్నగారి ప్రతిక్రమానను పైండిముక్కుల పుల్లయ్య మాదేటి సర్వేశలింగంకు సంపూర్ణంగా వ్రాసియిచ్చెను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. తాళిమూఁడాకులలో శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు.

మురుముళ్ల పురమున వెలసిన భద్రకాళీ వీరేశ్వరదేవుల కళ్యాణకథయిది. గ్రంథకర్త వెలువలి పెద్దయామాత్యుఁడు.

---

## No. 1914. భల్లాణ చరిత్ర.

## BHALLĀṆA CARITRA.

Substance, palm-leaf. Size, 11 × 1¾ inches. Pages, 76 Lines. 6 on a page. Character, Telugu. Condition, injured and worm eaten. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

The story herein is the same as that described under No. 1915 ante. The author Jakkanna Sambayya has dedicated the work to God Guhēśvara

**Beginning :**

క. శ్రీగురుదేవు గుహేశ్వర వాగీశ్వర కమలనేత్ర వాసవవరదున్
భోగివిభూషణుఁ గొలిచెద ధీగరిమ వచింతు దేవ దేవునిఁ బ్రీతిన్.

శా. ఓ గౌరీపతి యో పురాంతక శివా యో భర్గ యోశాశ్వతా
యో గంగాధర యో లలాటనయనా యోచంద్ర చూడామణీ
యో గోరాడ్ధ్వజ యో సురేంద్రవినుతా యోసర్వ భూతాధిపా
వేగ న్నామది నోలలాడవె దయ న్వీక్షించవే వేఁడెదన్ .

త్రిభంగులు.

గిరికావాహన మెక్కి గిరికన్య బ్రోల, ముద్దు - పరుగులిడు గణాధిపతికీ జే జే !
గుజ్జురూపముతోడ గజ్జెలందెలు మ్రోయ - బొజ్జదిప్పుచు నాడు రజ్జకు జే జే
మింటఁ జంద్రుని జాఘంటగాఁ జేసిన - యొంటికొమ్ముగణాధిపతికి జే జే !

* * * *

రామ ఖిల్లి.

మిండాజంగమ లింగమూర్తీ ! యిది - మేరగాదువిను మీకుప కీర్తి !
ధనధాన్యములనిత్తు నయ్యా, నీకు - ఘనవాహనాభరణ గంధ ప్రసూనా
కనకాంబరములిత్తు నయ్యా అయ్యా - దినదినమును పళ్లు దెప్పింతునయ్యా॥మిం॥
మళ్లూ మాన్యాలిత్తునయ్యా, పెళ్లి - పెళ్లికి నిచ్చింతు పిన్నటంకంబు
ఇళ్లు గట్టించెదనయ్యా, మారి - కళ్లకింపుగ మేడ గట్టింతునయ్యా ॥మిం॥
మంచి మఠాలు గట్టింతు, నీకు - మంగళ ద్రవ్య సామగ్రి దెప్పింతు.

* * * *

జో జో చిదానంద జో చిన్మయాంగా
జో జో భవాధీశ జో సుప్రకాశా ॥జో జో॥
జో జో గణాధ్యక్ష జో గరళభక్షా
జో జో పరంధామ జో దివ్యనామా ॥జో జో॥
సరవితో నిప్పునను జదలంటునట్లు - కరమొప్పు ఘనషడ్వికారములు లేకా
పరమపురుషుఁడవైన ప్రభులింగ మూర్తీ - చిరచిన్మద చిత్కళా పూర్తీ !

**End :**

ద్విపద॥ శ్రీకరంబైనట్టి శ్రీవీరశైవ - ప్రాకట మతధర్మ పారీణమతుఁడ
ధరగుహేశ్వరలింగ వరకృపాలబ్ధ - జగపూర్ణ శివకవిత్వ ప్రభాన్వితుఁడ
శ్రీగురుబోధ విశేషశోభితుఁడ - నాగమనిగమోక్తి నభిరమ్యమైన

యనయంబురోఁగ విద్యాభ్యాసరతుఁడ ఘననీతి నీతివాక్యస్ఫూర్తియుతుఁడఁ
ఘనసచ్చిదానంద కలితాత్మరతుఁడఁ - బసిగొని శివనామ పఠనాభిరతుఁడ
వలనొప్పి బుక్క్యమ వంశ వర్ధనుఁడ - నలువొంద సాంబయ్య నామధేయుండ
భయభక్తితో నిట్లు భల్లాణ చరిత - నయమొప్ప యక్ష గానంబు చేసితిని
జటపన్నగాభరణ చంద్రకిరీటు - అక్షయుడగు నీకు అర్పితంబుగను

* * * *

ప్రమథులు శివుఁడును పార్వతీసతియు - క్రమమొప్పఁ గలయంత కాలమీకృతియు
మహితచిదానంద మహిమచేఁదనరి - స్థిరముగా ధరను వర్ధిల్లును గాత॥

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

"అంగిరసనామ సంవత్సర మార్గశిర శు 10 ఆదివారం వరకు ప్రతినున్నాక్రమాణ భల్లాణ చారిత్ర యక్షగానం మాజేటి సర్వేశలింగం వ్రాసుకొనెను."

(వి-వి.)—

సంగ్రహము వ్రాత తిన్ననిదేకాని నిర్దుష్టముకాదు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది నె 1915 దున వర్ణితమగుదానిఁ బోలినదే. కథ యందలిదే కాని రచనము వేఱు, గ్రంథకర్త బుక్క్యమ సాంబయ్య. అతఁ డీకృతిని గుహేశ్వరస్వామి కర్పించినాఁడు. ఇది మంచిరచనారీతిగల యక్షగానము

---

## No. 1915. భల్లాణ నాటకము.

## BHALLĀNA NATAKAMU.

Substance, palm leaf. Size, 16⅝ × 1¼ inches. Pages, 75 Lines 5 and 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearcnce old. Mode of writing, not bad and not free from mistakes.

Complete.

The story of Bhallāna a great devotee of Siva is described in this Alapaka Peddi, who was a disciple of Sivanjanaswami, a Saiva by religion and a potter by caste is the author. The work has been dedicated to God Bilvesvara. Kokilamba is the favourite goddess of the author.

**Beginning**:

క. శ్రీగురుకృప వెలయఁగ వే - దాగమయుతమైన శివకథామధురోక్తుల్
గాఁగ రచింపఁగ బూనెద - రాగరసంబుగ భల్లాణ రాయని చరితన్.

* * * *

ద్విపద॥ శ్రీపార్వతీశు దర్శించి సేవించి - నాపాలి శ్రీగణనాథుఁబూజించి
శరజన్ముఁ బ్రార్థించి సద్భక్తిగాంచి - వరదుఁడౌ మాధవు వర్ణించి మించి

హారతినర్పించి పరగఁ గీర్తించి - యారూఢి సత్కవులను నుతియించి
కులదేవతయిన యా కోకిలాంబకును - వలనొప్ప మ్రొక్కియా వరముగైకొని
బరవసంబుగఁబూని భావంబులోనఁ - బరగంగనాబిల్వ పతికంకితముగ [యా
సరసమౌ భల్లాణచరిత నాటకము - వెలయింతుఁ దత్కథా విధమెట్టిదనిన.

**End:**

ద్విపద॥ భల్లాణమెచ్చితి భళిరనీవనెను - నిల్లాలినిటులిచ్చు టెవ్వరీభువిని
అనిమదిఁ గొదవగా ననుమానపడకు - మనఘాత్మ మాతల్లి యాచల్లమయును
నీకును గులసతినేను మీసుతుఁడ - మీకునే నిఁకమోక్ష మిచ్చుటే లెస్స
ఆయిన మీభక్తినే నరసితి నిపుడు - జయముగైకొంటివీ జగతిలో నీవు
ఆలోకమునఁ బ్రమథాదులలోను - మేలునీవనిపట్టి మెచ్చితి నిదిగో
సతులిద్దరును నీవు సరివిమానముల - చతురత నెక్కించి చేరిరమ్మనుచు
బసవ వాహనమెక్కి పార్వతీశ్వరుఁడు - అసమానుఁడై రజతాద్రిఁగొల్వుండ
హరియు బ్రహ్మయు నింద్రుఁడందు సేవింప - గరుడ కిన్నర యక్షఖచరులుగొలువ
సుర లాలవట్టము లిన్నుఖులైపట్టఁ - బరగ భల్లాణుఁడు ప్రమథుఁడైయొప్పె.

**Colophon:**

అని సూతముని మౌనులకు బల్కె ననుచు - విని కోకిలాంబికా విభుశంభు పేర
గనకబిల్వార్చిత కామేశు పేర - ననుఁ బ్రోచు నావైద్య నాథుని పేర
బరగు నలంకార భావమీ చరిత - వెలువొప్ప వ్రాసిన వినినఁ జదివిన
నీశుఁడిచ్చును జాల నిప్సితార్థములు - వారిఁ బుత్రులు పౌత్ర వరులు సంపదలు
పొందుదు రనితన బుద్ధిఁజింతించి - ముందుగా సద్గురుమూర్తియైనట్టి
సంతోష శివజ్ఞాన స్వామిని మదిని - సంతతముఁ దలంచు సద్భక్తిపరుఁడు
అంగలింగాంగ శివాచార ధరుఁడు - జంగమ తీర్థ ప్రసాద సేవకుఁడు
శాలివాహన వంశ చరితుఁడీ భువిని - ఆలపాకను నూర నమరిన పెద్ద
పెద్దన లింగమాంబికసుతుం డయిన - వైద్దెప్ప పాపాంబ వరపుత్రు పెద్ద
లలితమై తనరు భల్లాణుని చరిత - వెలయ నాటకముగా వినిపించిదీని
సుకవు లెల్లనువిని సొంపొంది ధరను - బ్రకటింపు డాచంద్ర పరిపాలనముగ.

మంగళ హారతి.

మంగళం జగదేక మాతకును మంగళం - మంగళం బిల్వవన మందిరకును
మంగళం బాలేందు మౌళికిని మంగళం - మంగళం కామేశు నంగనకును
జయ మంగళం నిత్య శుభ మంగళం.

గ్రంథాంతమందీ వ్రాఁత గలదు:—

"విరోధినామ సంవత్సర ఆశ్వీజ శు 10 ఆదివారం ఈ భల్లాణ నాటకం పుదుచేరిలో మాజెటి సర్వేశలింగం వ్రాసుకొనును"

Descri.—141

“ ధాతువునామ సం॥ కార్తీక నెల 21 తేది బుధవారం పర్వకాలం గ్రహణం పుణ్యకాలం ఘుదయమయిన పన్నెండు ఘడియలనరమీఁద పుదుచేరిలో ప్రాంసుకోటి చేసినది. ”

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పులు గలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

భల్లాణుఁడను శివభక్తునికథ యిందు వర్ణితము. భల్లాణ చరిత్రము ద్విపద కావ్యము నె 1165 రున వర్ణితమైనది. సంతోష శివజ్ఞానస్వామి శిష్యుఁడును, వీరశైవుఁడును, కుమ్మరి కులమువాఁడును నగు ఆలపాక పెద్ది యేతద్గ్రంథకర్త. ఈ గ్రంథము విశ్వేశ్వర దేవునకు సమర్పితమైనది. కోకిలాంబ గ్రంథకర్త కిష్టదేవత. విశేషముల కుదాహృత గ్రంథ భాగమును జూచునది.

---

## No. 1916. భామావేశ కథ.

## BHĀMĀVĒŞA KATHA.

Substance, palm-leaf. Size, 17½ × 8⅜ inches. Pages, 360. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Complete.

Similar to the work described under No. 1899 ante. The name of the author is not found in this.

**Beginning:**

ఉ॥ అంజలిఁ జేసి మ్రొక్కెద మదంబకు దివ్యసరోజ మాలికా
పుంజ సుగంధగంధకచ పుష్పరస భ్రమరీ కదంబకున్
రంజిత కంఠహార నవరత్న విడంబిత వజ్రకింకిణీ
మంజుల మేఖలావలయ మధ్యజ్జనితంబకు శారదాంబకున్ ॥

దరువు॥ వెలయ కన్నులచీకటి బాయుచున్నాఁడు వెన్నెలారో
ఆ ! అజుడు నన్ను కారుణించుచున్నాడో వెన్నెలారో ॥

శా॥ రావే మాధవి రావే కుందరదనా రావె సరోజాన నా
జీవా తక్కకు మాయలాడి వినవే యోయక్క ప్రాణేశ్వరుం
డీవేళ చెలిగూడెనో యువతి కోర్కెల్దీరెనో తెలియదా
నీ వెంటైనను వానిఁజూపవు గదా నీరే(జ) పత్రేక్షణా ॥

క॥ వినవమ్మ యేను జెప్పెద ఘనముగ శ్రీకృష్ణమాయ కాంతుని కొరకై
పనిబూని వెతుక వచ్చితి అనుపందగ సత్యభామ యందురు నన్నున్ ॥

**End :**

సీ॥ తొడలపై నిన్నెలుంబడిసేయు రుక్మిణీ-రమణికి మ్రొక్కరా కమలనాభ
దక్కిఁ చెక్కుల............మిత్ర-విందకు మ్రొక్కరా సుందరాంగ
బిగువు కౌఁగిటిలోన సొగసు గుల్కెడు నీసు-దంతకు మ్రొక్కరా సుందరాంగ
అత్తరై చను మొనలొత్తి ముద్దాడునీ-రాధకు మ్రొక్కరా మా...
నిరతమరుదుగ మరయుచు మరుని కేళీ-గనుఁగొని రమించు చందన గంధులెవరో
వారి కొనరించవయ్య నీ వందనములు-పూని యెడఁబాయకుండురుగాని కృష్ణ॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాత
ములు గలవు.

ఇది నెం 1899 రున వర్ణితమయిన గ్రంథమును బోలినది. కర్త పేరిందుఁగాన
రాదు. ఇందుఁ గొన్ని సంస్కృత శ్లోకములకుఁ దెలుఁగుటీక కూడఁగలదు.

---

## No. 1917. భామావేష కథ.

## BHĀMĀVĒṢA KATHA.

**Substance, palm-leaf. Size, 17¼ × 1⅜ inches. Pages, 51. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, bad and full of mistakes.**

Incomplete.

Same work as that described under No. 1916 ante. with some variations in reading.

(వి.వి.)—

అసమగ్రము. వ్రాఁతమంచిది గాదు. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాత
ములు లేవు. 19 నుండి 24 దాక గల యాకులు వ్రాఁత లేకయున్నవి.

ఇది నెం 1916 రున వర్ణితమయినదే కాని పాఠభేదము లెడనెడఁ గలవు.

---

## No. 1918. భామావేష కథ.

## BHĀMĀVĒṢA KATHA.

**Substance, paper. Size, 7¾ × 6½ inches. Pages, 23. Lines, 13 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair, containg full of mistakes.**

Begins on fol. 132 b.

The other works herein are Bhāskaraśatakamu (with com) 1b, Candravadanā śatakamu 254 b, Sampegamanna śatakamu 267 a, Dāśarathi śatakamu 279 a.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్నది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమునోలె.

ఇందలి గ్రంథాంతరములివి : 1 b భాస్కర శతకము (సవ్యాఖ్యము), 254 బి చంద్రవదనా శతకము, 267 ఎ సంపెగమన్న శతకము, 279 ఎ దాశరథి శతకము.

---

## No. 1919. భామావేష కథ.

## BHĀMĀVĒṢA KATHA.

Substance, palm-leaf. Size, 15¾ × 1¾ inches. Pages, 17. Lines, 6 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, fair, but full of mistakes.

Begins on fol. 1 a. The other works herein are : Rādhāvēṣa katha 10 a. Pārijātadvipada 31 a. Hindustani songs 32 a. Mūrkha Pancakamu 33 a.

Incomplete.

Similar to the works described under Nos. 1916, 1899 ante.

**Beginning :**

మ॥ ధరసింహాసనమై నభంబుగొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయములెల్ల వందిగణమై బ్రహ్మాండ మాగారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై
వరుస న్నీ ఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా ॥

. . . . . . . . . . . . . .

ఉ॥ శ్రీకరలీలచే నతి విచిత్రముగా మెలుపొందునట్టుగా
చేకొని నందగోపపురి శ్రీరఘురామ కటాక్ష వీక్షచే
జోకగ గీతవాద్యముల సొంపుగ నింపుగ వంచ జక్కినిన్
బ్రాకటమైన నాట్యరస భావముల న్వినిపింతు వేడుకన్ ॥

గుమ్మ కాంబోది॥ త్రిపుట॥

అంబావో। భ్రమారా॥ ప॥
అంభావో। భ్రమారా। నీ పా
దాంబుజాజములు గొలిచె

తఖిల లోకమూలా వా॥ రంబావో భ్రమారా॥
అంబుజా సనూరాణి
హరి రాణి గొలువాంగ అంబావో భ్రమారా ॥
నిన్ను । తుంబురూ నారదా
దులు హెచ్చి పాడెరో ॥ యంబావో భ్రమారా ॥

**End:**

ద్విపద॥

. . . . . . . . . . . .

హితవతులైనట్టి యింతులలోన
సతినీకు మిక్కిలి జాణలే దొకతె
కనకాంగి యిది యిచ్చ కముగాదు వేగ
వనజాక్షుఁడోడుక వచ్చిన యపుడె
మదిలోన నీమేలు మరువనోయమ్మ
మదినొండు దలఁచక మరిపోయిరమ్మ ॥

వ॥ అనుచు నెచ్చెలివీడు కొల్పియంత నచ్చటి చెలులతో భామ యిట్లనియె ॥

క॥ ఎఱుకతనైనను బిలుచుక సరగున రారమ్మ సరసిజాక్షుం డిపు డే
తరళాక్షి యింటఁజేరెనొ యరయఁగ విభుజాడ శకునమడుగఁగ వలయున్ ॥

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు గలవు. శైథిల్యము గలదు. గ్రంథ పాతములు లేవు.

ఇది నె 1916, 1899 రుల వర్ణితమైన గ్రంథములవంటిదే కాని రచనము లేదు.

ఇందలి గ్రంథాంతరము వేఱు :—

10 ఎ రాధావేడకథ, 31 ఎ పారిజాత ద్విపద, 32 ఎ హిందుస్తాని పాటలు, 33 ఎ మూర్ఖ పంచకము.

---

## No. 1920. భారతము.

## BHĀRATAMU.

Substance, palm-leaf. Size, 13⅜ × 1⅝ inches. Pages, 128. Lines, 5 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, bad and not quite free from mistakes.

Incomplete.

Although this work, containing dvipadas, songs and prose passages, is included among yakṣagānās, it is not suitable for staging. The entire work should have contained the story of Bhārata Virātaparva, complete, but the portion under notice contains only up to the return of Bṛhannala with Uttara from the battle field. The name of the author is not known.

**Beginning :**

ద్విపద॥

. . . . . . పాలసుతులు
వనమున ద్వాదశవర్షము ల్లెలఁగి
ముగిసినంతన నదిమూఁడవ యేఁడు
జగతి . . . . . .
. . . లందియా శమన నందనుఁడు
. . . తో గాండీవిఁ గనుఁగొని పలుకె
. . దివించు . . . . . . .
వదలక యొక యేఁడు వర్తించు టరిది
రూఢిఁగింపు దీనికి నేది కార్యంబు
ఎఱుఁగఁ దీఱదు నాకుఁ బృ . . . .
. . . . . భుఁజూచి యాసవ్యసాచి
తనశక్తి దీపింపఁగా విన్నవించె
నాకుఁ జూడఁగ మత్స్యనగరంబు మేలు
. . . . . . . . లకును
వినయ భూషణుఁ డందు విరటుఁడున్నాఁడు
మనుజాల తారతమ్యము లాతఁ డెఱుఁగు
. . . . . . లోఁ గొంక
గుణవంతుఁడగు వానిఁ గొలిచి యుండుదము
ఉండుఁబోయే రూపముచితంబు మనకు
. . . . . . . డి మారు
వెలయ నా రూపులు వి . . . . . . డుఁ
బలుమాఱు మనకైన భ్రమ పుట్టువలయు
. . . . . . . సుతుఁడు
మనసులోపల శోకమగ్నుఁడై యుండె
నక్కటా ధరణి నీయంత రాజునకు
మిక్కిలి యాప . . . . . . .
. . . బుదినవాలు గజవిధిగాని ?

కృపయు నీతియు వేఱె కీర్తింప నేల
మన్నించ నేర్తులు మంచివాఁ . . .
. . . . . . బుమిను ?

* * * *

వ॥ అని యివ్విధంబునఁ గీచకు నిర్జించి సైరంధ్రికారూపంబు తెచ్చి చూపిన నేమను చున్నది.

ఝంపె॥ చెప్పుదువు పలుమారు చెక్కగద్దలనిమాట
అప్పుడాడినమాట యిప్పుడెటు పోయెఁ
తెలియఁ జెప్పిన వినక చలపోరితివి నీవు
తులువ తలకెక్కి నీవలపింత చేసెఁ
నిదురకంటికి రాక నేఁడెంత బడలితివో
నిదురఁబో యిఁకనైన నిశ్చలంబుగను,

వ॥ అని హాస్యంబుచేసి భీమునితో నేమను చున్నది.

సింహమేనుఁగు నెక్కి చీల్చు చందమున నీ
సింహబలు నొంచితివి చిటుకుమన కుండఁ
ఆ వేళ నాకోప మార్చితివి యొంటిమై
నీ వేళ నీ నీచు నేవు మారిపితివి
నీకె తగునా యోర్పు నీకె తగు నీ నేర్పు
గాక యితరుల కేల గలచె యీ మహిమ ॥

వ॥ అని యివ్విధంబున ద్రుపదసుతయు ననిలతనయుండును నాటకసాల వెడలి రయ్యవసరంబున.

* * * *

**End :**

అంత నాయుత్తరుఁ డారథం బెక్కి
సంతసంబునఁ దన సారధితోను
పట్టణ . . . బు బాగుగాఁ జొచ్చి
నెట్టన వీధిలో నేతెంచునపుడు
మంగళారతులును మహావాద్యతతులు
రంగుగా రమణీయమైన . . . ముల
నరుదెంచి నృపుని శిఖాపంగమరని (?)
సారిదిఁ దమ్ములలోనఁ గూర్చుండెనట (?)

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁతమంచిదిగాదు. కన్నడపోడి గలదు. తప్పులు చాలఁ గలవు. శైథిల్యము, గ్రంథపాతములు చాల హెచ్చు.

తఱచుగా ద్విపదలు గల్గి దరువులు మొదలగు గేయమును, వచనమును గలసి యున్న యీ రచనము యక్షగాన మనఁదగినదే కాని ప్రదర్శనార్హముగా నున్నట్లు దోఁపదు. ఇందు విరాటపర్వ కథ యెల్లఁగూర్పఁబడియుండవచ్చును గాని యిక్కడ బృహన్నల యుత్తరునితో యుద్ధరంగమునుండి మరలి వచ్చుటదాకఁ గలదు. గ్రంథ కర్త పేరిందుఁ గానరాదు.

---

## No. 1921. మృత్యుంజయవిలాసము.
## MṚTYUNJAYAVILĀSAMU.

Substance, paper. Size, $12\frac{1}{2} \times 7\frac{1}{4}$ inches. Pages, 163. Lines 19 on a page Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Begins on fol. 132*a*. The other works herein are; Virasaivadikṣābodhamu 1 *a*. Mitravindaparinayamu 17*a*. Kāmēṣvaricaritra 336 *a*.

Complete.

The story of the birth of Kumāra, War God, and the events leading to it, viz., the attempt of Manmatha, God of Love, to disturb the Penance of Śiva, the destruction of Manmatha by Siva, the penance of Pārvati and her marriage with Śiva form the theme of the work. Gōgulapāti Kūrmanāthakavi is the author. He was the son of Buccanāmātya and disciple of Sri Tirumala Peddinti Sampatkumārācārya.

**Beginning :**

శ్లో. శ్రీకాంతానం దదాయ - చిదానంద స్వరూపిణే
వందితామర బృందాయ - ముకుందాయ నమో నమః.

ద్విపద॥ శ్రీరమణీలోల శ్రితజనపాల - కారుణ్య మయ శీలకాంచనచేల
వైకుంఠవామనవారి జనాభ - నీ కంకితముగ నేనేర్చిన రీతి
మృత్యుంజయవిలాస మృదుతర కావ్య - మత్యంత భక్తితో యక్షగానంబు
రచియించి నీకు నర్పణసేయఁబూని - ప్రచురమౌతత్కథా క్రయమెట్టిదనిన.

**End:**

ద్విపద॥ బాలేందుధారియుఁ బార్వతిఁగూడి - చాలమోదంబున సౌఖ్యంబు నొందె
నొనర సంతటఁ గుమారోదయంబయ్యె - ఘనతార కాఖ్య రాక్షసవధమయ్యె
సకల లోకంబులు సంతోషమంది - ప్రకటన కళ్యాణపారంపర్యముగను
విజయనగరిని శ్రీ వేంకటేశ్వరుల - బుజగతిఁగూడి సమృద్ధ భాగ్యముల

మృత్యుంజయుండన మెఱసి భక్తాళి - కత్యంతబలధాతయై చెలువొందె
శ్రీరమాపతిపేర శ్రీహరిపేర - నారాయణునిపేర నాస్వామిపేర.
నత్యంత భక్తితో నంకింతంబైన - మృత్యుంజయ విలాస మృదుల నాటకము
హరికంకితంబౌట హరకథయౌట - హరిహరదాస హృద్యంబగుచుండు
సరసతనిక్కథ చదివిన విన్న - నరులకు నిహపరానందంబు దొరకు
వరపుత్త్రపౌత్త్రాదివైభవంబలరు ధరణి నాచంద్రార్కతారకంబుగను.

**Colophon :**

ఇది శ్రీమన్నారాయణ చరణదాస్య పవిత్ర గోగులపాటి బుచ్చనామాత్య పుత్త్ర శ్రీ తిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్య దేశికానుగ్రహసనాథ శ్రీ కూర్మనాథ ప్రణీతంబైన మృత్యుంజయ విలాసంబను శృంగార నాటకగేయ ప్రబంధంబునందుఁ ద్వితీయోల్లాసము

ఒకటవ, రెండవ యుల్లాసముల తుద నీక్రింది పద్యము గలదు :—

తే. పరమభక్తిని గోగులపాటి కూర్మ - మంత్రి మృత్యుంజయ విలాస మధురకావ్య
మొనరరచియింప సన్నిధినుండి వ్రాసె - ధరణి నాదుర్తి హరిహరదాసఘనుఁడు.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము. గ్రంథపాతములు కొలఁదిగాఁ గలవు.

మన్మథుఁడు శివతపో భంగము సేయఁజని శివఫాలాగ్నిచే నీఱగుటయు, పార్వతి తపస్సు, పార్వతీ పరిణయము, శివునికిఁ గుమారుఁడు జనించిరక్కసుల ద్రుంచి దేవతలకు విజయము కూర్చుటయుందలి యితివృత్తము. ఇదియక్షగాన ప్రబంధములలోఁ జేరి న్నికగన్నది. శ్రీ తిరుమల పెద్దింటి సంపత్కుమారాచార్య శిష్యుఁడు బుచ్చనామాత్య పుత్త్రుఁడునగు గోగులపాటి కూర్మనాథకవి యేతద్గ్రంథ కర్త.

ఇందలి గ్రంథాంతరము లివి.—

1a వీరశైవ దీక్షాబోధము, 17a మిత్రవిందా పరిణయము, 336a కామేశ్వరీ చరిత్ర.

---

## No. 1922. మృత్యుంజయవిలాసము.

## MṚTYUNJAYAVILASAMU.

Substance, palm-leaf. Size, 16 × 1 inches. Pages, 166. Lines, 5 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువారిది. ఆ ప్రతికిది మాతృక.

---

## No. 1923. మృత్యుంజయవిలాసము.

## MṚTYUNJAYAVILASĀMU.

Substance, palm-leaf. Size, 16¼ × 1⅜ inches Pages, 23, Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair, but full of mistakes.

(వి-వి).—

అసమగ్రము. ప్రథమోల్లాసము మాత్రమే కలదు. వ్రాఁత తిన్ననిది. తప్పులు చాలా కలవు. శైథిల్యము కలదు.

పూర్వమువారిది.

---

## No. 1924 మృత్యుంజయవిలాసము.

## MṚTYUNJAYAVILĀSAMU.

Substance, paper, Size, 10 × 7½ inches. Pages, 68. Lines, 28 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Same work as the above.

(వి.వి.)—

అసమగ్రము. తుది పట్టు కొంత లోపించినది. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథ పాతములు చాలఁగలవు.

పూర్వము వారిది.

---

## No. 1925. మృత్యుంజయవిలాసము.

## MṚTYUNJAYAVILĀSAMU.

Substance, paper. Size, 9⅞ × 6½ inches. Pages, 152. Lines, 19 on a page. Character, Telugu. Condition, slightly injured and worm-eaten. Appearance, very old. Mode of writing, fair but not quite free from mistakes.

Begins on fol. 196 *a*. The other works herein are: Hariscandropākhyānamu 1 *a*. Sugrīvavijayamu 276.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు చాల హెచ్చు.

పూర్వము వోలె.

ఇందీ గ్రంథాంతరములు గలవు—

1a హరిశ్చంద్రోపాఖ్యానము. 276a సుగ్రీవ విజయము.

---

## No. 1926. మృత్యుంజయవిలాసము.

## MṚTYUNJAYAVILĀSAMU.

Substance., palm-leaf. Size, $15\frac{1}{2} \times 1\frac{1}{4}$ inches. Pages, 53. Lines 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. తృతీయోల్లాసము మాత్రమే కలదు. దానినుగూడఁదుదిపట్టు కొంత లేదు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె.

ముఖపత్రమున నీ వ్రాఁతకలదు: "చాగఁటి సుబ్బన్న అయ్యవార్లగారు శివార్పితంగా ఇచ్చెను."

---

## No. 1927. మృత్యుంజయవిలాసము.

## MṚTYUNJAYAVILASAMU.

Substance, palm-leaf. Size, $16\frac{1}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 166. Lines, 5 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as the above. But at the end of the third ullāsa, instead of the usual colophon, the following dvipada is introduced

**End;**

శ్రీసింహభూధర శ్రీరామతీర్థ - భాసురస్థల ముఖ్య బహుదేశములకు
నాచార్య లుభయ వేదాంతరహస్య - ధీచతురాత్ములు తిరుమలవంశ
కలశాంబురాశిరాకా చంద్రమూర్తి - సలలిత పెద్దింటి సంపత్కుమార
శ్రీ వేంకటార్య దేశికుల శిష్యుఁడను - పావన గౌరమాంబా బుచ్చిమంత్రి
వరపుత్రుఁడను సూరవరుని పౌత్రుండ - నిరవందఁ గాశిరామేశర్వముఖ్య
సరసదివ్యక్షేత్ర సంచారభవ్య - కరుశైన వెంకన్న కామన్నయనెడు
నను జన్మలనుగూడి యలరినవాఁడ - వనజాక్షు పదభక్తి వశుఁడైనవాఁడ
శ్రీకూర్మదాసాఖ్యఁ జెందనవాఁడ - నాకుఁదోచిన యట్లు నవ్యకావ్యంబు
రచియించి వారికర్పణ చేసినాఁడ - ప్రచుర పాండిత్య సంభావితులార
గురుతర సత్కావ్యకోవిదులార - స్థిరతర వేదాంత దేశికులార
సరసత సుగుణలేశంబిందునెంచి - కరుణచే నానందకరులు గావలయు.

గ్రంథాంతమందీ వ్రాత గలదు :—

"వ్యయ సంవత్సర ఆశ్వీజ శు ౨౨ జయ వారం సర్కా విన్నకోట నరసింహులు వ్రాసి మాజేటి సర్వేశ లింగానకు ఇచ్చినాడు."

(వి-వి.)—

సమగ్రము. వ్రాత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

ఇది పూర్వవర్ణితమే.

కాని యిందు తృతీయోల్లాసాంతమున గద్యమునకు బదులుగా నిందు దాహృత మగు ద్విపదము గలదు.

---

## No. 1928. మైరావణచరిత్ర.

## MAIRĀVAṆACARITRA.

Substance, palm-leaf. Size, 9¾ × 1¼ inches. Pages, 102. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete, but wants preface.

The story in this is the same as that described under No. 650 ante, viz., the victory of Hanuman over Mairāvana ; the name of the author is not known.

**Beginning :**

ద్విపద॥ శ్రీకరహృదయేశ శ్రితమనోల్లాస – వైకుంఠనాయక వైభవాకార
. . . . . . . – ఈ ధరలోపలనే రీతి మీరు
ఎంత రక్షించితిరినకులాధీశ – . . . . . .
అని సన్నుతించిన నామునినాథుఁ – గనుఁగొని శ్రీరామఘనుఁడిట్టు లనియె.

క. మునినాథకుంభ సంభవ – యనిశము మాకష్టమెంత యాడటనెన్నన్
హనుమంతుని కష్టములో – నణుమాత్రము సేయఁగలరె యజహరులైనన్.

* * * *

ద్విపద॥ అనవిని మునినాథుఁ డారామవిభునిఁ – గనుఁగొని వినయోక్తిఁ గ్రమ్మ నిట్లనియె.

వ. . . . . . ఈ మహాబలుండు మీ యెరుకమీఁదఁ జేసిన కార్యంబులకు మీరింత సంతోషించితిరి . . . . హనుమంతుండు మీరెఱుంగని మహా కార్యంబు నిర్వహించె.

* * * *

ద్విపద॥ పాతాళ హోమంబు భగ్నమౌనాటి – రాతిరి కపులతో రఘురామమీరు
పవళించియున్నారు పరమాత్మ రామ – భువనమోహనరామ పావనరామ.
. . . . . . . . . . . . . .

ద్విపద॥ అని యిట్లు చింతించి యారావణుండు – మనసులోపల నొక్క మాటదలపోసి
పై రావణునితోటి మా వార్తలన్ని – యారూఢి వినుపించి యాదైత్యవరునిఁ
దోడుకరమ్మన్న సంతోషించిపోయి – తోడుకవచ్చిరి వేగఁ దోడరి దానవుని
. . . . . . . . . . . . . .

**End :**

ద్విపద॥ . . . . . . . రాముని రాజ్య భారంబులన్నియును
వేమరు తెల్పెదవిను ధర్మతనయ . . . . . . . .
మిక్కిలి శ్రీరాము మేదినిమీఁద నిక్కగాఁ గలరయ్య యీ రీతివారు
ధనధాన్యములచేత దనిసి సంపదల॥

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు : —

“ సర్వజిత్తునామ సంవత్సరము చైత్ర శు ౧ గు॥ నాంచు కుకునూరి బాపన్న వ్రాసిన మయిరావణ చరిత్ర.”

(వి-వి.)—

సమగ్రము. అవతారిక లేదు. వ్రాంతతిన్ననిదే కాని తప్పులు చాలఁ గలవు.

మైరావణుఁడు అను రాక్షసుని హనుమంతుఁడు జయించు కథయిందు వర్ణితము. గ్రంథకర్త పేరెఱుఁగరాదు. ఇది నై 650 రున వర్ణితమగు గ్రంథమును బోలినదే కాని యది పద్యప్రబంధము. ఇది యక్షగానము.

---

## No. 1929. మైరావణచరిత్ర.

## MAIRĀVAṆACARITRA.

Substance, palm-leaf. Size, $15\frac{1}{4} \times 1\frac{5}{8}$ inches. Pages, 65. Lines, 5 & 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు చాలఁ గలవు.

పూర్వము వోలె.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు—

“ఆంగిరస నామ సంవత్సర మార్గశిరడి . . వాసరం రోజున ఉదయమైన రెండు జాములవరకు శ్రీ జలధీశ్వరస్వామివారి కృపాకటాక్షంవల్లను మక్కపాటి అచ్చన్నగారి ప్రతిని వున్న క్రమానను ఘంటసాల సీతారాముడు మైరావణ చరిత్ర సంపూర్ణంగా వ్రాసుకొనెను.”

---

## No. 1930. భక్తాంఘ్రిరేణుచరిత్రము.

## BHAKTĀNGHRIRĒNUCARITRAMU.

Substance, palm-leaf. Size, $15\frac{5}{8} \times 1\frac{5}{8}$ inches. Pages, 50. Lines, 7 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, not good, full of mistakes.

Complete.

Gives an account of a Srivaiṣṇava saint known as Tondaradippodiyālvār and Vipranarāyāna. Uttararangakavi is the author.

**Beginning:**

గౌ. అది.

జయజయ సేవక జనశుభదాయక
జయగౌరీ తనయ గణనాయకా! జయ

సురనరవిద్యాధర గంధర్వకిం
పురుషోరగముఖ పూజితచరణా
కరిముఖ షాంజీ, ధర కాంచన భా
స్వరసుషమాంచిత కరుణాభరణా ! జయ,

* * * *

ఆటతాళి - కాంభోది.

పడఁతియల్లదె పువ్వుఁదోఁటా, వేగ
పదగదవెనమ్మి నామాటా,
మిడిమెండవడదీరి సీపూటా, విశ్ర
మింతా మింపొందఁగనచ్చోటా,
కలకలమను చిలుకలరవలు, శారి
కలగలగొనుచాలు కవకివలు,
వలయు క్రొవ్విరి తావులతీవలు, అం
చలు తేఁటిపాట సవసవలు.

**End :**

చ.. క్షితివరదీసికింబసిఁడి గిన్నెయ నిచ్చిన వాఁడనేనె యీ
యతివదాజ్ఞచేఁ బోడమునచ్చర షద్వనమాలికాంశజుం
డితఁడును నేను వేడ్కఁకయి యిర్వురఁగూర్చితి నన్నుఁజూచిన
ట్లతులిత భక్తిఁజూచి యనిశంబుభజింపుము నాదుభక్తులన్.

* * * *

ద్విపద॥ అనిశుభస్థితికిలాకాంచిత తతికి - ఘనరమ్యమతికి సుత్తరంగపతికి
నర్పితంబుగఁ దదీయ ప్రసాదమున - సర్విత సంగీత సాహిత్యహృద్య
తరకళా కోవిదోత్తర రంగసుకవి - ధరణిపైనాచంద్రతారార్కముగను
పరిఢవిల్ల నొనర్చె భక్తాంఘ్రిరేణు - చరితనాటక మిది చదివిన విన్న
వ్రాసిన చూచినవారకెల్లపుడు - శ్రీసతీరమణుండు సిరులిచ్చుగాత.

* * * *

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు .—

“ శరసంవ్వత్సర మాఘ శు 5 ఆదిత్య వారం రోజుకు లక్ష్మీదేవీ సమేతా నారాయణార్పణంగా షరంగిబాబయ్య విప్రనారాయణ చరిత్ర సంపూర్ణంగా వ్రాసి సమర్పించెను. ”

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథ పాత ములు లేవు.

తొండరడిప్పొడి యాళ్వారని విప్రనారాయణుఁడని ప్రసిద్ధిగన్న యాళ్వార్ల చరిత్ర మిందు వర్ణింపఁబడినది. ఉత్తర రంగ కవి గ్రంథకర్త.

---

## No. 1931¼. భావనారాయణ విలాసము.

## BHĀVANĀRĀYANA VILĀSAMU.

**Substance, palm-leaf. Size, 8¼ × 1¼. Pages, 90- Lines, 6 on a page. Character, Telugu. Condition, very injured. Appearance, old. Mode of writing, not good, but free from mistakes.**

Complete.

A yakṣagana of high literary merit while describing the story of Ginni Govinduḍu, a great devotee brings ont tue greatness of god Bhāvanārāyana worshipped at Ponnūru in Guntur district. The author Ranɡacārya, son of Sēṣamu Cennubhaṭṭu, has not used much of indigenous composition in poetry.

**Beginning :**

వ. తొల్లి భావనారాయణుండు గోవిందునిచేత నుపాదితుండై పొన్నూరి పట్టణంబు కేతెంచె నదియే వివరించెద,

గీ. అలరు శ్రీకొండవీటి సీమాంతరమున - పొలుపు వాటించు నందూరి పురవరంబు
నందుఁ జెన్నొందు కించన తానువృత్తి-విప్రవర్యుండు గూని గోవిందుఁడొకఁడు.

క. ఆనందూరి కులాగ్రణి - మానుగ గోవిందుఁడలరు మాన్యచరితుఁడై
యా నరసింహుఁడు కరుణా - ధీనుఁడు తనమామయగుట తెల్లముగాఁగన్.

క. కారంచేటి కులాగ్రణి - వారక నరసింహుఁ డలరు వర్ధిత విహితా
చారుండై గోవిందుఁ డు - దారగతిన్ మేనయల్లుఁడై వర్తింపన్.

సీ. చక్రహస్తునికథా శ్రవణ మబ్బెడువేళ-కార్యాంతరా సక్తిగతుఁడుగాఁడు
సారసేక్షణ మహోత్సవము గాంచెడువేళ-నతిభక్తి నచ్చోట నలరుచుండు
శ్రీనివాసునిమది ధ్యానంబు సేయుచో-నొడలుగల్గినసైన నూరకుండు
దురితభంజనుమది దూషించువారల-సాంగత్యమునకు నుత్సాహపడఁడు
అతిథులను గాంచి ప్రియమున నాదరించు - హరిపదంబు పరంబుగా నరయనేర్చు
సతత ధర్మకథా గోష్ఠిసలుప గలఁడు-విందులకు విందు గూని గోవిందుఁడతఁడు,

* * * *

సీ. అలనాఁడు మామ కన్యక నిత్తునని పల్కి - వెరవుదప్పెగదయ్య విశ్వనాథ !
నరసింహుఁడలనాఁడు నమ్మఁబల్కినమాట - తొలఁగఁద్రోసెఁగదమ్మ తుంగభద్ర !
మొదలఁజేసిన బాస తుదిఁగానరాదయ్యె-వీనులారవినుండు వెలఁగలార
మున్ను మాతుల సూక్తి విన్నారుగద నేఁడు-తప్పెఁగా పంచభూతంబులార
వేరులేక మిగులఁబెరిగిన తరులార - భావదేవగృహనివాసులార
ద్వారపాలురార ధర్మదేవతలార - శాపుఁడనుచు దెసలు కలయఁజూచి.

**End :**

సీ. ఒక విల్లు దునిమి వేడుక రామభద్రుండు - సీతామహాదేవిఁ జెందుటరుదె
ఒక మత్స్యయంత్రంబు తెకటార్చి గాండీవి-పాంచాల పుత్త్రిఁ జేపట్టుటరుదె
ఒక నేరమిడి దానఁ నొంచి సత్రాజిత్తు - కృష్ణుండు సత్యవరించుటరుదె
అటులుగాకుండ గోవిందుఁడాఱునెలల - కన్నసమయంబుదప్పక హరినిసాక్షి
దెచ్చెనిటు నరమాత్రుండు దేఁ దరంబె - బెండిలాడిన నిటువలె నుండవలదె.

క. ఆదటు గోవిందుఁడనుజ - నాదరుఁడై కృతవివాహుఁడై సుగుణసుఖా
మోదముల యత్తమామల - ప్రోదింగనుపట్టిహర్ష పూర్తింగీర్తిన్.

**Colophon :**

ఇది శ్రీమన్నంద నంద నచరణారవిందద్వంద్వ నిష్యంది మరందబిందు...... ..
మదవ దిందిందిరాయమాన మానస శేషవంశాబ్ధి సుధాకర చెన్నభట్టారక కుమార
రంగాచార్య ప్రణీతంబైన భావనారాయణ విలాసంబు సంపూర్ణము.

గ్రంథాంతమందీ వ్రాఁత గలదు :—

"చిత్రభాను నామ సంవత్సర ఆశ్వీజ శుద్ధ 14 అంగారకవారం వరకు కప్పగంతు
సుబ్బా శాస్త్రులుగారికి శనగవరపు శ్రీధర రామయ్య రామార్పణంగా వ్రాసియిచ్చిన భావ
నారాయణ విలాసం సంపూర్ణం."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు
చాల హెచ్చుగాఁ గలవు.

గుంటూరు మండలమునఁగల పొన్నూరు గ్రామమున వెలసిన భావనారాయణ
స్వామి మాహాత్మ్య ప్రతిపాదకముగా గూని గోవిందుఁడను భక్తుని కథయందు వర్ణితము.
శేషము చెన్ను భట్టు కుమారుఁడైన రంగాచార్యుఁ డీ గ్రంథమును రచియించినవాఁడు.
ప్రశస్త రచనముగల యీ యక్షగానమున దేశిరచన అంతగాలేవు.

## No 1932. రాధామాధవ విలాసము.

## RĀDHĀMĀDHAVAVILĀSAMU.

Substance, paper. Size, 8⅝ × 6¼ inches. Pages, 31. Lines, 13 on a page: Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good, but not quite free from mistakes.

Begins on Vol 222 *a* of the M. S. described under No. 1896 ante.

Incomplete.

The story described in the Rādhāmādhavavilasamu is followed in this The love sports of Rādhā and Mādhava are herein described. The name of the author is not found here, but it is made out that he was a native of Cīrāla in Guntur district.

**Beginning :**

క. శ్రీ ద్వారక నిలయుండై - యాదరమున రుక్మిణీశిఖామణితోడన్
మోదంబందెడు సిరివరు - పాదంబులకే నొనర్తుఁ బ్రణతులు నేడ్కన్.

వ. అని ద్వారకా వాసుఁడైన శ్రీకృష్ణునకుఁ బ్రణమిల్లి కృతికధీశ్వరుండైన చీరాల గోపాలస్వామి నేమని వినుతించుచున్నాఁడు :—

*     *     *     *

వ. అవి యిష్టదేవతా ప్రార్థనంబుచేసి మహాలక్ష్మినిం గొనియాడి స్వాచార్య తిరుమేను తిరువడిఘుళు నుతిచేసి సుకవి వందనంబాచరించి నా రచియింపబూనిన శృంగార కావ్యంబును నాటకాలంకారంబును సకల జనసంతోషకరంబునైన రాధామాధవ విలాసంబను యక్షగానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన ;

**End :**

చిఱుత పాదములవని మెల్లన చేర్చి నడచు వేళనె, శరణమరుదుగ ద్రొక్క లేదా చెట్టుఁబట్టి నాడు నేయని యోచనేమియు నేడుగలదా మనసులో, కోడిగముగాదరయ విష్ణుడు గుణవిశాలా !

ఝంపె.

అదిగాక గురుపత్నియగు తారమరుకేళి
గదియడే సోముఁడని కాదనగ వలెనో,
అసురగురు పుత్త్రియగు నలదేవయానపొక
వసుధేశుడు యయాతి వరియించలేదో
మనకేమిటికి యింత యనుమానమొందుటకు
ఘనియేమి నా పలుకు పాటింపవయ్యా !

(వి-వి.) —

అసమగ్రము. వ్రాతమంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథపాత ములు లేవు.

రాధామాధవ విలాస ప్రబంధఘోరణి సీ యక్షగానము కలదు. ఇందు రాధా మాధవుల శృంగారవిహారములు వర్ణితములు. గ్రంథకర్త పేరిందుఁగానరాదు. కాని యాతఁడు గుంటూరు మండలమున సముద్రతీరమందున్న చీరాల యూరివాఁడని తెలియ నగును.

ఇందలి గ్రంథాంతరములకు నె 1896 రు చూచునది.

---

## No. 1933. రాధా వేశకథ.

## RĀDHĀVĒṢAKATHA.

Substance, palm-leaf. Size, 15⅞ × 1⅝ inches. Pages, 42. Lines, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair, but not free from mistakes.

Begins on fol. 10 *a*. The other works heren **are** :—Bhāmavēṣakatha 1 *a*. Pārijata dvipada 31 *a*. Hindustani songs etc. 32 *a*.

Complete.

The love of Sri Krisna and Rādhā, in their separation is described in this. It is similar to the work described under No. 1936 ante.

**Beginning :**

ముఖారి॥ అటతాళ॥

మానరా సింహునకూ జయా
మంగళం జయ మంగళం॥ ప॥
మనసాతీతా రంహునకూ
మర్దితా దురంహునాకూ
మా నారాసింహునకూ జాయా
మంగళం శుభ మంగళం॥

* * * *

అనుకవిల్లాసూనాకూ
అంతర్వేది వాసునాకూ
ఘనచిద్విలాసూనాకూ
కాంచనా వాసూనాకూ

* * * *

ద్విపద.

నాపేరు రాధిక నావిభుఁడైన - గోపాలకృష్ణుండు కొమ్మరో నన్నుఁ
గోలఁదిమీఱినకూర్మిఁ గూడి జవ్వనపుఁ - గోలఁకుల విహరించి కూటమిమించి
తనివిదీఱను మానధనమెల్లఁగొల్ల - గొనిపోయి యే యింతిఁగూడెనో కాని
రాఁడాయె నెతువంటి రాతిరో నిమిష - మేఁడాయె నీజాలినేమిటుఁగడతు
వానిఁజూచిన యిందువదనకెందైన - రానీయమనసౌనె రామరోయన్న॥

* * * *

పాయిరి - అటతాళ.

కన్నెరావి కొమ్మాక్రిందా - సన్నసూదులు నేదంబాగా
సన్నచేసి నున్నామడిగేవు - గోపాలరాయా సన్ననేమంగా చిన్నాదానారా ॥
రాతిరి నీవు వస్తానంటె - నీతితోడా నేనుండాగా
రాతిరి నీవు రాకపోతివి - గోపాలరాయా రాతిరీశివరాతియేరా॥
పంచదారావంటి యీ - మించుతేనియ మంచుగురియ
మంచు నాగుబ్బాలు పడిసెరా - గోపాలరాయా యెంచరాని మోహమాయెరా॥
వంచనా మాటలాభ్రమా - యించకాయిఁకనైన గారా
వించరా రతులా కౌఁగిటిలో - గోపాలరాయా మంచమెక్కదావూ వేలారా॥

కేగుప్తి - ఏకతాళ.

కలికి నీ పలుకుముద్దు గులికెనిదేమొ
తోతందనానా తందనానా తోతందనానా॥

* * * *

శంకరాభరణం-ఆది.

సద్దుసేయకే యికనైననా
వద్దబాయకే॥ ప॥
ముద్దులాడి నీ చక్కెర మోవియాన నీవె
యే ప్రొద్దొద్దు వాకొక్కక్కవింత
సుద్దిమించకే మన
యిద్దారిసందూనా పోదరిమెంతలేదుపోవే
యీ సుద్దులాకేమి నన్నా నీ సొమ్ముచేసికోవె॥ సద్దుసేయకే॥
మేలువాఁడనే మోహాంబుధిఁ దేలినాఁడనే
యీ జాలమేలనే నీతోటిదె జోలివాఁడనే
మది జాలిమీఱెనే మీఱినవెతలే లీలఁదీఱునే
పంత మేలవాలునే యీలాగైతే తాళఁజాలవే॥

**Colophon :**

నాలుగు స్త్రీ వేషములు కృష్ణవేషము జలక్రీడలు కూడా వ్రాఁత పుట యిరువై యొక్కటి.

(వి-వి.)

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు గలవు. శైథిల్యము గలదు. గ్రంథ పాతములు లేవు.

ఇందు రాధాకృష్ణుల విప్రలంభ శృంగారమందు వర్ణితము. మఱియు శ్రీకృష్ణుని యితర భార్యలకును నిందుఁ బ్రవేశము గలదు. ఇందుఁ గొన్ని కృష్ణస్తుతి శ్లోకము లర్థసహితముగాఁ గలవు. ఇది నెం 1934 రును బోలినదే గాని వేఱురచనము.

ఇందీ గ్రంథాంతరములు గలవు :—

1a భామ వేష కథ, 31a పారిజాత ద్విపద, 32a హిందుస్తాని పాటలు వగైరా.

---

## No. 1934. రాధావేషకథ.

## RADHAVĒSAKATHA.

**Substance, palm-leaf. Size, 16¾ × 1¼ inches. Pages, 7. Lines, 5 on a page. Character, Telugu. Condition, uninjured. Appearance, old. Mode of writing, bad and full of mistakes.**

Begins on fol. 31 a. The other works herein are Kṛisṇavēsakatha 1a, Pārijātaharanamu 35a, Kālingamardanamu 45a.

Incomplete.

A portion relating to the character of Rādha, found in Bhāgavata-yaksṣganamu. The name of the author is not known.

**Beginning :**

. . . . . ద్దుకృష్ణుఁడు
అల్లుఁడాయెను సుమ్మి అరవిందనయన
పల్లవాధరివాని బాల్యంబునందు
చక్కనివాఁడని చాల మోహించి
మక్కువతోడుత మమత రెట్టించి
. . . . పొలుపైన పొదరిండ్లయందు
కలయుచు మెలఁగుచుఁ గళలచే మున్ను
కామించి నన్నేలెఁ గలికి కృష్ణుండు

* * * *

మాధవుడుండఁగా మగువ వచ్చితిని
రాధికయందురే రమణి నా పేరు.

వ. ఓశమ్మా మాధవీ.

క. సిరిసిరముగ శ్రీ కృష్ణుఁడు - కరమరుమగ నన్ను నేలి కాంతలకడకుఁ
జగిగినవానిటుచూపుడి - సరసతొ నా పేరు రాధ సకియరొ వినవే !

(తెరవిడుచుట.)

గోపాలకృష్ణుని గంటిరా మీవాడలోను
గోపాలకృష్ణుని గంటిరా !
గోపాలకృష్ణుని వాడరేపల్లె తన యీడునాపాటి
చెలులనేలు భూపాలుడు రాడాయె చిన్ని గోపాల !
ముఖసూలిగజ్జెలు మెడను పులిగోరు పతకముమెఱయ
చెలువైన నల్లని మేనిచాయల వాయ్యారి చిన్ని గోపాల॥

**End :**

కం. కీరావారములాకడు - ఘోరముగా బాధచేసి పోరెడఁగానే
సారెకుఁ దలఁకుచు నా మది - ఓ రమణీ నిమిషమింక నోరువలేనే.

ఓ యమ్మా నే నోర్వలేనమ్మా
ఓర్వలేనమ్మా సారెకుఁ జెలఁగి
కీరవారము నాతో పోరుచేసె నింక
ఓరువలేనే ఓ యమ్మా నే॥

క. కమ్మని చిలుకతురంగుడు - యెమ్మెతుగాజంగి నైజ కుదపై మోదెఁ
అమ్మోదమ్మునఁ గ్రుమ్మిన తాళుడు - రమ్మా యని పిలువరమ్మ రాకేందువదనా.

చెలువుఁడు రాకయుండుట కదనా
కోకిలబలములు కేకిరవంబులు
జోకిన చెవులకు ములుకులై తోచెను
రాకేందువదనా॥

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాత ములు లేవు. ఇందు యితర గ్రంథములుగలవు. 1 a కృష్ణవేషకథ, 35 a పారిజాత హరణము, 45 a కాళింగమర్దనము.

భాగవతయక్షగానకథలో రాధావేషకథ యిది. కర్తపేరెఱుఁగరాదు.

---

## No. 1935. రుక్మాంగదనాటకము.

## RUKMĀṄGADANĀṬAKAMU.

Substance, palm-leaf. Size, $11\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches. Pages, 20. Lines 5 to 8 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, very bad, full of mistakes.

Incomplete.

Describes the well known story of Rukmāngada and greatness of the religious observance of fasting on Ēkādasi i.e., the eleventh day in a fortnight in every lunar month. The name of the author is not known.

**Beginning :**

చెంగావి దుప్పటి మేను చెన్నుమీఱంగ గట్టి
బంగారు బెత్తములచేత బాగుగాఁ బూని
శృంగారశేఖర రుక్మాంగదుని వాకిటి
కటికచెన్నుఁడు వెడలెను, సభకడకు॥

వ. ఈ విధంబున కటికవచ్చి సభలో నేమనుచున్నాఁడు.

**End :**

వ. ఈ విధంబున మృగాదులు పయిరులను చెఱుపఁగా కాపులు రాజువద్దికివచ్చి మొర్గం బెటువలెను.

ఒపలేక కోలలూనుక
వెఱ్ఱివెఱ్ఱిచూపులతో గూని వీపులతోను
తోపులు పడుకొంటు
తోపులాడి కాపులువచ్చిరి భూపాలు కడకు॥

(వి.వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది గాదు. తప్పులు గలవు. శైథిల్యము చాలఁ గలదు. గ్రంథపాతములు గలవు.

ఏకాదశీ వ్రతమాహాత్మ్య ప్రతిపాదకమయిన రుక్మాంగదునికథ యిందు వర్ణితము. ఇది ఆర్. నెం 205 గున వర్ణితమగు గ్రంథమును బోలినది. గ్రంథకర్త పేరిందుఁ గానరాదు.

---

## No. 1936. రుక్మిణీవేశకథ.

## RUKMINĪVĒSAKATHA.

Substance, palm-leaf. Size, 16 × 1¼ inches. Pages, 18. Lines, 5 and 6 on a page. Character, Telugu. Condition, much injured and worm eaten. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 1a. The other works herein are Jalakrīda 9b. Savatulakayyamu 15a.

Complete.

The feelings of Rukmiṇi in separation from her lord, are herein described. Many of the verses in this are taken from Bhāgavata. The name of the author is not found in this.

**Beginning :**

అరేరామా గోవిందా రామకృష్ణా గోవిందా

శ్లో॥ వేణీమూలే విరచిత ఘనశ్యామపింఛావచూడో
విద్యుల్లేఖావలయితయివస్నిగ్ధపీతాంబరేణ
మామాలింగన్ మరకతమణిస్తంభగంభీరబాహుః
స్వప్నేదృష్ట స్తరుణతులసీభూషణో నీలమేఘః.

వ. ఆ కామధేనువా ! ఆ కల్పవృక్షమా ! ఆ చింతామణి, ఆ పరసవేది ! హరి నారాయణ గోవిందా !

*   *   *   *

పిడికిట తెల్లని ఆకులు పట్టుకొ
వెలయపోక ముడి వేలనె చుట్టి
నడుము బెళుకగా అడుగులు తడబడి
కుడనెడఁ దిరుగుచు నెందు బోదూవే
ఓమందయానా ! వో రాధా !

*   *   *   *

దేవకి మాయత్త వసుదేవు మామ
బావ బలభద్రుండు భద్ర నా సవతి
రేవతి యేరాలు లేమరో వినవె
సాత్యకి నా మఱఁది సరసీరుహాక్షి
గోపాలకృష్ణుండు కొమ్మ నా విభుఁడు
నా పేరు అడిగితివి నాతిరో వినవె
నాపేరు రుక్మిణి నలినాయతాక్షి !

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇందు రుక్మిణీ విప్రలంభము వర్ణితము. ఇందలి పద్యము లనేకములు భాగవతాదుల నుండి గ్రహింపఁబడినవి. దీని కర్త పేరిందుఁ గానరాదు.

ఇందీ గ్రంథాంతరములు గలవు. 9b జలక్రీడ, 15a సవతులకయ్యము.

---

## No. 1937. రుక్మిణీవేషకథ.

## RUKMINĪVEŚAKATHA.

Substance, palm-leaf. Size, $1\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches. Pages, 16. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing fair but full of mistakes.

Begins on fol. 1a. The other works herein are Savatulakayyamu 8a, Jalakrīda 8 b, Ērukalavēśakatha 31a.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. ప్రాఁత తిన్ననిది గాదు. తప్పులు గలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు

పూర్వము వోలె.

ఇందు గ్రంథాంతరములు గలవు 8b జలక్రీడ, 8 a సవతులకయ్యము, 31a ఎఱుకలవేషకథ.

---

## No. 1938. లక్ష్మణప్రాణరక్షణము.

## LAKṢMAṆAPRĀṆARAKṢAṆAMU.

Substance, palm-leaf. Size, $14\frac{1}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 40. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, bad and full of mistakes.

Complete.

The story of Hanuman getting the Sanjīvini mountain to bring Lakṣmaṇa back to life, is described in this. Lingakavi, son of Prōlanārya is the author, and the work is dedicated to Gopalaswami at Pavanipuram.

**Beginning :**

క. శ్రీ గౌరీశుని గొలిచియు - వాగీశు నుతించి శ్రీనివాసుని దలఁచెన్
నాగేంద్రముఖుని వేఁడుక - ధీగౌరవకవులఁ బ్రస్తుతించుట వేడ్కన్.

వ. అని కృతీశ్వరుండగు పవని గోపాలస్వామి నేమని కీర్తింపుచున్నాఁడను.

జంఝా. సరసురార్చనలోల సత్కంజరాథిల
పరహితార్థసుశీల పవనిగోపాల.

* * * *

వ. అని యద్దేవున కంకితంబుగా నా యొనర్పంబూనిన లక్ష్మణప్రాణసంరక్షణంబను యక్షగానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

ద్వి॥ శ్రీరామచంద్రుండు శ్రితపారిజాత
తారకబ్రహ్మమంత్రాధిదైవంబు
కార్యార్థమై మేటికరుణ వినుతుఁడై
పర్యాయమున ద్రోణ పర్వతంబునకు
పురములు దేశముల్ పుణ్యతీర్థములు॥

**End :**

ద్వి॥ అని కృపారసమూర్తి యఖిలసమర్థ
వినుతపావన జగద్విఖ్యాతు పేర
అంకితంబుగఁ బరమానందు పేర
. . శతహంతుఁడగు ప్రోల నార్యతనూజ
సురుచిరబుధజస్తుతలింగధీర
విరచిత శృంగార విప్రశుతిఁ దనరు॥

(వి-వి.)—
సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు చాలఁ గలవు.

లక్ష్మణప్రాణరక్షణార్థమై హనుమంతుఁడు సంజీవిని దెచ్చు కథ యిందు వర్ణితము. కవి ప్రోలనార్యుని కొడుకు లింగకవి. పవనిపురమున వెలసిన గోపాలస్వామి కిది సమర్పితము.

---

## No. 1939. విప్రనారాయణచరిత్ర.

## VIPRANĀRAYANACARITRA.

Substance, palm-leaf. Size, 17 × 1¼ inches. Pages, 46. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, not bad.

Complete.

The story in this is the same as that described under No. 1930 ante. The name of the author is not found in this, but it is made out that he was a disciple of Kandāla Doḍḍayācārya.

**Beginning :**

ఎనసి డెబ్బదినాల్గు సింహాసనులనందఱ వన్నెగాంచిన
యఖినుతుండగు దొడ్డయార్యుల వినుతి సేతుగా.
హెచ్చియుండిన పరమతంబుల నెల్లఁద్రుంచి ప్రఖ్యాతివడసిన
సచ్చరిత్రుఁడు దొడ్డయార్యుల సన్నుతింతుగా.

వ. అని మఱిన్ని ఘటికాద్రి నారసింహునకు మఙ్గళ్యంతాలు చెప్పెనట దొంటు వరెను.

అర్ధచంద్రికలు.

నలినజు చదువులు నిలిపిన హరికిగా
మూపున కుధరము మోసిన హరికిగా
అరసి హిరణ్యుని నడఁచిన హరికిగా
కరుణఁ బ్రహ్లాదునిఁ గాంచిన హరికిగా.
* * *

వ. అంకితంబుగా నా యొనర్పంబూనిన విప్రనారాయణ చరిత్రంబను యక్షగా
ంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

* * * *

ఝంపె. ఇటువంటి పెద్దలను నీలాగు వలుక నీ
కెటువచ్చెనే మనసు ఇగురాకుఁ బోఁడీ
ధరలోనఁ గలుగు మునివరులవలెఁగాద యీ
పరమపుణ్యుఁడు రంగపతిసేవకుండు
ఇతనిఁ జూచినఁ బాయు నెట్టిదోషములైన
నతివేద్య సకలశాస్త్రార్థకోవిదుఁడయా

* * * *

అయ్య మీచేత నీ నపరంజిగిన్నె మా
కియ్యమని పంపంగ నేమి యీవేళ
అల్లుఁడవి నగవులకు నన్నమాటలు తనకు
నుల్లమున నెగ్గుగా నుంచుకోఁ దగునె.

* * * *

**End :**

ద్వి॥ అని సర్వజీవదయాపరు పేర
. . . . . కమలాక్షు పేర
వనమాలి పేర భావజు తండ్రి పేర
వనజారి పేర మందరధారు పేర
సురపోషణుని పేర సుస్థిరముగను
వలనొప్ప ఘటికాద్రి వాసుఁడైనట్టి
. . . . . . .
అలర వాధూలగోత్రాబ్ధి చంద్రుండు
చిరకీర్తి వెలసి యాశ్రిత హితోదయుఁడు
కరుణాపయోనిధి కందాళదొడ్డ
యాచార్యులకు శిష్యుఁడైనట్టి వైష్ణ
వాచారతత్ప

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

“ ఈ విప్రనారాయణచరిత్ర అహోబలం జియ్యరువారి తిరువడిగ ఆశ్రయించిన శిష్యుండు యేపూరి తిమ్మి నాయుడు వ్రాసుకున్న శ్రీ కొచం శ్రియప్పతియైన శ్రీ రంగధాముని కర్పితం. ”

(వి-వి.)—

సమగ్రము. కాని తుది పట్టు కొంచెము కొఱఁత. వ్రాఁత తిన్ననిది. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు

తొండరడిప్పొడియాళ్వారని, భక్తాంఘ్రిరేణువని నామాంతరములుగల విప్రనారాయణుఁడను నాళ్వార్ల చరిత్రమిందు వర్ణింపఁబడినది. గ్రంథకర్త పేరుగల గ్రంథభాగమిందు లోపించినది. కాని యాతఁడు కందాళ దొడ్డయాచార్యుని శిష్యుఁడని మాత్రము తెలియనగుచున్నది.

---

## No. 1940. వీరచోడవ్వ చరిత్ర.

## VĪRACŌḌAVVA CARITRA.

Substance, paper. Size 12⅜×7⅝ inches. Pages, 45. Lines, 18 & 19 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, is good but not quite free from mistakes.

Begins on fol. 364a. The other works herein are: Pāṇḍuranga-māhātmyamu 1a, Sītārāmāñjanēyasaṁvādamu 104a, Mairāvaṇa caritra 162a, Rāmastavarājamu 208a, Bhānumadvijayamu 281a, Atmānandarasamañjari (dvipada) 328a, Akkamahādēvi caritra 399a, Gurunambi caritra 418a, Vēnkaṭēśvaramahātmyamu 435a, Vēnkaṭācala-mahātmyamu 467a.

Complete.

Gives an account of Vīracōḍavva, a female devotee of Śiva. The name of the author is Gurramu Cinapotayya and he wrote it on the lines of earlier popular songs and dedicated it to God Śankarēśvara at Rompi carla. For details see the extracts below.

**Beginning:**

సీ. శ్రీరాగకలిత సుస్థిరభావకల్యాణ
చరిత గౌరీప్రియ సలలితాంగ
శంకరాభరణ భుజంగనీలాంబర
సన్నుత భైరవ జనకభర్గ
మలహార యభవరామ క్రియాన్వితదేవ
గాంధార యక్షలోకప్రసన్న
కాంభోజ సౌరాష్ట్ర గౌళభూపాల సం
సేవితపాద రాజీవయుగళ
యనుచు నను రాగ మతిఁగొని యాడివిబుధ
జనమహీజాత నివహావసంతుఁడగుచు
సిరులు దయసేయుచును రొంపిచెరలపురిని
నిరత శోభిల్లు శంకరేశ్వరునిఁగొలుతు.

* * *

వ. అని . . . . . రాచవీటి వీరభద్రుని నేమని కొనియాడుచున్నాఁడు.

*   *   *   *

వ. అని సుకవీంద్రుల నేమని పొగడుచున్నాఁడు.

అటతాళము.

ఫాలలోచనుఁగొలుచు శరణుల లీలలెల్లఁజెప్పిన
పాలకురికి సోమనాథునిఁ బ్రస్తుతింతున్.

*   *   *   *

ద్విపద. అని . . . . . . .

సకలాధిపతియైన శంకరేశ్వరుని
వరలబ్ధమునను రేవణసిద్ధగురుని
కరుణచే నెల్ల సత్కృతులుగీర్తించ
వీరచోడవగారి విమలచారిత్ర
మారాధమతిఁబూని యక్షగానంబు
గావించెదను సుధాకర మౌళివంశ
పావనోదయుఁడైన పాలాంకవిభుని
సుతుఁడు గుజ్జము గణేశునికి సౌభాగ్య
వతి సోమమాంబకు వర్ణితలీల
నుదయించువాఁడఁ గులోద్ధారుడైన
పెదకపోదయ్యకుఁ బ్రియసహోదరుఁడ
ననఘ వర్తనుఁడ రాచయ్యకగ్రజుఁడఁ
జినకపోచాఖ్యుండ శివకవీంద్రుండ
గురులింగయతిగణ గుణసౌరభంబు
లెఱిఁగించుచందంబు లెల్లనుగూర్చి
కారుణ్య నిధికి శంకరునికిఁబుణ్య
చారిత్ర యొసఁగితి సద్భక్తివినుఁడి.

*   *   *   *

సీ. కైలాసగిరిమీఁదఁ గఱకంఠుఁడొకనాఁడు
వేడుకతో జూదమాడుచుండి
నవ్వీన హిమశైలనందన వీక్షించి
యెత్తుదప్పదు నవ్వ నేటికనిన
నిందులకై కాద యేణాక్షి వినుదక్ష
వాటిలోపల సానెవారలెల్ల
బాలికామణులతోఁ బరిణయంబొనరించి
నను నల్లుఁడని కొల్వ నవ్వువచ్చె

ననియోఁగేలుమొగిచి యభవ మామీఁదటఁ
బరిణయంబునకును వెఱవుగల్గు
నట్టివంశమందుఁ బుట్టి మీచిత్తంబు
వచ్చినట్లు మెలఁగ నిచ్చగలదు.

వ. అని యమ్మహాదేవునికి నెఱింగి శైల తనయ తన నిజాంశంబునఁ గన్యచోడుకు వీరచోడునకుం బుట్టించెనట . . . .

* * * *

ద్విపద. అని యిట్లు పురజను లభినుతిసేయ
ననిశంబు వీరచోడన్న చాళుక్య
భీమేశుకథలును బిరుదుగద్దియలు
నేమించి చదివి బన్నిన నెఱింగి
వలనొప్పనిట్టి దైవతసార్వభౌముఁ
డిలు వెల్వ తనకని యిచ్చలోనమ్మి
యతనికిఁ దనదు ప్రాయముమీఁదుకట్టి
యతిమోదముననున్న యవసరంబెఱిఁగి
పెనుపరిమదనుండు భీమేశుమీఁది
కినుకఁజోడవ్వపైఁ గెరలెనో యనఁగ
సాహసంబున నిక్షుచాప మెక్కించి
మోహనాస్త్రము నేసి ముదలకించుటయు.

* * * *

వ. ఇట్లు శోభనంబులుపాడ నత్యంత వైభవంబున నన్య చోడు అల్లుని కరణంబు లిచ్చి కూతు నొప్పగించి బంధునివహంబులతో గృహంబునకుంజనియె.

* * * *

త్రిభంగులు॥ చోడకా సానెవాడవై యొక్క
వేడుక కాఁడు విచ్చేసెన్॥ ౧॥
ఎక్కొలేకావు సొమ్మెల్లఁ బెట్టు
నిమ్ములనమ్మిక లియ్యఁబూనెన్॥ ౨॥
వేవేగ భీమభావకుఁజెప్పి
నీవు నావెంట నేతేవే॥ ౩॥

వ. అని యిట్లు పలికిన తల్లికి నక్కలికి యేమనుచున్నది.

ఝంపె॥ భీమనాయకుఁడింక నామనోనాయకుఁడు
భీమనాయకులనేఁ గామింప నేరన్॥ ౧॥

* * * *

వ. అటుమీఁదట వీరచోడు దృఢంబుగని భీమేశ్వరుం డిచ్చలో మెచ్చి విటరూపంబుమాని యెప్పటియట్ల వర్తింపుచుండె మఱికొన్ని దినములను వీరచోడు మంచి ముహూర్తంబున సమర్తాడిన వార్తవిని పూజారులు చెలువుగాఁ జలువ చప్పరంబుఁ బన్నియుం దునిచి యుచితకృత్యంబులు నడుపు సమయంబున మునుపటి కపటంబులుడిగి బంధుజనంబులుం దల్లియు నపరిమిత సంతోషంబునఁ బరిచర్యసేయవచ్చిరంటు యెటు పరెను.

* * * *

వ. ఇట్లు హితజనంబులు దెచ్చునవి యిష్టలింగంబునకొప్పించి తనవారల కభీష్టంబులిప్పింపం దలంచి యెప్పుగా నప్పులగంబు తన మధురాధరంబు నంగీలుకొలిపి జిహ్వాగ్రంబున రుచిగొని యా సింహమధ్యయొక్క నెచ్చెలిం జూచి మచ్చికలతో నేమనుచున్నది.

తే. రావెయోచెలి మీ భీమభావగారు
ఎంతయాసించియుండునో యిందులకును
అప్పపులగంబు పంపినదనుచు నిమ్ము
ఆసయెఱిఁగినదనికొని యాడుఁగాని.

* * * *

ద్విపద. అనియిట్లునెచ్చెలి యాడు వాక్యములు
విని భీమలింగంబు వికవికనగుచు
వీరచోడవగారి వీరశైవ ప్ర
చారంబు భువిఁబ్రకాశంబునేయంగఁ
దలఁపుచుఁదలుపు చెంతకుఁజేరి హస్త
జలజాతములువాని సందుగాఁజాఁపి
కోరగైకొని వట్టు గుజగుజల్గాని
యారగించుచుఁజాల నాలసించుటయు
మరఁదలు తలుపుల మాటుగాఁజూచి
కరమర్థితో భావగారికిట్లనియె.

* * * *

క. . . . . . . నెచ్చెలి వెండియు నడుగంగా నా వెండి కోరతో నారగించువాఁడై యుంచుకొని చోడుమీఁది వేఁడుకను భీమేశ్వరుండు తన పూఁజారులు పూజింపఁ దెచ్చిన బంగారుగిన్నె కంగున బైటవేయుటయుఁ బోడగని పుచ్చుకొని యచ్చెలుప యేమనుచున్నది.

* * * *

వ. అని నేరంబులెంచు పూజారుల వీక్షించి చిరునవ్వు నగి వీరచోడు వినుచుచున్నది.

మఱిమొరేకులు.

అన్నలారా నన్ను నేరమెన్న నేలా మంచివెండి
గిన్నెఁబుచ్చుకొన్నవాఁడు మున్నె భీమలింగము
గిన్నె దెచ్చి గిన్నెయడుగుకొన్న మేలుగాకదొంగ
వన్నె వెరసి యిచ్చినపుడు విన్నవారుమెత్తురా
దొంగతనముసానెవారి వంగడమునలేదు భీమ
లింగమునకుఁగద్దు వినుగొంగువి ? ఇచ్చితెలిపెద.

* * * *

ద్విపద. అనికొనియాడెడు నవ్వీరచోడుఁ
గనుగొని భీమశంకరుఁ డిట్టులనియె
జలజాతగంధినీ సద్భక్తిఁజూచి
పులగంబు నేభుజింపుట నిక్కువంబు
భక్తవత్సలుఁడనై మరగెడునాకు
శక్తియుఁ గలిమి వంశంబుకారణమె

* * * *

అటుగాన నీవు మహాభక్తురాల . . .
వినుము నీ చరిత్రంబు లెల్లనుజూచి
మెచ్చితినో పాపాపు మేలుమేలింక
నిచ్చెద నీకోర్కె లేమైననడుగు
మనుటయు వీరచోడవ్వ కారుణ్య
వనధియో పార్వతీశ్వరుని వీక్షించి

* * * *

మెచ్చి వేఁడుమఁటన్న మేలయ్యెనిపుడు
ఇచ్చోటగూడిన యీ పౌరజనము
అందఱుగొలువ నత్యర్థి కైలాస
కందరంబుననుండఁగా వేట్కగలదు.

* * * *

తో కొనిపొమ్మన్న ధూర్జటియప్పు
డాకాంత వీర చోడవ్వనుపౌర

జనులను రోకొంచు సంభ్రమలీల
నని మిషుల్గొలువఁ దార్యాదికి నరిగె.

* * *

క. చాతుర్యంబగు నీకథ, గీతార్థములందు మిగులఁ గీర్తన కెక్కఁగా
ఆతెలుఁగెల్లను నేను బురాతననివహంబు కరుణ రచియిస్తిఁజుమీ.

**Colophon :**

ద్విపద. అని . . . . . . . .

* * * *

చిరతరస్థితి రొంపిచెర్ల నత్యర్థి
నిరవు గైకొను శంకరేశ్వరుపేర
వరగుణోదయుఁడు రేవణ సిద్ధదేవ
గురుసేవకుఁడు శైలకుల పవిత్రుండు
అసమశీలుండు గశ్యప కూర్మిసుతుఁడు
రసికశేఖరుఁడు గుబ్బము కపోదయ్య
యవిరళభక్తిఁ జోడవ్వచరిత్ర
కవిజనంబులు మెచ్చఁగా రచియించె
నీచమత్కృతి శంకరేశ్వరుకరుణ
నాచంద్రతారార్కమైయుండుఁగాత
నిది విన్న వ్రాసిన నీప్సితార్థములు
సదమల మతులకు సమకూర్చు శివుఁడు.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

వీరచోడవ్వ యను శివభక్తురాలి చరిత్ర మిందు వర్ణింపఁబడినది. గుబ్బము చిన కపోతయ్య దీనికిఁ గర్త. ప్రాచీన గేయముల ననుసరించి కవి దీని రచించెనట! రొంపిచర్ల శంకరేశ్వరున కిది యంకితము. విశేషముల కుదాహృత గ్రంథభాగములఁ జూచునది.

ఇందలి గ్రంథాంతరము లివి :——

1 a పాండురంగ మాహాత్మ్యము, 104 a సీతారామాంజనేయ సంవాదము, 162 a మైరావణ చరిత్ర, 208 a రామస్తవరాజము, 281 a భానుమద్విజయము, 328 a ఆత్మానందరసమంజరి (ద్విపద), 399 a అక్కమహాదేవి చరిత్ర, 418 a గురునంబి చరిత్ర, 435 a వేంకటేశ్వర మాహాత్మ్యము, 467 a వేంకటాచల మాహాత్మ్యము.

## No. 1941. వీరచోడవ్వ చరిత్ర.
## VĪRACŌDAVVA CARITRA,

Substance, palm-leaf. Size 11½ × 1½ inches. Pages, 80. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured and worm-eaten. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as the above.

Date of transcription :—Tuesday the seventh day of the first half of the month Caitra in the year Īśvara. Name of Scribe.—Mājēṭi Sarvēśalingam.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు కలవు.

ఇది నె 1940 రు ప్రతికి మాతృక.

పూర్వమువోలె.

గ్రంథాంతమం దీవ్రాఁతగలదు :—

"ఈశ్వరనామ సంవత్సర చయిత్ర శు 7 జయవారం వర్కు మాజేటి సర్వేశలింగం వ్రాసుకున్నాడు."

---

## No. 1942. శారదాకురవంజి.
## SĀRADĀKURAVAÑJI.

Substance, palm-leaf. Size, 11½ × 1½ inches. Pages, 20. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 13a of the Ms. described under No. 1849 ante.

Complete.

The story of the marriage of Rukmiṇi is described in this. Foretelling of events by a soothsayer to Rukmiṇi plays an important part in this.

Vēnkatakṛṣṇaiah son of Pōluganṭi Ciṭṭaya is the author.

**Beginning :**

శ్రీరమ్యమగుచు వానికి నెక్కినట్టి
ధారుణీస్థలిని విదర్భదేశమున

పొలుపొందఁ గుండిన పురవరంబునఁగ
నెలమి నాపట్టణం బేలు భీష్మకుఁడు

*  *  *  *

వ. ఇవ్విధంబున జనుదెంచిన యెఱుకతఁ గనుంగొని రుక్మిణీదేవి యెఱుకడుగవలసి శృంగారించుకొనెనటు యెటువలెను,

జంపె, అర్ధచంద్రిక, సౌరాష్ట్ర.

పన్నీట జలకంబు బాగుగానాడెన్
సరిగంచు చీరచుంగులు దీర్చికట్టెన్
తిన్నగా కస్తూరి తిలకంబుదిద్దెన్
తెలివిగలకనుల కంజనరేఖదీర్చెన్.

*  *  *  *

వ. అప్పుడు ఎఱుకత తన యిష్టదైవాలనే దలఁచెనటు యెటువలెను.

ఆటతాళం, భూపాళి.

శ్రీలమించు మంచ సౌదవమ్మ
శ్రీరంగ నాంచారు
పాలకడల పుద్దుపట్టి ఆదలక్ష్మి
బాగుగ వాకియ్యవే,
గొప్ప కన్నులుగల అలమేలుమంగమ్మ
గొబ్బున వాకియ్యవే.
కప్పురగంధిమా యదుగిరినాంచారు
గ్రక్కున వాకియ్యవే.
చక్కెరవిల్తుని గన్న పెరుందేవి
గ్రక్కున వాకియ్యవే.
అక్కర మమ్ముఁ గన్నతల్లి కనకవల్లి
అమృతంపు వాకియ్యవే
చల్లనికృపరంజిల్లెడి సౌందర్య
వల్లెమ్మ వాకియ్యవే.
కొల్లాపురమమ్మ యీకొమ్మకోరిక
కొనసాగ వాకియ్యవే.

**End :**

మంగళారతి.

తులుకుసిబ్బెపు గబ్బిగుబ్బ చన్నులపైఁట
తొలఁగఁగా గోపాంగనలు గొల్వఁగా

వెలఁగుచు నళ్ళువెన్నెలలు రుక్మిణిదేవి
వలాని పెండ్లాడు జలజాక్షునికిని,
జయమంగళా శుభమంగళా.
తొలుత అర్జునుచేత కలనజేరినయట్టి
చలము రాజులతో ! సారథనుచు
తులువలై గర్వించు దుర్యోధనాదులను
గెలిపించి ధరయేల సలుపుహరికి.
వనరాశిలోనలరు ద్వారకాపురమునను
తనయులును మనుమలును సనఁగిపెనఁగ
కనికరంబులుమాన్చి ననుఁగొల్చువారికిని
దినకోరికల నిచ్చు దేవునికిని జయమంగళం.

ద్విపద.

అనియిట్లు శ్రీరాఘువాధీశుపేర
వనజాతబాంధవ వంశ్యునిపేర
పంకజాక్షునిపేర భవ్యాత్ముపేర
దేవదేవునిపేర దివ్యాత్ముపేర
రావణాంతకుపేర రఘురాముపేర
కోమరొప్ప కేశవగురు మృదుపాద
కమలసేవకుఁడ రాఘవభక్తియుతుఁడ
ధరపోలుగంటి చిట్టియమంత్రిసుతుఁడ
నరసమాంబాత్మజా ? తనూభవుఁడ
వెంకటకృష్ణయ్య విరచించెననఁగ
ప్రచురశారద కొరవంజికట్టిణయు
నాచంద్రతారార్కమై యొప్పఁగాక.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇందు రుక్మిణీకల్యాణ కథ వర్ణింపఁబడినది. పోలుగంటి చిట్టియకుమారుఁడగు వెంకటకృష్ణయ్య దీనికిఁ గర్త. ఇందు రుక్మిణికి ఎఱుకతరూఱుక సెప్పుటకలదు. 'కొరవంజి' యను పేరుగల యక్షగాన భేదములం దెల్లకొఱకత రూఱుకయుండును.

ఇందలి గ్రంథాంతరములకు నెం 1849 రు చూచునది.

## No. 1943. శారదాకురవంజి.

## SĀRADĀKURAVAÑJI.

Substance, palm-leaf. Size, $11\frac{1}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 20. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair.

Begins on fol. 1 of the Ms. described under No. 1849 ante.

Incomplete.

Describes the story of the birth of (Bala) Rāma and Kṛṣṇa as sons of Devaki. The name of the author is not known.

**Beginning :**

. . . ఱుకతబుట్ట చంకను బెట్టుకో – కదియనురువున బురుకనురువై
కదియవెంటను బెట్టుకో ! వచ్చె నెఱుకతహా.

ద్విపద.

మెఱుఁగులసొమ్ములు మేననటింప – చిఱునవ్వుమొగమునఁ జెంగలింపఁగను
సన్నంపుఁజీరలో జారుఁబయ్యెటలో – చన్నులకాంతిదాఁ జౌకళింపంగ
తిన్ననిమాటలఁ దేనెలూరంగ – నన్నువనడుము దా నసియాడుచుండ

* * * *

వ. మెచ్చుమింగేవుసుమ్మి, మీ అవ్వకూతుర, ఆడదైతే కమ్మ, మొగన్న గడ్డమ్ము, వెన్నెతోడఁబుట్టువు, కడుపే సంతానమ్ము, కన్నులే తల్లిదండ్రి, పురుషుఁడే తాళిబొట్టు, చూపుదునే అవ్వ.

**End :**

ఎకతాళి, పంతువరాళి.

అంతనా నారాదముని అతివేగమునా
శాంతదైన్యమందేదెలిపి అంతరమ్మునా
పల్లజడలు శిరసునందు ఖవిరిగడ్డమూ
తెల్లని మేనికాంతితో నరిగెను దివికి.

ద్విపద.

అని లోకభక్తమందారుఁడై వెలసి – జనులఁబాలించుచు సరగగూళూరి
కేశవుండైన కైదాశ? చెన్నునికి – పొసఁగించి తంకితంబుగను శారదకు
కొరవంజి కట్నదాకుంభినిలోన – సరససత్కవులెల్ల సన్నుతించగను
నాచంద్రతారార్కమై యొప్పఁగాక !

(వి-వి.)—

అసమగ్రము. గ్రంథారంభ భాగము లేదు. తప్పులు చాలఁగలవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

రామకృష్ణులు దేవకికి జనించు కథ యిందు వర్ణితము. గ్రంథకర్త పేరిందుఁ గానరాదు.

ఇందలి గ్రంథాంతరములకు నె 1849 రు చూచునది.

## No. 1944. శివపారిజాతము.

## SIVAPĀRIJĀTAMU.

Substance, palm-leaf. Size, $14\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 136. Lines, 6 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

The marriage of Siva with Gāuri forms the main theme of the work. The dispute between Ganga and Gauri so common in works of this kind, is found in this, also, and as the yaksaganas are written on the lines of Pārijātāpaharana, they are styled as ' pārijātamu. One Lingamūrti is the author.

**Beginning :**

ఉమాశంకరా ఉరగభూషణా - కామితఫలదా గంగాధరా
సోమకళాధర శృంగారవైభవా - కామరూపజిత కామహరే
ఇందేలవచ్చేవు అందేలవచ్చేవు - రమ్మనవేవాని రమ్మనవే.

**End :**

భక్తజనార్తినివారణ శూలధారణ యోగీంద్రహృదయవిహార-జయ, జయ
రమణీయ ఫణిరాజభూషణ పాపశోషణ - కాంచన శైలవాసా, జయ, జయ.

*   *   *   *

కైలాస శైలనికేతనా వృషభకేతనా - కరిచర్మకలిత శరీరా, జయ, జయ
శ్రీలింగమూర్తికవే రిడంకురుతే - ముదముజ్జ్వల మంగళశతం, జయ, జయ.

గ్రంథాంతమందిట్లు గలదు :—

" విశ్వావసునామ సంవత్సరం భాద్రపద శు 6 శుక్రవారం సర్కారాళా భక్తుల బుచ్చి తమ్మునికి నండూరి బుచ్చన్న శివపారిజాతం వ్రాసి శ్రీ శివార్పితంగాను యిచ్చెను. "

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శివుడు గౌరిని వివాహమాడుట యిందలి ప్రధాన కథ. గంగా గౌరుల సాపత్న్య వివాదాది విషయములు సాధారణముగా యక్షగానములందుండునవి యిందును గలవు. పారిజాతపహరణ కథ ననుకరించి వెలసినవి గావున యక్షగానములు గొన్ని ' పారిజాత ' నామాంకితములుగా నున్నవి. ' లింగమూర్తి కవియే తద్గ్రంథ కర్త.

## No. 1945. శివపారిజాతము.

## SIVAPĀRIJĀTAMU.

**Substance, palm-leaf. Size, 12 × 1 inches. Pages, 46. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, too old. Mode of writing, bad and full of mistakes.**

Incomplete.

This is not the same as that described under No. 1944 ante. A few Sanskrit verses are found in this.

**Beginning:**

. . . . . . . . . . . . .

చక్కదనముల సౌజన్య శైలకన్య.

సీ. పగడాలజిగిడాల పగడాలతోఁ జేయు - తావిమించిన కావిమోవిగలది
తెలిదమ్మివెలిజిమ్మి బలునెమ్మితోఁగలతో - సీమగానాడు కెంజాడగలది
వండ్లతో గజనిమ్మపండ్లతో బంగారు - గిండ్లతో బెరయుపాలిండ్లుగలది
సిరిమించి నీలాల సిరిభ్రుంచితమ్ము? - పెన్నెరులుగలది?
యింతి ముత్యాలదొంతి చామంతిబంతి - కంతుమదదంతి వెలులమేల్బంతి యూధ
దంతి.

**End:**

చూర్ణిక.

శ్రీమద్వరశరద భ్రమిభ్రమ భ్రమాపాదిత
రంగదభంగ శృంగారాంగ.

(చి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులు చాలఁగలవు. శైథిల్యము గ్రంథ పాతములు గలవు.

ఇందు శివుఁడు గౌరిని వివాహమాడు కథ వర్ణింపఁబడినది. సంస్కృత శ్లోకము లక్కడక్కడ గలవు. నె 1944 రున వర్ణితమయిన గ్రంథము వేఱు. ఇది వేఱు.

గ్రంథాంతమందీవ్రాఁత గలదు.

"పరాభవనామ సంవత్సరం చిత్రి నెల 16 బుధవారం మధ్యాహ్నం మీఁదట వ్రాసినది."

---

## No. 1946. సముద్రమథనము.

## SAMUDRAMATHANAMU.

**Substance, plam-leaf. Size, 16⅝ × 1⅜ inches. Pages, 56. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.**

Begins on fol. 15 *a*. The other works herein are-Gollavēṣakatha 1 *a*, Sankirnageyamulu 43 *a*.

**Complete.**

It is similar to the works described under the titles "గొల్ల వేషకథ" "గొల్ల కలాపము." In this a close similarity is brought about between the churning of curds, and selling of buttermilk by the shepherd girl and the churning of the ocean of milk by Dēvas and Asuras and the distribution of nectar by Mohini. The name of the author is not known.

**Beginning :**

ద్విపద.

గానకోవిచెలి నేఁడు కోరియడిగితి - వరవింద దళనేత్రియాదికాలమున
గుఱుతుగా మాయింటిగోవులు పెక్కు - గలవన్ని వర్ణింపఁగమలజునకైనఁ
గాలఁదిగాదోయమ్మ కొమరొప్పవినుము - మరిమాకు నాపాడి మొదవులఁజేరి
పితుక నశక్యమై పేర్మిని మిగులఁ - జెలరేగి పొదుగులు చేపులుపుట్టి
తొలఁగక పాలన్ని తొడలపైఁ గుఱియ - నవినెలయేఱులై యవనిపైఁ బాఱఁ
బాలజలధియనంగఁ బ్రఖ్యాతిగాంచె - బాలరో మఱితేట పడవివరింతు
నంతటఁగొన్నాళ్ల కసురులుసురలు - మంతనంబునఁ జాల మది నూహచేసి
యమృతార్థులైపూని యాయబ్ధిదరువ - చలరేగిమందరా చలకవ్వమూన
పురికొల్పిదుగ్ధమున భూరిభుజంగ - వాసుకిత్రాడుగాజుట్టి దట్టంపుగమాని
గూడుకాదుగ్ధాబ్ధి గుభగుభదరూచ - నందులోజనియించె హాలాహలంబు
పొందుగాభూతేశు పుచ్చుకొనెనపుడు - అందులోజనియించె నాదిలక్ష్మియును
గందువతో విష్ణుగనుఁగొనెనపుడు - అందులో జనియించె నతిసుందరముగఁ
జందమామనువాఁడు జగతిభాసిల్లె - అలరంగనుచ్చైశ్ర వైరావతంబు
కామధేనువు మొదల్గలయప్సరసలు - ఇంద్రుండుగనుఁగొనె నిందుముఖులార
అందులోజనియించె నలరంగఁదార - వాలిసుగ్రీవులు వరుసఁగైకొనిరి
అందులో జనియించె నమృతంబుయపుడు - అందుకైకలహించి రసురులుసురలు
అదిమాన్ప విష్ణుండు ఆక్షణమునందు - అందముగమోహినై యచటికివచ్చి
అసురులకేటించి అమృతంబుయపుడు - సురలకుయిచ్చెను చోద్యంబుగాను.

**End :**

క. దానవు లమృతముద్రావం - బూనిపయోరాశి దరచిపొగలినమాడ్కిన్
శ్రీనాథుపరాఙ్ముఖులగు - హీనులుపొందంగఁజాల రిష్టార్థములన్.

క. శోధించె జలమునమృతము - సాధించి నిలింపవైరి చక్షుర్గతులన్
బాధించి సురలకిడెహరి - బోధించి ఖగేంద్రు నెక్కి పోయెన రేంద్రా.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు.

గొల్లలు పిదికినపాలే క్షీరసముద్రముకాఁగా దానిని దేవాసురులు మథనముచేయుట, అందు అమృతము ఉద్భవించుట అను కథ యిందు వర్ణితము. గొల్ల కలాపము గొల్ల వేష కథ అను పేరఁగల యక్షగానరచనలలో నిది యొకటి. పాలుపెరుగులను మథించి గొల్లపడుచు చల్లచేసి విక్రయించుట క్షీరసముద్ర మథనముచేసి అమృతముఁబుట్టించి మోహిని పంచిపెట్టుట పోల్కిగాఁగానఁబడును. గ్రంథకర్త పేరిందుఁగానరాదు.

ఇందలి గ్రంథాంతరములు.

1*a* గొల్లవేష కథ, 43*a* సంకీర్ణగేయములు.

---

## No. 1947. సముద్రమథనము.

### SAMUDRAMATHANAMU.

**Substance, palm-leaf. Size, 16⅜ × 1¼ inches. Pages, 18. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.**

Begins on fol. 15 *a*. The other work herein is-Gollavēṣakatha 1 *a*.

Incomplete.

Similar to the work described under No. 1946 ante. But this is written in Dvipada and does not contain songs (daruvulu). Timmaya of Ātrēyapuram is supposed to be the author.

**Beginning :**

తే. కప్పురపుపల్కులాఁకకొన్నిగల్పినట్లు - పరిమళించెడి మాచల్లధరణిలోన
విదితముగఁజుట్టు విధముచెప్పెదను వినవె - యంతకంతకు భాగవతార్థముగను.

ద్విపద.

శ్రీకనత్కనకచిత్రిత రత్నకాండ - చాకచక్యోజ్జ్వలత్స భనిభ కామ
ధేనువుల్నందినీ ధేనువుల్లేచ - రీ నిర్జరీకిన్నరీ నాగకీను
రుద్రులపంచక మునర్ణవనదీనదము - లద్రులహర్నిశ లాసంధ్యపృథ్వి
యప్పులుతేజో నిలాకాశములును - దశ్వకమూర్తివంతంబులై కొలువ
హితప్రరోహిత సమాహితచిత్తగుణులు - జతజయంతుఁడు దేవసంఘముతొసఁగ
నిచ్ఛావిహారార్థ మింద్రుఁడావేళ - స్వచ్ఛమౌ గుజరాతిజాతిరత్నాల
బాహుపురుల్ బాజుబందులుగట్టి - మోహనమాలిక ముత్యాలపేరు
నింద్రనీలపుపేరు లెన్నికరైన - చంద్రహారాలు వజ్రపుపల్కసరులు

కెంపుఠావచ్చల కీలుకడాలు - తంపివేసినపైఁడి తగటుకటారి
మగరాల్కిరీటము మణికుండలములు - వగతోఁజరీశాలు వలెవాటువేసి
సొగసుగాఁబచ్చి కస్తురిబొట్టుపెట్టి - వేగము(గ) నొకచేతవేత్రంబుఁబట్టి
కొలువునవింతగాఁ గూర్చున్నయెడకు - నేఁడిమిఁదా దూర్వాసుఁడేతేర.

**End :**

ద్విపద.

అది లయకాలఫాలాక్షశతము - తదవసరాగ్ని శతద్యమత
వేత్రాగ్రముగు పగల్వాలుఁగులరేని - లక్షలరీతి దుర్లక్ష్యంబునగుచుఁ
దుదిరేయిరేఁగిన తోల్కారొగిల్ల - రొదఁబడు పిడుగులట్లద్భుదర్బుదముల
కాజీవపంచ మహాభూతములును - దేజోమయంబైన తీరునఁబెటిలి
గభగుభ చిటచిట పొగమిడుంగురులు - భగభగ మంటులేర్పడఁగల్కి కాండ
దిగుచోట జనియించి తీవ్రకీలలును - దెరగప్పినిట్లు దిగ్దేశదేశములు
వడవడవడఁక దేవవ్రజాసురలు - ముడివడ . . . . .

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు.

ఇది నెం 1946 రున వర్ణితయిన గ్రంథమును బోలినదే. ఇందు భాగవతమందలి సముద్రమథన కథాభాగము ద్విపదరచనమును గూర్పఁబడినది. ఇది నెం 1946 రున వర్ణితమగు గ్రంథమున నున్నట్లిందు దరువులు లేవు. గొల్లవేష కథతో దీనికి సంబంధముగలదు. ఇది బహుశః అత్రేయపురపు తిమ్మయ రచియించినది యగును.

ఇందలి గ్రంథాంతరము

1a గొల్లవేష కథ.

---

## No. 1948. సముద్రమథనము.

## SAMUDRAMATHANAMU.

Substance, paper. Size, 11¾ × 8¼ inches. Pages, 15. Lines, 27 on a page. Character, Telugu. Condition, fair. Appearance, not old. Mode of writing, good but full of mistakes.

Begins on fol. 263 *a* of the Ms. described under No. 1861 ante.

Incomplete.

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. తుద పట్టు కొంత కొఱఁతగా నున్నది. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వము వలె.

ఇందలి గ్రంథాంతములకు నెం. 1861 చూచునది.

## No. 1949. సముద్రమథనము.

## SAMUDRAMATHANAMU.

Substance, palm-leaf. Size, 16⅝ × 1½ inches. Pages, 43. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but too full of mistakes.

Begins on fol. 15a.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులు హెచ్చు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

---

## No. 1950. సముద్రమథనము.

## SAMUDRAMATHANAMU.

Substance, palm-leaf. Size, 12½ × 1½ inches. Pages, 22. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair, but full of mistakes.

Begins on fol. 8b. of the Ms. described under No. 1946.

Incomplete. Leaves 9, 10, 11, 12 & 15 are wanting.

The churning of the ocean of milk by Dēvas and Asuras is described herein. The name of the author is not found in this.

**Beginning :**

స్రగ్ధర. శ్రీమద్వాగీశ మీశం త్రి జగదవిలస త్కల్పభూజం వృషాంకం
నామస్తుత్యైక దేవాద్యఖిలవృజినవిచ్ఛేదదక్షం శుభాక్షమ్
భీమం భీమాట్టహాసం వరదమఖిల వేందూజ్జ్వలాకారదేహం
శ్యామాంభోవాహ కంఠచ్ఛవిమనిశమహం రాజలింగం భజామి.

* * * *

మ. విను మున్నేటికిదర్పపాలకడలి న్విష్ణుండు కూర్మాకృతిన్
వసధింజొచ్చి యదెట్లు మోసె బలుకవ్వంబైన శైలంబు దే
వనికాయం బమృతంబునెట్లు వడసెన్ వారాశి నేమేమి సం
జనితంబయ్యె మునీంద్ర చోద్యముగదా సర్వంబుఁ జెప్పంగదే.

వ. అనిపల్కి— కొల్వుకూటంబున నసుర నికర పరివృతుండై నఖిలలోకరాజ్యలక్ష్మీ సమేతుండై యఖిల విబుధవిజయాహంకారనిజాలంకారుండై సుఖంబున్న విరోచననం

వనుంగని శచీవిభుండు పరమసుచిత్రుండునుంబోలె సాంత్వనవచనంబుల శాంతిం బొం
దించె.

. . . . . . . . . . .

క. ఎడమ కుడిముసుపు దిరుగును - గుడినెడముల వెనుకఁ దిరుగుఁ గులగిరి కడలిక్
కడలెడల సురలు నసురలుఁ - దొడితొడి ఫణిగుణము మొదలు తుదియును దిగు
వక్.

దరువు॥ ఎడమా కుడిముసుపూ దిరుగూనమ్మా యా మందరాద్రి
కుడియెడమా వెనుకా దిరుగూనమ్మా॥ ఎడ॥
వడిగాని కులగిరి నుడివడి దిరుగఁగ
బెడిదపురవమునఁ బుడమి వడంకఁగ॥ ఎడ॥
సారసమునకై క్షీరసాగరము
కోరికతో సుర లసురలు తరువఁగ॥ ఎడ॥

. . . . . . . . . .

**End :**

క. ఒఱపగు సురపున్నఁ బిఱుఁదను - నెఱితోఁ గేయు ముఖముసిరియు నిర్మలజరముల్
కుఱుచ చెవులుఁ దెలిగన్నులు - తఱుచగు నందంబుతోడఁ దగునా హరికిన్.

వ. అంతనా పాలకుప్పయందు.

క. దంతచతుష్టాహతిశై-లాంతంబులు వితెగిపడఁగ నవధూతకు భృ
త్యాంతంబగు నైరావత - దంతావళముద్భవించె ధరణీనాథా !.

(వి.వి.)—

అసమగ్రము. గ్రంథపాతములు చాలఁ గలవు. 9, 10, 11, 12, 15 ఆకులు పోయినవి. వ్రాఁత తిన్ననిదే. తప్పులు హెచ్చు.

దేవాసురులు క్షీరసాగరమును మథించు కథ యిందు వర్ణితము. కర్త పేరిందుఁ గానరాదు.

ఇది నెం 1946 రున వర్ణితమయిన గ్రంథమును బోలినదే.

---

## No. 1951, సవతులకయ్యము.

## SAVATULAKAYYAMU.

Substance, palm-leaf. Size, 15¼ × 3¼ inches. Pages, 15. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, not bad but full of mistakes.

Begins on fol. 18 a. The other works herein are. Rukmiṇīvēṣa-katha 1a, Jalakrīda 8b. Erukulavēṣakatha 31a.

Complete.

The quarrel common between two co-wives (Rukmiṇi and Satyabhāma) is described herein. The name of the author is not known.

**Beginning:**

నీకంటెన్ నెనరాత్మ నాకుఁ గలదా నిక్కంబు లెల్లప్పుడున్
రాకాపూర్ణశశాంకబింబవదనా రామామణీబాలికా
ఓ కంజాక్షిరో మన్మథుండెటులు పై నోర్వంగనుం జాలఁడే
కాకీశోకిలచందమాయెఁగదవే కాంతా మన స్నేహముల్ !

* * * *

పణఁతి రుక్మిణి సత్యభామను జూచి
చిడిముడిపాటుతోఁ జెయ్యెత్తి పిలిచి
ఓసి నా ముందఱ నోడక నిలిచి
వాసిగలదానివలె వదరెద వీవు !
కయ్యాన కిప్పుడు కాలుదువ్వుచును
మొగునిచేఁ గాళ్లకు మ్రొక్కించుకొనుచు
శాపనగొట్టువా సవతివా నీవు
నన్ను నిన్నునుజూడ నరులకే తెలుసు
పుడమిలో నెక్కడ పుట్టుట యెఱుఁగ
అనిన రుక్మిణిదేవి యాడుమాటలకు
విను సత్యభామ తా వెలఁది కిట్లనియె
మావరుస మాగుణము మా పెద్దతనము
చపలాక్షి నీతోడఁ జెప్పితినటవె
వచ్చె పాతరికత్తెవలెను వచ్చెదవు !

బి-బి.)—

అసమగ్రము.

**End :**

ఎన్నడూ సేవించలేదిత డెవ్వరే ఓ అక్కరో
తిన్నసీమా దీవికొండా చెన్నకృష్ణుడె చెల్లెలా !

* * * *

చెన్నుమీర చేతనంటు కున్నదేమే యక్కరో
వెన్నుడూ వెలయాపూరించే వేణునాదమె చెల్లెలా !
భుజములా మెరయూచున్నవియేమె అక్కరో
శరణంటే కాచేటి శంఖుచక్రమూలె చెల్లెలా !

ఎక్కువైనా సుందరూడూ ఉతఁడెవరే అక్కరో
చక్కనీ విడియాపూరి చెన్నకృష్ణుఁడె చెల్లెలా !
నీటుగా తొడలయందూ నీలమున్నదె యక్కరో
మానకలలెన ? శ్రీ లక్ష్మిఅమ్మవారెవో చెల్లెలా !

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

సవతుల (రుక్మిణి సత్యభామల) సంవాదమిందుఁ గలదు. కర్త తెలియఁగరాదు.

ఇందలి గ్రంథాంతరములివి :—

1a రుక్మిణీవేషకథ, 8b జలక్రీడ, 31a ఎరుకులవేషకథ.

---

## No. 1952. సవతులకయ్యము.

## SAVATULAKAYYAMU.

Substance, palm-leaf. Size, 16 × 1¼ inches. Pages, 11. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, not bad but full of mistakes.

Begins on fol. 15a. The other works herein are Rukminīvēṣakatha 1a, Jalakrīda 9 b.

Complete.

The dispute between Rukmini and Satyabhāma is described in this The name of the author is not known.

**Beginning :**

కాకః కృష్ణః పికః కృష్ణః
కో భేదః పికకాకయోః
వసంతకాలే సంప్రాప్తే
కాకః కాకః పికః పికః॥

. . . . . . . . .

ద్వి॥ పడతి రుక్మిణి సత్యభామను జూచి
చిడిముడిపాటుతోఁ జేయెత్తి పిలిచి
రూసి నాముందర నోడక నిలిచి
వాసిగలదానివలె వదరెద వీవు
కయ్యాని కిప్పుడు కాలుద్రవ్వుచును
మొగసి చేకాళ్లకు మ్రొక్కించుకొనుచు
కాపనగొట్టువా సవతివా నీవు
నన్ను నిన్నును జూడ నరులకే తెలియు

**End :**

మంచిదికానియ్యో రుక్మిణి
వేలుఁ ంచలేవు సత్యభామరో
తుంగాలు దూలాలౌనటే, ఓసి
పరిగడ్డివాసాలౌనటే, మా
ధవునిచెంతకు జేరనియ్యవేతాళు
తాళవేనను సద్దసేయవా
కొన్నాళ్లు నా పంచ నీగుచుపొంచు
యున్నదానవుగావ త్రాగుచు
గదిమితె నాగుండె లదరునా ఆదిమి
గదసి తాకిన కొండలదరునా॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

రుక్మిణీసత్యభామల సాపత్న్య వివాదమిందు ససిగా వర్ణింపఁబడినది. గ్రంథకర్త పేరెరుఁగరాదు.

ఇందలి గ్రంథాంతరములివి :—

1a రుక్మిణీవేషకథ, 9a జలక్రీడ.

---

## No. 1953 సాంబశివవిలాసము.

## SAMBAŚIVAVILĀSAMU.

**Substance, paper.** Size, 12¼ × 8 inches. Pages, 25. Lines, 21 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 180a of the ms. described under No. 1762 ante..

Complete.

The marriage of God Lakṣmaṇēśvara (Siva) with Ganga, the dispute between Ganga and Gauri, the two wives of Śiva and how Śiva settles their dispute form the theme of the work. Lakṣmanēśvaramu is a village at the meeting of Vasiṣṭha, a branch of river Godavari, with the sea.

**Beginning :**

శ్రీలు మెఱయఁగ భక్తజనపరి
పాలుఁ డనఁదగు పట్టిసాచల
మేలుసామిని భద్రకాళి లోలుఁదలఁతుఁ

*　　*　　*　　*

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి నాచరింపంబూనిన సాంబశివవిలాసంబను సంగీతప్రబంధంబునకుం గథాక్రమం బెటువలెను.

ద్వి॥ . . . . . . . . . .

ఉన్న లక్ష్మణుకోర్కి నొనగూర్పఁ దలఁచి
వన్నె మీఱఁగ నందివాహనారూఢుఁ
డై వచ్చి యతనిఁ గృతార్థుఁ గావించి
యీ వసుంధర లక్ష్మణేశ్వరుం డనఁగఁ
జనువసిష్ఠాతీర సంగమప్రాంత
మున నొప్పు పట్టణంబునను శ్రీ లక్ష్మ
ణేశ్వరంబనఁగఁ బేరన్నికకెక్కి
శాశ్వతైశ్వర్య ప్రశస్తిమీఱంగ
* * * *
అని శంబుదుర్గాసమన్వితుండగుచు
ననురూపభోగంబు లందుచునుండె

**End :**

ఈలాగు కలహించు నిర్వురఁ జూచి
శ్రీ లక్ష్మణేశుండు చిరునవ్వునవ్వి
యేల వాదించెద రేలనాఁగలార
మీలోన మీకిట్లు మెఱమెఱల్ దగునె
ఒకచోటు జనియించి యొక్కనిఁ జెంది
యకట మీ రొద్దికరై యుండవలదె
అనుచు నిద్దరును గాఢాలింగనమున
* * * *
తప్పక గంగను దలయందు నిలిపి
యప్పుడు గౌరికి నర్ధాంగ మొసఁగి
యొలమితో నర్ధనారీశ్వరవేష
మలరారఁ గ్రీడించె నాశ్చర్యలీల
* * * *

వ. ఇట్లు లీలావినోదపరాయణుండైన సాంబశివు నెదుట రంభాదికాంతలు వినోదంబున నృత్యంబులు సలిపిరందు నవతాళకు యెటువంటిది.

గోపీ కాంభోది.

తానెల్లా దధిమిధిమికి తక్క తకుందధికిటతక్క॥ తానెల్లా॥
వారణదనుజనివారణ మోహకారణ
హాలాహలవిదారణ తక్కతం తందానతందాన

తంధనా హరినందనా తనుభూతిచందనా
పావనము నీకృప భావనా నందివాహనా
విలసితపావనా॥ తానె॥

*　　　*　　　*　　　*

గీ. గౌరికిని గామవైరికిఁ గలహ మొకటి - తారసిలఁజేసి యంతటఁ దనివిసనక
గంగనెనకొల్పి గౌరిపైఁ గవయఁజేతు - ననుతలంపున నారదుం డతిరయమునన్.

వ. గంగ సమీపంబునకు వచ్చుచు.

. . . . . . . . . . .

నిను నిల్లు మోహంబు నిధిపాలుచేసి
చనివయామాయల జంగంబు తెలఁగు
తెలుపవచ్చితి నీకుఁ జేటుతెల్లముగ
లలనరో యాతండు లక్ష్మణేశ్వరుఁడు
కపటవేషమున నీకడ విహరించి
ఇపుడలచోటను హిమగిరికన్యఁ
దవిలియున్నాఁడు నిక్క దలఁపఁడింతైన
నవుఁగాని యో యమ్మ యతఁడేమిసేయు
నాగౌరిమాట గా దనఁగ శక్యంబె
యా గర్వమేమని యనవచ్చుఁ దనకు
నెనవచ్చు వనితలే యెల్లలోకముల
ననుచుఁ గేరుచుఁ బిగ్గెలాడుచునుండు
నదిగాన నీవిపు డచటికి నేఁగి
మదిరాక్షి గర్వంబు మాన్పి నీ ప్రియుని
వేగమే వశముగావించుకొమ్మింక
జాగు వద్దని చెప్పి చనియె నా తపసి

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు. మదరాసు జర్నల్ 30 వ సంచిక 71 పుటలో 'టౌలస్' వ్రాసిన యీ గ్రంథచరిత్రకలదనియు, ఈ ప్రతి 1842 వ సం॥ జూలై 8 వ తేదిని ముగిసినదనియు, బ్రౌనుదొరగారు పెన్సిలుతో ఎడనెడ వ్రాసిరి.

లక్ష్మణేశ్వరస్వామియను పేరఁ బరగిన శివుఁడు గంగనువలచి వివాహమాడుటయు, గంగాగౌరుల సవతిపోరాటమును శివుఁడు వారల సమాధానపరుచుటయు, నీ యక్షగాన మందలి కథ. వశిష్ఠాసాగరసంగమప్రాంతమునఁగల లక్ష్మణేశ్వరమను గ్రామమున వెలసిన

లక్ష్మణేశ్వరస్వామి యీతత్ప్రతినాయకుఁడు. పశ్చిమ గోదావరీ నదిపాయలలోనొక్కటి లక్ష్మణస్వామికోర్కె దీర్పవచ్చినవాఁడు గాన యా స్వామికి లక్ష్మణేశ్వరుఁడని పేరయ్యె నట.

ఇందలి గ్రంథాంతరమును శ 1762 రున జూచునది.

---

## No. 1954. సాంబశివ విలాసము.

## SAMBAŚIVA VILASAMU.

Substance, palm-leaf. Size, 16¼ × 1⅜ inches. Pages, 41. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

గ్రంథాంతరమందివ్రాఁతగలదు :—

"సాంబశివ విలాసం సంపూర్ణంగా వైదికుక్కల నల్లయ్య వ్రాసెను."

---

## No. 1955. సత్రాజితీ పరిణయము.

## SATRĀJITĪ PARIṆAYAMU

Substance, palm-leaf. Size, 10⅜ × 1⅜ inches. Pages, 26. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, not good and not free from mistakes.

Incomplete.

The marriage of Sri Kṛṣṇa with Satrājiti is described in this. The name of the author is not known.

**Beginning:**

ద్విపద.

జలజాక్షి వినవెనా జన్మదేశంబు-నయమైన ద్వారకా నగరంబునందు

దయశాలి గలఁడు సత్రాజిత్తుడనఁగ - నతనికి వరపుత్రినైయుండు నేను

అతిభక్తి సూర్యునియందు మా తండ్రి - నిరతుఁడై నడవంగ నెమ్మి సూర్యుండు

వర శమంతకమణివరదుఁడై యిచ్చె.

**End:**

అపునయ్య ! శ్రీకృష్ణ ! అవతారమూర్తి - దశమన్మథాకార నవనీతచోర
నను కాల నమ్మించి ననువిడనాడి - దానితోఁ గూడుండఁదగునయ్య నీకు
పదివేల వనితల భ్రమతలఁ జెంది.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది గాదు. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

సాత్రాజితిని శ్రీకృష్ణుఁడు పెండ్లియాడు కథయిందు వర్ణితము. కర్తపేరెఱుఁగ రాదు.

---

## No. 1956. సారంగధర నాటకము.

## SĀRANGADHARA NĀṬAKAMU.

Substance, paper. Size, $11\frac{3}{4} \times 8\frac{1}{4}$ inches. Pages, 41. Lines, 30 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 114 (*a*) of the ms. described under No. 1847 ante. Complete.

The well-known story of Sārangadhara is described in this. One Subbarāyadu, son of Venkataramayya of Haritasagotra is the author.

**Beginning :**

ద్విపద. శ్రీరమానాథు నిక్షేపకందరుని - సారెకు నుతియించి సారంగధరుని
చారిత్రమంతయు సరినాటకముగఁ - గోరెనే వినిపింతు ధారుణిలోన.

వ. అని తన కథిష్టపర వరప్రముఖులైన గణనాయక వెంకటేశ్వరుల నేమని వర్ణింపుచున్నాఁడు.

నాటురాగం॥ దర్వు.

శరణుశరణు సురేంద్రవందిత - శరణు శ్రీహరివందితా
శరణు పార్వతి తనయ నీకును - శరణు శ్రీగణనాయకా
వేదశాస్త్రపురాణ భరతము - వివిధనాటకములకునూ
ఆదిగాగల విద్యలకు గురు - వౌదు శ్రీగణనాయకా॥ శరణు.
మొన్న గలప్రహ్లాదముఖ్యులు - మేలమితో మిము గొలువగా
విన్నపము వినవయ్య శ్రీహరి వెంకటాచలవల్లభా॥ శరణు.

. . . . . . . . . . .

వ. అనిన యివ్విధంబున గణనాయక వెంకటేశ్వరులనుతియించి ఆదిమహాకవుల దలంచి నా నేర్చుతెరంగునసే కావించు నీ సారంగధరుని నాటకంబునకు కథాక్రమం బెట్టిదనినా.

ద్విపద. రాజిల్లు తన నగరంబులోపలను - రాజనరేంద్రుండు రాజులుకొల్వ

. . . . . . . . . . . . . . . .

నా యడచెయికాళ్లు నపుడు తియ్యగను - మాయమై శిద్ధులు మతియందువచ్చి

. . . . . . . . . . . . . . . .

కని యిట్టి కథనాటకంబుగా నేను - వినుపింతు భువిలోను విఖ్యాతిగాను.

వ. అపుడా సమయంబున యేలాగంటె ఆయొక్క రాజమహేంద్రపురి పట్టణమందు వుండేటి క్షత్రియ వంశంబులోన శంతనమహారాజు, ఆ శంతన మహారాజు గర్భసుధాకరుడు చిత్రవిచిత్ర మహారాజు . . . . . . రాజనరేంద్రుని గర్భసుధాకరుడు చక్కని సారంగధరుడు, ఆ సారంగధరుని చరిత్రంబు నాటకంబుగా వినుపిస్తున్నాను, యీ సభలోవుండే మహానుభావులెల్లా, తప్పులుండినగాని వొప్పుకుని చూడ నవధరించరయాసభా.

ఆ సమయంబున రాజనరేంద్రుని ఆస్థానంబునకు పిన్న, పెద్దలైన కోలగీతడొచ్చి మార్గంబెట్టువలెను.

ద్విపద. పట్టైనామము బెట్టు భాగుగారగను

. . . . . . . .

కట్టికకువాడొచ్చె కడు వేడ్కతోను.

దరువు. . . . . . . . . .

వ. హాహా రారా వోరియన్న కోలగీత యెక్కడానుంచి యెక్కడికి వచ్చినావు చెప్పరావోరి, అయితె చెప్పెనుగాని మీరెవ్వరోయీ, మేము విద్వాంసులుకాదటరా, చీచీ నిత్యావస్థువైతె మీ మొఖమె చూడరాదు, పోరోయి మేము భాగవతులు కాదటరా, అయితె కాస్త తిరగండిచూతాము, యెందుకురావోరి, కోతులంటిరె తోక వున్నందో లేదో చూతామునాని, ఛీ భ్రష్టా అదేమిమాటలు నీవు యెందుకువచ్చినావు చెప్పరావోరి, ఆయొక్క రాజనరేంద్రుండు కొలువుకు వస్తున్నాడని కొలువుకూటం చేయించవస్తినో యన్నా

**End :**

మంగళం.

జయమంగళం నిత్యశుభమంగళం.

సుంగళము శృంగార మహేంద్రనిలయునకు

మంగళం కరుణాంత రంగునకును
మంగళం బహుకీర్తి సంగరోజ్జ్వలునకును
మంగళం మకుటోత్త మాంగునకును॥ జయ॥
రాజవంశాగ్రణికి రాజీవనేత్రునకు
రాజనరేంద్రునికి రాజమణికి
తేజరిల్లు రత్నాంగి దేవితోడను గూడి
భూజనంబుల బ్రోచు భూమిపతికి॥ జయ॥

*　　　*　　　*　　　*

**Colophon :**

ద్విపద.

అనిత్రిలోకేశు గంగాధరుపేర - వనజాక్షుసఖుపేర వరదునిపేర
నందివాహనుపేర నలినా(శా)క్షుపేర - బృందారి రక్షకు భీమేశుపేర
బరగునంకితముగా భావించి దీని - కరమొప్ప గాజూడ కడుసంభ్రమముగను
అరియ హరితస గోత్రోద్భవుడైన - రయ వెంకట్రామతనయుడు అంత
సురచిరముగనంతు సుబ్బరాయుడునూ - విరచించినాడనే వేడ్కతోడుతను
సాటిలేనట్టి యీ సారంగధరుని - పేటిచరిత్రంబు నాటకంబుగను
మనమున సంతోష మహిమలుప్పొంగ - వినిపించినాడను విఖ్యాతిగాను
యీ నాటకముబాడ రొప్పారాడినాను - ఆ నీలకంఠుండు అఖిలపరంబు
లొసగును మరియు భూలోకంబునందు - పొసగిన యీ కథ పొలుపొందు
[చుండు.

(వి.వి.).—

సమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పులు గలవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

ప్రసిద్ధమైన సారంగధరోపాఖ్యాన కథ యిందు వర్ణితమయినది. హరితసగోత్రుండును వేంకటరామయ్య కుమారుండును నగు సుబ్బరాయండు దీనికిం గర్త.

ఇందలి గ్రంథాంతరములకు నై 1847 రు చూచునది.

## No. 1957. సారంగధర నాటకము.

## SĀRANGADHARA NĀTAKAMU.

Substance, palm-leaf. Size, $16\frac{3}{4} \times 1\frac{5}{8}$ inches. Pages, 84. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete.

Same work as the above.

(బి-బి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు చాల హెచ్చు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

గ్రంథాంతమందీవ్రాఁత గలదు—

"విరోధినామ సంవత్సర శ్రావణ శు॥ 15 శనివారం పుదుచెరలో ఈ సారంగనాటకం సంపూర్ణంగా మాజేటి సర్వేశలింగం వ్రాసుకొన్నాను."

---

## No. 1958. సీతాకళ్యాణము.

## SITAKALYĀNAMU.

Substance, paper. Size, 8 × 6½ inches. Pages, 62. Lines, 17 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 97 a. The other work herein is Sunandapariṇayamu 1 a.

Complete.

The story of Ramayana up to the marriage of Sita is described in this. The story concludes with coronation of Sri Rama soon after the marriage. One, Rāmana of Agastyagotra, son of Cennamantri and Akkamāmba, is the author. He offers prayers to god Madanagopala, worshipped at Pāmuru in Nellore district.

**Beginning :**

సీ. శ్రీ చెలువమరునంచిత సూర్యవంశాబ్ధి – చంద్రుండై దశరథ జనపతికిని
కౌసల్యకును శుభకలితుండై జనియించి – కౌశికమౌని యాగంబుగాచి
సర్వజ్ఞు విల్లువిరిచి జనకుని మెప్పించి – సీతను పరిణయించి చెలువుగాంచి
పరశురాముని భంగపఱచి యయోధ్యకు – మరలనేతెంచి సమ్మదముగాంచి
సీతతోఁగూడఁ బట్టాభిషేకమంది – వెలసి నిలిచిన శ్రీ మహావిష్ణుమూర్తి
చారుతరకీర్తి శ్రీరామచంద్రుఁ డెపుడు – సిరులు దయచేసి మమ్ము రక్షించుగాఁత.

* * * *

వ. అని యిష్టదేవతాప్రార్థనంబుచేసి కవీశ్వరుండు కృతినాయకుండైన శ్రీరామచంద్రులకు షష్ఠ్యంతములు చెప్పినట్టు యెటువలెను.

జంపె. రవిచంద్రనేత్రునకు రమ్యశుభగాత్రునకు
భువనైకగణ్యునకు మునిశరణ్యునకు

* * * *

పామూరి మదనగోపాలుఁడై భక్తులకుఁ
గామితము లొసఁగు శ్రీరామచంద్రులకు.

ఏ. సమర్పితంబుగా నా యొనర్పంబూనిన సీతాకల్యాణంబను యక్షగానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**End :**

మంగళహారతి.

జయమంగళం సదా శుభమంగళం॥ జయ॥
ధరునకు వనధిగం భిరునకు దుష్టసం
హారునకు ఘనమణీ హారునకుసూ
హారకర్పూర నీ హారహీరపటీర
తారాళికీర్తి వి స్తారునకుసూ॥ జయ॥

* * * *

జైత్రునకు సౌమిత్రి మిత్రునకు భక్తపవ
చైత్రునకు నవపద్మ నేత్రునకునూ
మిత్రవంశాబ్ధి స న్మిత్రునకు సురవినుతి
పాత్రునకు జగదవన సూత్రునకును॥ జయ॥

**Colophon :**

ద్విపద॥ అనుచు సీతాహృదయాప్తునిపేర – దినకరకోటి ప్రదీప్తునిపేర
తారకబ్రహ్మమై తనభక్తజనులఁ – జేరి రక్షించిన శ్రీరామచంద్ర
దేవునిపేరఁ దద్దివ్యపదాబ్జ – భావనామృతమునఁ బ్రబలినసుకవి
సరసుఁడగస్త్య రాజాన్వయచెన్న – వరమంత్రికక్కమాంబకు సుపుత్రుండు
రామన భక్తితో రచియించె సకల – కామిత ఫలములుఁగలుగ నీ యక్ష
గానము సఫల విఖ్యాతమై శ్రీలరా ? – నా నరచంద్రతారార్కమై వెలయ.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

రామాయణకథ సీతాకళ్యాణ పర్యంతము నిందు వర్ణింపఁబడినది. కళ్యాణానంతరము నిర్విఘ్నముగా పట్టాభిషేకము తోడనే జరగినట్లిందు గాననగును. అక్కమాంబా చెన్నమంత్రుల కుమారుడును అగస్త్యగోత్రుఁడును, నగు రామనయే తద్గ్రంథ కర్త. పామూరి మదనగోపాలస్వామి నీ కవి స్తుతించెను. పామూరు నెల్లూరు మండలమునఁ గలదు.

ఇందలి గ్రంథాంతము :—

1a. సునందా పరిణయము.

---

## No. 1959. సీతాకళ్యాణము.
## SĪTĀKALYĀṆAMU.

Substance, palm-leaf. Size, 9⅞ × 1¼ inches. Pages, 102. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete

Same work as the above

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

గ్రంథాంతమం దీవ్రాంత గలదు—

" విరోధినామ సంవత్సర భాద్రపద శు॥ 11 సౌమ్యవారంవరకు తిరుమలరాజా నారసింహ రాజు అన్నగారికి ఈ గోవిందరాజు సీతాకళ్యాణం సంపూర్ణంగా వ్రాసి యిచ్చెను."

---

## No. 1960. సీమంతినీ విజయము.
## SĪMANTINĪ VIJAYAMU.

Substance, palm-leaf. Size, 16⅝ × 1⅝ inches, Pages, 56. Lines, 4, 5 on a page. Character, Telugu. Condition, good Appearance, not old. Mode of writing, good but not quite from mistakes.

Incomplete.

The story of Candrāngada, which is an illustration of the greatness of the ceremony to be observed on Monday, is described in this. The author is Virabhadra Kavi and the work is dedicated to god Campakeśvara at Āraṇi

**Beginning :**

ఉ. శ్రీనగజాపుఁ డీశ్వరుఁడు చిన్మయుఁ డిందు కళాధరుం డుమా
జానిసహాక్షవాహుఁడు గజాసురమర్దనుఁ డష్టమూర్తి స
న్మానిజనప్రియుండు జితమన్మథుఁడవ్యయుఁ డభ్రకుంతలుం
డే నొనరించు పూజలకు నిచ్చను మెచ్చి ప్రసన్నుఁడయ్యెడుఞ్.

* * * *

వ. అని కవీశ్వరుండు చంపకేశ్వరస్వామి నివాసంబైన యారణీపురపట్టంబేమని వర్ణించుచున్నాఁడు.

జంపె॥ సూరిజనబంధురము సురరాజపురనిభము
చారుగోపురయుతము ఆరణీపురము,
శిఖిశుకాకులవనము సిరికిమహదాకరము
అఖిలసంపత్కరము ఆరణీపురము

*   *   *   *

క. ఏతద్గుణరాజిత ప్ర - ఖ్యాతుఁడౌ మేనమామ గర్భాంబుధిసం
జాతుఁడు శౌండాభిఖ్యుం - డాతరి ననుజూచిపలికె హర్షంబెసఁగన్.

సీ. మరకాణభూమీశ వరలబ్ధకవితాధు - రంధర వీరభద్రాభిధాన
బళిరమీముత్తాత పదగుంభనలఁజెప్పె - కన్నప్ప చరిత సత్కావ్యపుసొగసు
నిక్కంబు మీతాత నీలకంఠయదేవి - కీర్తవల్ రచియించి కీర్తిగాంచె
సంగతి మీతండ్రి లింగనాయఁడు చాల - సంగీతవిద్యల జాణయయ్యె.
గాన మాతండ్రితోఁబుట్టు కాకమాంబ - గర్భమునఁ బుట్టినాఁడవు ఘనుఁడవిపుడు
నీవు కృతిసేయ సీమంతినీచరిత్ర - చంపకేశ్వరు పేరఁ గావింపుమనిన.

తురుచ జంపె॥ చంద్రాంగదుని రాజ్యమందూ, నిలిపి
ఇంద్రసేనుఁడు శివునియందూ,
ఘననిష్టవహియించి సతిని, గూడి
వనమునకుఁ జనియందు శివునీ
పూజించికనె దివ్యపదము, అతని పొగడు
చుండెను రాజకులము.

వ. ఇట్లు బ్రహ్మనిష్ఠాగరిష్ఠవరిష్ఠుండైన యింద్రసేనుని పరోక్షానంతరంబున.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత బాగుగానున్నది. తప్పులంతగా లేవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

సోమవార వ్రతమాహాత్మ్య ప్రతిపాదకమయిన చంద్రాంగదచరిత్ర మిందు వర్ణితమయినది. వీరభద్రకవి గ్రంథకర్త. ఆరణిపురమున వెలసిన చంపకేశ్వరస్వామి కీ కృతి యర్పింపఁబడినది.

## No. 1961. సుగ్రీవ విజయము.

## SUGRĪVA VIJAYAMU.

Substance, paper. size, $11\frac{3}{4} \times 8$ inches. Pages, 36. Lines, 29 on a page Character, Telugu. Condition, slightly injured Appearance, old. Mode of writing, fair and free from mistakes.

Begins on fol. 325(*a*). of the MS. described under No. 1503 ante.

Complete.

The story of Sugriva getting back his wife and kingdom, found in Rāmāyana is described in this, and hence the title of the work. The author is Rudrakavi, son of Pedalinganarya of Kandukūru.

**Beginning :**

ఉ. శ్రీవిభుఁగొల్చి శంకరుభజించి చతుర్ముఖునెంచి వారిధి
గ్రావసుతాసరస్వతులఁ బ్రార్థనచేసి గణేశపాదపూ
జావిధి సల్పి దేశికులసంస్తవనంబొనరించి కావ్యవి
ద్యావిదులన్నుతించి కవితాజడుల న్నిరసించి వేడుకన్.

వ. అని కవీశ్వరుండు కృతీశ్వరుండగు......కందుకూరి జనార్థనస్వామి నేమని కొనియాడుచున్నాడు.

త్రిపుట. లలితగాత్రుఁడు శుభచరిత్రుఁడుం
దళితశత్రుఁడు సుజనమిత్రుఁడు
నళిననేత్రుఁడు కందుకూరి జనార్థనుండు.

* * * * *

వ. అని సన్నుతించి మఱియు నద్దేవతా సార్వభౌమునకు షష్ఠ్యంతంబులు రచియించెనఁట యెట్టులనెను.

అర్థ చంద్రికలు. చదువులదెచ్చిన జలచరపతికిన్

* * * * *

సర్వముఁదానగు చక్రాస్త్రునకున్.

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన సుగ్రీవ విజయంబను యక్షగానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

సీ. శ్రీరామచంద్రుండు సీతామహాదేవిఁ గాననంబున వెదకంగవచ్చి
పంపాసరోవర ప్రాంత్యభూములయందు సౌమిత్రియునుదాను సంచరింప
నావేళ సుగ్రీవుఁ డధికసంభ్రమముతో ఋష్యమూకమున వర్తింపుచుండి
చూచి యారఘునుల తేజోవిశేషంబుల వెఱగంది మంత్రికోవిదుల కనియె

వీరుమనలను బధియింప వేషమంది వాలిపంపునవచ్చిన వారుగాఁగ
నాకుఁ గాన్పింపుచున్నది గాకయున్నఁ జాపనులకేల శరచాపధారణంబు.

**End:**

ద్విపద * * * * *

మాతమ్ముఁడును మేము మాల్యవంతమునఁ బ్రతినుండెడుము సుగ్రీవనీవే
యీ నాల్గు నెలలును నెలమిఁ గిష్కింధలోనుండి వర్షంబులోఁ బడినపుడె
చనుదెమ్ము వానర సైన్యంబుతోడ ననవుడు సుగ్రీవు డతిభక్తితోడ
మను జేశు పాదపద్మములకు మ్రొక్కి యెనయఁ గిష్కింధకు నేతెంచి ప్రేమఁ
దారసమేతుఁడై తరుణీకృతోప చారంబులను వేడ్క సలుపుచునుండె॥
శ్రీభంగులు. ఇందిరావరునకు నిభభయహారునకు కందర్పగురునకు కల్యాణం.

* * * * *

**Colophon :**

ద్విపద.

అని సమస్తాసురారాతికదంబ వినమిత నిజభుజ విక్రమువేర

* * * * *

నిగమగోచరువేర నిఖిలలోకేశుఁడగు కందుకూరి జనార్దనువేర
సంకీర్తంబుగఁ గాళికాంబాప్రసాద సంకలిత కవిత్వ చాతుర్యధుర్య
తావర్య పెదలింగ నార్యతనూజ కోవిదస్తవనీయ గుణ రుద్రధీర
విరచిత సుగ్రీవ విజయాభిధాన కరుణభాసుర యక్షగానప్రబంధ
మాచక్రవాళశైలావనియందు నాచంద్ర తారార్కమై యొప్పుఁగాత.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులు లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.
ఈ ప్రతిలిపి లేఖనము 1842 వ సంవత్సరము జరిగినదట.

రామాయణ కిష్కింధాకాండారంభ కథాభాగమిందు వర్ణింపఁబడినది. ఇందు సుగ్రీవుఁడు కోల్పోయిన రాజ్యమును భార్యను బడయు కథ ప్రధానముగా గలదు గాన దీనికి సుగ్రీవ విజయమని పేరయ్యెను. కందుకూరి పెద లింగనార్య పుత్రుఁడగు రుద్రకవి దీనికిఁగర్త.

ఇందలి గ్రంథాంతరముల నై 1870 రుఁనఁ జూచునది.

---

## No. 1962. సుగ్రీవ విజయము.

### SUGRĪVA VIJAYAMU.

Substance, palm-leaf. Size, $16\frac{1}{4} \times 1\frac{3}{8}$ inches. Pages, 34. Lines, 5 on a page. Character, Telugu. Condition, fair Appearance, old. Mode of writing, good, but full of mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె. గ్రంథాంతమందు వ్రాఁతగలదు.—

విభవనామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ 2 గురువారంవరకు పైండిముక్కల పల్లయ్య.....వ్రాసెను.

---

## No. 1963. సుగ్రీవ విజయము.

### SUGRĪVA VIJAYAMU.

Substance, paper. Size, $9\frac{3}{8} \times 6\frac{1}{2}$ inches. Pages, 35. Lines, 19 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 276(*a*). The other works herein are Hariścandrōpākhyānamu 1(*a*). Mṛtyunjaya vilāsamu 196(*a*).

Complete.

(వి-వి.)—

సమగ్రము. పాఠభేదములు బంతులునడుమఁ జేర్పఁబడినవి. కొన్ని పాఠభేదము లెదిరి పుటలమీఁదఁ జేర్పఁబడినవి. వ్రాఁత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వము వలె.

ఇందలి గ్రంథాంతరములివి.

1 ఎ. హరిశ్చంద్రోపాఖ్యానము. 196 ఎ మృత్యుంజయ విలాసము.

---

## No. 1964. సుగ్రీవ విజయము.

### SUGRĪVA VIJAYAMU.

Substance, palm-leaf. Size, $12 + 1\frac{1}{4}$ inches. Pages, 40. Lines, 5 on a page. Character, Telugu Condition, slightly injured,. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. పుస్తకము కొంచెము శిథిలమైయున్నది. వ్రాత మంచిది. తప్పులుగలవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె.

---

## No. 1965. సుగ్రీవ విజయము.

### SUGRĪVA VIJAYAMU.

Substance, palm-leaf. Size, $8\frac{5}{8} \times 1$ inches. Pages, 52. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes

Begins on fol. 1(*a*) The other work herein is Kirātarjunīyamu 27(*a*).

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. తుది ద్విపద లేదు. వ్రాత బాగుగానున్నది. తప్పులు గలవు. శైథిల్యము గ్రంథపాతములును గలవు.

పూర్వము వోలె.

ఇందు గ్రంథాంతరముగలదు 27 ఎ కిరాతార్జునీయము.

---

## No. 1966. సుగ్రీవ విజయము.

### SUGRĪVA VIJAYAMU.

Substance, palm-leaf. size, $10\frac{1}{8} \times 1\frac{5}{8}$ inches Pages, 44. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు చాల హెచ్చు. 4, 5, 9, 13 సంఖ్యలతో నుండవలసిన యాకులను గ్రంథాంతమందలి యొకటి రెండాకులును పోయినవి.

పూర్వము వోలె,

---

## No. 1967. సుభద్రా వివాహము.

## SUBHADRĀ VIVĀHAMU.

Substance, Palm-leaf. Size, 11¼ × 1¼ inches. Pages, 40 Lines, 6 on a page. Charater, Telugu. Condition, injured. Appearnc, old Mode of writing, fair, but not free from mistakes

Begins on fol. 51(a). of the MS. described under No 1849 ante : wants a small portion in the beginning, otherwise complete.

The pilgrimage of Arjuna and his marriage with Subhadra are described in this Venkatādri, son of Timmāji is the author

. . . . . . శాలలున్నత గోపురములు
మేటిహజారముల్ మేలైనగుళ్లు తగునశ్వగజరథతతులకొల్బలము
లగణితంబగు గణికాంగనాజనము హరిపూజసేయు బ్రాహ్మణులు క్షత్రియులు
వరుసతో వైశ్యులవలన శూద్రులును కలిగి నానావస్తు కలితమైదిశల
వెలసినయాపురి వీకఁబాలించు పాండుతనూజుండు ప్రకటయశుండు.

* * * * *

పంజులకమ్మలు బవిరెలుముక్కెర రంజకమగు వజ్రాలకడెములుఁ
కంకణములు నుంగరములుగాజులు పొంకములగు నవభుజకీరుతులుఁ
సందిదండలును బందెలు నందెలు అందముగా నొడ్యాణము మెఱయఁ
కాళ్లకడెములు వేళ్లమెట్టెలుప్రోల తాళ్ల గెజ్జెలుమెడ సూళ్లగొలుసులుఁ
గౌశీసరంబులు కంఠమాలికలు రత్నాలవావిరి నవపదకములుఁ
ముంగామురములు మొగపులతిగయా బంగరుమించుల బన్నసరములుఁ
చెవులకుసుమములు చేర్చుక్కయుమఱి వివిధపు సొమ్ములు వెలదికిఁదొడిగి,

* * * * *

**End :**

అని భక్తజనమనోహరునిపేర తనుఁగొల్చు సురగణోద్ధారునిపేర

* * * * *

బాస్వత్కిరీట శోభాంచితుండైన నాస్వామి వెంకటనాథునిపేర
నంకితంబుగఁ జేసినట్టియాకృతియు నంకితోవెలయ నీయవనీస్థలమున
వెలఁగుచునుతికెక్కు శ్రీవత్సగోత్ర జలనిధిలో శశిజన్మించెననఁగ
నెలమితో జన్మించె నెక్కజమంత్రి యలవైష్ణవోత్తముండాచారపరుఁడు
అతనికి వరపుత్రుఁ డమితగుణాఢ్యుఁ డతులయశస్వంతుఁడై ధాత్రివెలసె
కరమొప్పుతిమ్మాజి గర్భసంభవుఁడ హరిభక్తుఁడను వేంకటాద్రనువాఁడ
భారతకథలో సుభద్రావివాహ మారూఢితోడ నాయకగానమును

(వి-వి.)—

సమగ్రము. కాని గ్రంథారంభ భాగము కొంతలేదు. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

ఇందు అర్జున తీర్థయాత్ర సుభద్రావివాహము వర్ణింపఁబడినవి. తిమ్మాజి కుమారుడగు వేంకటాద్రి గ్రంథకర్త. గ్రంథకర్తనుగూర్చి విశేషములు కుదాహృత గ్రంథభాగమును జూచునది.

ఇందలి గ్రంథాంతరములను నై 1849 పుటఁ జూచునది.

---

## No. 196. ఉషా పరిణయము.

## UṢĀ PARIṆAYAMU

**Substance, palm-leaf Size, 16½ × 1¼ inches Pages, 84. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old Mode of writing, bad and full of mistakes.**

Complete

Describes the story of Uṣā and Aniruddha One Srinivāsa of kāśyapa gotra is the author

**Beginning :**

మణిగణవలయ చరణమంజులనగోద్ధరణ ఘనఫణిఫణాశయన కౌస్తుభాభరణా

*    *    *    *    *

చ. వరమతిఁజూడ భాగవత పక్కణకుండలకట్టు అయుషా
పరిణయమన్న నిద్విజనపాలుడ బెట్టిరిటన్నఁ జెప్పెదర్
భరతకులావతంస వినుభానుడు యీ బలిచక్రవర్తికి

**End :**

బరువడి పెద్దపట్టి ఘనబాహు సహస్రుఁ డనంగవింటిరే.
వలనొప్పుచుండు దేవరనువంశమున నాశ్వలాయనసూత్రమమరినవాఁడ
శాశ్వతంబైన కాశ్యపగోత్రమందు ఘనుఁడు నారాయణ కమనీయమూర్తి.

*    *    *    *    *

లలితమై సౌభాగ్య లక్ష్మి లక్ష్మాంబ జలరుహపాణికి జనియించినాఁడ
శ్రీనివాసుఁడను లక్ష్మీనాథుఁడైన వేణుగోపాలభావిత. ... యతుండ.

*    *    *    *    *

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు.

" బహుధాన్య నామ సంవత్సర చైత్ర శుద్ధ 10 లు తక్నాటికరణం వీరరాఘవశ పిళ్ల వ్రాసిన ఉషా పరిణయం సంపూర్ణం ".

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులకుప్ప. శైథిల్యముగలదు. గ్రంథపాతములు గలవు.

నీరసమయిన ఈ రచనము ఉషా నిరుద్ధుల వివాహ కథను జెప్పునది. ఆశ్వలాయన సూత్రుఁడు కాశ్యపగోత్రుఁడునగు శ్రీనివాసుఁడు దీనికిఁగర్త.

## No. 1969. ఏకాంతసేవ.

## ĒKANTAŚĒVA.

Substance, palm-leaf. Size, 14½ × 1½ inches. Pages, 10 Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance old. Mode of writing, good and free from mistakes.

Begins on fol. 18a. The other works herein are Gollavēṣakatha 1a. Samudramathanamu 8a. Pavalimpusēva 14a. Grāmadēvatā dakndakamu 25(a, Rājarājēsvarı padyamulu 23(b).

Complete.

Similar to the work described under No. 1898.

Contains songs addressed to Venugopālaswāmi worshipped at Cocanada, the name of the author is not known

**Beginning :**

శా. శ్రీరామా రమణీమనోహర ప్రియా చిత్తంబు రంజిల్లఁగా
జేరంబిల్చి కుచంబులొత్తి యెదపై నేమంబుతో నుంచినా
నేరం బెన్నకు మింక నేలుకొనుమీ నెల్తల్నినుంబోలరే
భారం బేటికి నీకుఁ జూపఁగదవే భామా మనోహారిణీ ॥

దరువు. మేరగా దిటురాకు నీమొగ మెచ్చు మాటలు దెలునురా
జారచోరుల సఖ్యములు ఇఁకఁజాలురా వగలేలరా
వారిజాక్షులు నీదురాకకు వత్తు రెదురుగఁ జేరరా
కోరికలు సమకూడురా శ్రీగోపబాల మనోహరా ॥

సీ. శ్రీరుక్మిణీ సతీ చిత్తగింపుమునాదు విన్నప మొక్కి ంత వేడుకలర
వారిజాక్షుల పొందువదల కుండెడువాని కిక్కడఁ బని యేమి యదుకులేశ
నేరంబు లెన్నక నీదు కౌఁగిటఁజేర్చి మోహంబు దీర్చవే ముద్దుగుమ్మ
కూరిమితో నీవు కూడు జాంబవతిని మాటలేటికిఁ బోర మదన జనక
తగదు ఇప్పుడు నిటులాడఁ దరుణినీకుఁ గాల మొకరీతి నుండదు కమలనేత్రి
కరుణయుంచుము మామీఁదఁగాకినాడ వేణుగోపాల జరుగుమా వెలఁదికడకు ॥

శ్లో. అంగ నామంగ నామంతరే మాధవో మాధవం మాధవం చాంతరేణాంగనా
ఇత్థమా కల్పితే మండలే మధ్యగ స్సంజగౌ వేణునా దేవకీనందనః
కృష్ణామురారే । కేశవామురారే విష్ణో ముకుంద గో । వింద మురారే
కృష్ణానంద ముకుంద మురారే వామన మాధవ గోవిందా
శ్రీధర కేశవ రాఘవ విష్ణో లక్ష్మీనాయక నరసింహ ॥

**End :**

శా. రావే కోమలి మందయాన సకియా రాకేందు బింబాననా
నీవాక్యంబులు నమ్మివస్తి నిపుడు న్నీరేజపత్రేక్షణా
యీవేళ న్ననుఁగూడి సత్యవతి మా యిష్టంబులం దీర్చనీ
భావం బొక్కటిగాఁదలంతు మెప్పుమాకా భామా మనోహారిణీ ॥

దరువు. కోపమేటికి నీదురాకకుఁ గోరియుంటిని దానరా
యే । పాప మతు లిటుచేసిరో పగపాటులేల కృపానిధీ
రూపయుతుఁడవు కాకినాడను రూఢిగా వెలసుంటివా
మాపయిని దయయుంచి యేలుకో మదనమోహన రాయఁడా ॥

సీ. మగువ లక్షణ (నీదు) మాటలు వినఁగోరి వచ్చినాఁడను నాదు వాంఛ దీర్చు
శ్రీకృష్ణ యీవేళ జిన్నారి పదములు సేవించి ధన్యత చెందియుందుఁ
గరుణించి వేగ నీ కౌఁగిటఁజేర్చనఁ గోరికదీరునే కోమలాంగి
మదనమోహన రాయమందిరంబునకేగి పవళింపవయ్య యాపాన్పుమీఁద
చెలియరతి కేళిఁదేలితిఁ జెన్నుమీఱఁ గువలయంబున నీ తోడఁ గూడియుందు
కరుణయుంచుము నామీఁదఁ గాకినాడ వేణుగోపాల (పోకుమా) వెలఁదికడకు ॥

శ్లో. పారిజాతం సముద్ధృత్య రాధావరో రూపయామా సభాసాగుణై రంగణె
శీతశీతేవవేయా మునీయేతశే సంజగౌ వేణునా దేవకీ నందనః ॥
కృష్ణా మురారి ॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాతమంచిది. తప్పులు లేవు శైథిల్యము గ్రంథ పాతములు లేవు.

దేవాలయములందు, రాత్రి జరపు ఏకాంత సేవకుగాను కాకినాడలో వెలసిన వేణుగోపాలస్వామి పేర నీలఘుకృతి రచియింపబడినది. ఏకాంతసేవ అనీ తలుపు దగ్గఱి సంవాదము, అనీ, ఇట్టి రచనములకుఁబేరు. కర్తపేరిందు తెలియరాదు. ఒక వృత్తము, దరువు, సీసపద్యము, సంస్కృత శ్లోకము, అను వరుస నీ పద్యములు, శ్రీ కృష్ణుని యష్టమహిషుల పేర నిందుగలవు.

ఇందీ గ్రంథాంతరములుగలవు.

1-ఎ. గొల్లవేషకథ, 8-ఎ సముద్రమథనము, 14 పవళింపు సేవ, 25-ఎ గ్రామ దేవత దండకము, 28-బి రాజరాజేశ్వర పద్యములు

---

## No. 1970. గురునంబి చరిత్ర.

## GURUNAMBI CHARITRA.

Substance, paper. Size $12\frac{1}{4} \times 7\frac{5}{8}$ inches. Pages 32. Lines, 19 on a page' Character, Telugu. Condition, fair. Appearance, old, Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as that described under No. 1870.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత చక్కనిది. తప్పులు గలవు. అక్కడక్కడ చిన్న చిన్న గ్రంథపాతములు గలవు.

పూర్వము వలె.

---

## No. 1971. గొల్లవేష కథ.

## GOLLAVĒSA KATHA.

Substance, palm-leaf. Size, 16⅞ × 1¼ inches. Pages, 28. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured and worm eaten. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 1a. The other work herein is Samudramathanakatha (Yaksagānam) 15a.

Incomplete.

Same work as that described under No. 1877 ante with some variations.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత మంచిదేకాని తప్పులుగలవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె నౌ 1877 వర్ణితమగు నదేకాని కొంత కొంత భేదముగలదు.

ఇందలి గ్రంథాంతరములు.

15-ఎ సముద్రమథన కథ.

---

## No. 1972. అంకమ్మ దండకము.

## ANKAMMA DANḌAKAMU.

Substance, palm-leaf. Size, 16⅞ × 1¼ inches. Pages, 17. Lines, 4 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

A prayer addressed to the Goddess known as Ankamma, Banḍivīra-mahākāli, etc . who is believed to cause infectious diseases. The author is not known.

**Beginning :**

శ్రీరాజరాజేశ్వరీ దేవ త్రిలేశ్వరీ లోకరక్షాకరీ శాంకరీ శాంభవీ కాళీ మాయా జగద్భద్రదాయీ భవానీశ ధాత్రానుతా శేషశాయీ రమాభారతీంద్రాణి పూజా ప్రియాంఘ్రి ద్వయీ శ్యామలాంబా నమో భ్రామరాంబా నమో జాగదాంబా నతా శారదా—

**End :**

ఆ బాలవృద్ధాదులుం గూడి గ్రామోపకంఠంబు పర్యంత మామంత్రితుం జేతుమో యమ్మ ఓ కోర్ల అంకమ్మ నీపుండరీయాంభోధి వింకా కృపాదృష్టి వీక్షించి శీతాంఘ్రి ఘాతంబునకా మమ్ముదయచేసి రక్షించు ఓ బండి వీరా మహాంకాళి ఒ లోక మాతా మతంగాత్మ జాతా నమస్తే నమస్తే నమః ॥

(వి.వి )—

సమగ్రము. వ్రాతమంచిది. తప్పులున్నవి. శైధిల్యము లేదు. గ్రంథపాతము లు లేవు.

కోర్ల అంకమ్మ అనీ, బండి వీర మహాకాళియనీ పలుదెఱంగుల పేళ్లుగల సాంగ్రామిక వ్యాధ్యధిదేవత స్తుతి యిందలి విషయము. కర్త తెలియరాదు.

---

## No. 1973. అక్రూర దండకము.

## AKṚURA DANDAKAM.

Substance, palm-leaf. Size, $6\frac{1}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 10. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 16a. The other works herein are Ausadhayogasangrahamu 1a, Kṛṣṇadandakamu 21a, Nārayana 27a, Sabhā Satakamupatnirvocanamu 37a, Rukmininathadandakamu 46a, Śukarambhā Samvādamu 50b, Ramanama Ramayanamu 52a, Sivalingakirtanamu 57a.

Complete.

A passage found in the ninth Skandha of Bhāgavata by Bammera Pōtarāju.

(వి-వి.)—

సమగ్రము. వ్రాతతిన్ననిది. తప్పులున్నవి. శైధిల్యము. గ్రంథపాతములు గలవు.

బమ్మెర పోతరాజ కృతమగు భాగవతమునఁ దొమ్మిదవ స్కంధమునఁగల దండకమిది.

## No. 1974. అక్రూరదండకము.

## AKRŪRA DANḌAKAMU.

Substance, palm-leaf, Size, 12⅛ × 1 inches, Pages, 6. Lines, 4 on a page. Character, Telugu, Condition, injured, Appearance, old. Mode of writing, not good and full of mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

పూర్వము వారిది.

---

## No. 1975. అక్రూర దండకము.

## AKRURA DANDAKAM.

Substance, palm-leaf Size, 16½ × 1⅛ inches, Pages 4. Lines, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, not good and full of mistakes.

Begins on fol. 82a. The other works herein are Bhāskararamāyanamu 1a, Aṣṭadiggajamulu 48a, Saptāngalakṣaṇamu 49a, Venkateswaradandakamu 50a, Tārāvalidandakamu 52a, Rāmadanḍkamu 60a, Śyāmaladandakamu 75a, Bhadracalaramacūrṇika 80a.

Complete.

Same work as that described under No. 1973.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతమంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వము వారిది.

ఇందలి గ్రంథ్యాంతరములివి :—

భాస్కర రామాయణము 1-ఎ, 48-ఎ అష్టదిగ్గజములు, 49-ఎ సప్తాంగ లక్షణము, 50-ఎ వేంకటేశ్వర దండకము, 52-ఎ తారావళీ దండకము, 60-ఎ రామ దండకము, 75-ఎ శ్యామలా దండకము, 80-ఎ భద్రాచలరామ చూర్ణిక.

## No. 1976. కనకదుర్గ దండకము.

## KANAKADURGADANDAKAMU.

Substance, palm-leaf. Size, 10 × 1 inches. Pages, 4. Lines, 5 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good not free from mistakes.

Begins on fol. 6b. The other work herein is Śaktidaṇḍakamu 1 *a*. Complete.

Written in praise of Goddress Kanakadurga worshipped at Lakṣmipura, chiefly by Dēvānga community (weaver caste). The author is a Brahmin, by name Narasimha.

**Beginning :**

శ్రీ మన్మహాదేవి నారాయణీ శాంకరీ శాంభవీ దుర్గవారాహి శ్రీ వైష్ణవీ శాంభవీ దేవి నీభక్తి నీశక్తిచే నీశవాణీశ లక్ష్మీశులం బుట్టగా జేసి యాదిత్యులంగుట్టు దాలించగా గౌరివై వాణివై లక్ష్మివై

**End :**

దేవాంగులుం గొల్వ లక్ష్మీపురంబందు నీ మందిరంబొప్పగా గొప్పగా కనకదుర్గా మహాలక్ష్మి యీ దండకం చిన్న పూదండగా దాల్పవే దండముల్.............. నారసింహాఖ్యనీ దేవు చిత్తాబ్జ మందుంచి ముల్లోకముల్ బ్రోవవే శారదాంబా నమస్తే నమస్తే నమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాతమంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

లక్ష్మీపురమను గ్రామమున వెలసిన కనకదుర్గాదేవిమీద నారసింహుడను బ్రాహ్మణుడు దీని రచించెను. ఆదేవి నాయూర దేవాంగులు హెచ్చుగా గొల్చుచుందురట.

---

## No. 1977. కాళహస్తీశ్వర దండకము.

## KĀLAHASTIŚWARADANDAKAMU.

Substance, palm-leaf. Size, 12⅞ × 1¼ inches. Pages, 14. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing good, but not free from mistakes.

Begins on fol. 1a. The other work herein is Śivadaṇḍakamu 8 a. Complete.

The story is about a cortezan falling in love with Sri Kalahastisvara, who is made the hero, and winning her object inspite of her mother to whom she (cortezan) describes the greatness of Śiva. The author is Dhūrjaṭi, son of Pōlāmbikā and Viśvanātha.

**Beginning:**

శ్రీ మన్మహాదేవ దేవేంద్రముఖ్యామర గ్రామణీ పూజితాంఘ్రి ప్రవాళున్ బ్రహ్మాఖ్యాధ రోత్తంసహాసాంగు హాసాంగ.

* * * *

గృహీభూత వృష్యద్రిసాలున్ మహా కాళహస్తీశు జ్ఞానాంబికాధీశు నజ్ఞాన నాశం కవీంద్రుండు సాంద్రంబుగా భక్తి యుక్తుల్ ప్రకాశింపఁగా వాసి మించగ దానెంచి ధ్యానించి యాదండధారారిపై దండకంబున్ రచింపంగ సొంపగ్గలింపంగఁ దత్స్వామియం గంబునందున్.

**End:**

నీమీఁది హాళిన్ మనోజావళిన్ భీతయై యున్న నాకూతురిన్నీకు లోకేశ నీకున్ సమర్పించితిన్ నీకు ముమ్మాటికిన్నిచ్చితిన్ జంచలాక్షిం గటాక్షించి రక్షింపవేయంచుఁ బ్రార్థించినన్ బంచబాణారి నారీ శిరోరత్నమున్ రత్న సౌధంబులో మన్మథాయోధన క్రీడ వర్తించె.

* * * *

మాధురీ సాధురీతిన్ రచించెన్ బ్రియావల్లకీ భాతిఁ జేతోభవారాతిపై నూత్న శృంగార మీ దండకం బాంధ్ర భాషా కవిగ్రామణిన్ బుక్కయామాత్య నారాయణ శ్రీ సుధీమాధవాఖ్యావనీ దేవతా విశ్వనాథప్రథానేందుపోలాంబికా పుత్త్రుఁడున్ ధూర్జటి ప్రాఖ్యుఁడున్ జేసె ముఖ్యంబుగన్ మూఁడు లోకంబులన్ బోలి మిన్నైవ్వారైనన్ మెచ్చి వ్వటిల్లం బఠింపన్ వినన్ వ్రాసినన్నెల్ల పుణ్యంబులుం గల్గు నల్దిక్కులన్ శ్రేష్ఠమా చంద్ర తారార్కమై యొప్పునెల్లప్పుడున్ గాళహస్తీశ యీశా నమస్తే నమః

గ్రంథాంతమందిట్లు గలదు :—

“ విరోధినామ సంవత్సర భాద్రపద బ 2 సోమవారం మాజేటి సర్వేశ లింగం వ్రాసుకొనెను. ”

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఒకవార విలాసిని శ్రీ కాళహస్తీశ్వరుని వలచి విరాళి చెందుటయు, వేశ్యామాత, అవివేకుఁడగు నాతని మీఁదివలపు తగవుగాదని వారించుటయు, నాకూఁతురు తన్మహా

శ్యమును దల్లికిఁ దెలియఁజెప్పి యొప్పించి కృతార్థురాలగుటయునిందలికథ. వేశ్యామాత తనకూతురికి చేయు బోధలలో వారివంచనా రీతులు విశేషముగా వర్ణింపఁబడినవి. పోలాంబికా విశ్వనాథులకుమారుఁడగు ధూర్జటి యే తద్గ్రంథకర్త. విశ్వనాథ ప్రధానునికి, మాధవాఖ్యుఁడు, నారాయణసుధి, జక్కయామాత్యుఁడు, పితృ పితామహప్రపితామహులు.

ఇందలి గ్రంథాంతరము. 8 a. శివదండకము.

---

## No. 1978. కృష్ణ దండకము.

## KṚṢṆADAṆḌAKAMU.

Substance, palm-leaf. Size, 15½ × 1½ inches. Pages, 9. Lines, 7 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Describes how on a moon light night when Śri Kṛsna was playing on his flute, the Gopikas came out of their houses, being attracted by the music, and how Śri Kṛṣṇa gave them good advice. The author is not known.

**Beginning :**

శ్రీమద్రమాసుందరీ సుందరోరోజసందిష్ట కస్తూరి కాకర్దమ ప్రోల్లసద్వక్షుఁడ జ్ఞారి మిత్రాక్షుఁ డంభోజజాతుండు తండ ప్రచండోదరుండజుం డాదిమధ్యాంతశూన్యుం డగణ్యుం డ జేయుండవానుండు.

**End :**

గోవిందునింగాంచి దండప్రణామంబులంజేసి నిల్చున్న యయ్యింతులంగాంతుఁడీక్షించి యో చంద్రబింబాస్యలారా జిరే అత్తలన్ మామలన్ భ్రాతలం బుత్త్రులంబాసి యీ రాతిరి గండభేరుండ హర్యక్ష శార్దూల సాలావృకానేక హానేక దంష్ట్రిప్లవంగైక వాహ ద్విపద్వల్లిరుఖల్ల్ ప్రజాఖుద్విపత్పన్నగాఖిల దుర్వారకాంతార దేశంబులం దాంటి రాఁజెల్లునే యింతయుంగాక యీ పుష్పితానోక హవ్వాయలీ మందవాయు ప్రచారంబులీ చంద్రికా శీత భావంబులీ వేణువాద్యంత (వత్యంత) మత్తాళిరావంబులే వేళ కేమి గల్పించునో పచ్చవిల్తుఁడు కీరాశ్వరాజంబునే దిక్కు మమికించునో కేతకీ గర్భ పత్రాసి యేరికిన్ విలోకించునో అంతరంగంబు. ఓం నమస్తే నమస్తేనమః

గ్రంథాంతమందిట్లు గలదు :—

“ రాచర్ల వెంకటరామన్న కుమారుఁడు పేరాజు కృష్ణ దండకం సంపూర్ణంగా వ్రాశాను. ”

(వి-వి•)—

అసమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శ్రీ కృష్ణుఁడొక శరద్రాత్రిని వేణువూదుచుండఁగాఁ బరవశలై గోపికాస్త్రీలిండ్లు విడిచి తత్సన్నిధికి వచ్చుటయు, నందులకుఁ గృష్ణుఁడు వారిని మందలించుటయు నిందలి విషయము. కర్త పేరెఱుఁగరాదు.

## No. 1979. కృష్ణదండకము.

## KṚṢṆADANDAKAMU.

Substance, palm-leaf. Size, $6\frac{3}{8} \times 1\frac{1}{4}$ inches. Pages, 12. Lines, 6 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 21 a. of the ms. described under No. 1973 ante.

Complete.

Written in praise of Śri Kṛṣṇa- The autor is not known.

**Beginning:**

శ్రీమంత్రకూటాథ (శ్రీమత్త్రికూటాద్రి ?) నాథా (జగన్నాథ శ్రీకృష్ణవేణీ నదీతీర వర్తి, జగన్మోహనానందమూర్తీ. )

**End ;**

నిర్ముక్తునింగాఁ బ్రసాదంబు చాలం బ్రసా......రక్షించు త్రైలోక్యరక్షామణీ దుష్ట శిక్షామణీ భక్త చింతామణీ దేవ చూడామణీ దేవ శ్రీవల్ల......నమస్తే నమస్తేనమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము చాల హెచ్చు గ్రంథపాతములు తండోపతండములు.

ఈ ప్రశస్త దండకము శ్రీ కృష్ణస్తుత్యాత్మకము. మంత్రకూటము (మందెన?) లేక, త్రికూటాద్రి (కోటప్పకొండ ?) కడవెలసిన విష్ణుదేవుఁడిందు స్తుతింపఁబడెను. అతిశైథిల్యముకలన గ్రంథకర్తృ విషయాదికము గుర్తింప ననువు పడదయ్యె ;

ఇందలి గ్రంథాంతరములకు ' నె 1973 రు ' చూచునది.

## No. 1980. గణేశ్వర దండకము.

## GAṆEŚVARA DANDAKAMU.

Substance, palm-leaf. Size, $5\frac{3}{8} \times 1$ inches. Pages, 9. Lines, 4 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 4 a. The other works herein are—Gaṇapatyaṣṭōttara Śatanāmastōtramu 9 a, Vināyakapūja 13 a.

Complete.

A Daṇḍaka in praise of Ganapati by an unknown author.

**Beginning :**

ఉ॥ శ్రీకరునంబికాతనయు సింధురవక్త్రుని నేకదంతునిన్
ప్రాకటహేమ వర్ణ శశి భాస్కరలోచను మోదకప్రియున్
శోక దరిద్రదుఃఖపటుశోషణు విఘ్న వినాశకారునిన్
నాకనివాస వంద్యుగణనాథునిఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

శ్రీపార్వతీపుత్ర లోకత్రయీస్తోత్ర సంపూర్ణ చారిత్ర, భద్రామహాగాత్ర కాత్యాయనీనాథ స్వామి విఘ్నేశ్వరా ! నీపాద పద్మంబు నీయూరుకాండంబు నీ నాల్గు హస్తంబు నీపిన్నతొండంబు, నీ యేకదంతంబు,

**End ;**

విఘ్నేశ్వరానిన్నుఁ బూజించకే యన్య దైవాలఁబ్రార్థించుటల్ కాంచనంబొల్లకే యిన్మదాఁ గోరుచంబుగాదే మహాదేవ ఓ భక్తమందార ఓ సంతతోద్ధార ఓ సత్యసంకల్ప ఓనిత్య గీర్వాణ ఓ లోకరక్షామణీ దేవగౌరీశ లక్ష్మీశ ఓదైవచూడామణీ సర్వ రక్షామణీ భానుకోటి ప్రతీకాశ ...దీశసంస్తుత్యపాదాబ్జముల్ నమ్మితిన్ నాగమాంబాపురీ నిత్యమానెప్పుడున్ గోర్కులీడేర్చుచున్ నేఁడు ప్రత్యక్షమై రక్షించు శ్రీమద్గణేశా నమస్తే నమస్తేనమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

గణపతి స్తుతి యిందలి విషయములు. కర్త పేరుఁగానరాదు.

ఇందలి గ్రంథాంతరములివి :—

9 a. గణపత్యష్టోత్తర శతనామస్తోత్రము, 13 a. వినాయక పూజ.

---

## No. 1981. గ్రామదేవత దండకము.

## GRĀMADĒVATADAṆḌAKAMU.

Substance, palm-leaf, Size, 11¼ × 1¼ inches. Pages, 2. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 25 a. The other works herein are—Gollavēṣakatha 1a, Samudramathanamu 8 a, Pavalimpusēva 14a, Ēkantasēva 18 a, Rājarājēsvarapadyamulu 28 b.

Incomplete.

Several goddesses who are believed to be the presiding deities of various infectious diseases are enumerated and praised. The author is not known.

**Beginning :**

బాజా భజంత్రీలు భాకాలు కొమ్ముల్ మహావాద్యముల్ సేయఁగా పంబజోళ్లందు జేగంటు బైనీలు మాష్టీలు గోసంగులున్ తొమ్ముదప్పెట్లు...యంగణాచార్లు నున్నాడఁగా నంత ఆగంబు గావించి తీర్థంబులుం జేసినన్ వారినిన్ మెత్తువే వేడ్క వారంబులున్ని త్తువే కళ్కియాగంబునున్.

**End :**

దేవి రక్షింపవే నీకు పొంగళ్లు బోనాలు సేయించి యాయాటలుం గోళ్లనుం గొట్టి నైవేద్యధూపంబులున్నిచ్చి నిత్యోత్సవంబుల్ సదా నెప్పుడున్......గావించి సేవింతురే యమ్మభావింతునే నేను నీదాసదాసాదిదాసుండనై మ్రొక్కెదన్ విలవమ్మా శివాభవానీ కళాక్షిప......ని నమస్తే నమస్తేనమః.

(వి-వి.)—

అసమగ్రము. ఆరంభభాగము లేదు. వ్రాఁత తిన్ననిది. తప్పులు గలవు. గ్రంథపాతములు గలవు.

కొల్లాపురీయమ్మ, అద్దంకి మహాలక్ష్మమ్మ, కొల్లేటి పెద్దింటమ్మ, వానపల్లి పళ్లాలమ్మ, కేలంగి మెంట్లమ్మ, రాకుదిటి మామిళ్లమ్మ, మోగంటి పెన్నేరమ్మ, మొదలగు పేళ్లుగల గ్రామదేవతలిందు పేర్కొనఁబడిరి. సాంక్రామిక వ్యాధులు గ్రామములందు వ్యాపించినపుడు తచ్ఛాంతికై జరపు గ్రామదేవతల కొలువును ప్రశంసించు స్తుతిదండకమిది. కర్త పేరెఱుఁగరాదు.

ఇందలి గ్రంథాంతములివి :—

1a గొల్లవేషకథ, 8a సముద్ర మథనము, 14a పవళింపుసేవ, 18a ఏకాంతసేవ, 28b రాజరాజేశ్వర పద్యములు.

---

## No. 1982. తారావళీ దండకము.

## TĀRĀVALĪDANḌAKAMU.

Substance, palm-leaf. Size, $16\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches. Pages, 15. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Begins on fol. 52 a. of the ms. described under No. 1975 ante.
Complete.
Same work as that described under R. No. 205.

(వి వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్. నెం 205 రున వర్ణితము ఇందలి గ్రంథాంతరముల ‘ నెం 1975 రు ’ చూచునది.

---

## No 1983. తిట్టు దండకము.

## TIṬṬUDANḌAKAMU.

Substance, palm-leaf. Size, 12¼ × 1 inches. Pages, 9. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Incomplete.

An abuse of a Komati (merchant) by a critic who was not properly honoured by the Komati.

**Beginning :**

చీచీవరే పాతకీ ఘాతకా ప్రేతభుక్ ప్రోత పుచ్ఛిష్టభుక్ రోతవారాంగనా వ్రాత పట్టు మాతా యిదే చూడరా నేఁడు దుర్బీజమా నీత మానా జమయా రాపూకా బాలిసెట్టిగా మహారామా గులామా.

**End :**

పాసంబు సేతువు గనుక నికనైనా బుద్ధిదెచ్చుకొని మాకైనా సంభావనా యిచ్చి మాచేత దీవనల్ పొందుమా !

(వి-వి.)—

అసమగ్రమము. వ్రాఁతమంచిది. పాఠు తప్పులు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఎవఁడో తిట్టుఁబోతు తనకు సరిగా సంభావన యియ్యలేదని యొక కోమటిని దిట్టినతిట్లు దండకమిది.

---

## No. 1984. దేవీ దండకము.

## DĒVĪDANDAKAMU.

Substance, palm-leaf. Size, 13 × 1⅛ inches. Pages, 2. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 43 *a.* of the ms. described under No. 1488 ante.

Incomplete.

Written in praise of Śakti by an unknown author.

**Beginning :**

శ్రీ మన్మహాదేవి లోకమాతా పరంజ్యోతివై వెల్గు నావెల్గులోనన్ త్రిమూర్త్యాత్మవై నీవు నారాయణా రుద్రబ్రహ్మాది రూపంబులం దైక్యమై శ్రీ శారదాంబాది నామంబులం దాల్చి అర్ధాంగ వక్షస్స్థలాస్యంబులన్నిల్చియైశ్వర్య విద్యాది శక్తుల్ ప్రసాదించుచున్.

**End :**

నేతి యప్పాలు బొబ్బట్లు నున్నాదిగా పిండివంటల్ మరిం బప్పును న్నెయ్యి బొం తరిటిపళ్లు స్సుధాధారయున్నేపలం బోతులం గోటి నైవేద్యముల్ ఇచ్చి గంధంబులం బూసి ధూపంబుల న్వేసి తాంబూలముల్ ఇచ్చి భేరీలు మద్దెళ్లు తాళాలు.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాతమంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

శివశక్తి స్తుతి యిందలి విషయము. కర్త పేరుంగరాలు.

ఇందలి గ్రంథాంతరములకు కలువాయి చిన్నికృష్ణ శతకము డి. నెం 1488 రు చూచునది.

---

## No. 198 దేవీ దండకము.

## DĒVĪDANDAKAMU.

Substance, palm-leaf. Size, $10\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 14. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, not new. Mode of writing, fair but contains mistakes.

Incomplete.

Describes the story how God Siva, at the request of Nārada, brought forth from his devine body, the sage Dēvānga and entrusted him with the work of weaving clothes for gods and men. Dēvānga was obstructed by Asuras, but he overcame them by the grace of Dēv (Goddess). It gives an acoouut of Dēvānga or weaver community.

**Beginning :**

శ్రీ శంభురాణీ స్ఫురన్నీలవేణీ పరంజ్యోతి రూపీ మీ దివ్య పాదారవిందంబు లందం బుగా నామనంబందు సద్భక్తితో యుక్తితో నిల్పి పైచిత్రమై పాత్రమై యొప్పుమీ చారు చారిత్రముల్ దండకారూఢిగాఁజేసి యర్పించెదన్ సావధానంబుతో చిత్తగింపం దగున్ దేవి పూర్వంబునన్ సర్వగీర్వాణులున్.

**End :**

దేవాంగ మౌనీంద్ర చంద్రుండు నేర్పొప్ప నానావిధానేకవస్త్రంబులున్ వేడ్క నిర్మించి యా శూలికిన్ వేగ శుండాల చర్మంబు వస్త్రంబునన్ శౌరికిన్ హేమవర్ణాఖ్య వస్త్రంబులున్ ధాతకున్ భీతితో హంసావళీ నామధేయంబునం బ్రాకటంబైన వస్త్రం బునీరున్ నవీనంపుఁ జీనాంబరంబుల్ మఱిన్ లక్ష్మికిన్ శ్రీ విలాసంబనే వస్త్రమున్ భారతీ దేవికిన్ ధౌత వస్త్రంబునున్ వాసిగానిచ్చి.

(వి-వి.)—

అసమగ్రము. తుదిపట్టులేదు వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

నారదప్రార్థితుఁడై శివుఁడు తనదివ్యాంగమునుండి దేవాంగుఁడను ఋషిని సృజించి దేవమానవాదులకు వస్త్రనిర్మాణము గావింప నియోగించెను. దేవాంగఋషి విష్ణునాభీసరోజమునుండి దారములఁ దీసి వస్త్రనిర్మాణముగావింపఁబూనఁగా నసురులవలన నడ్డంకు లేర్పడుటయు దేవి యనుగ్రహమున నవి నివారితములగుటయు నిందు వర్ణితము. కర్త పేరిందు గానరాదు. వస్త్రనిర్మాణమున సునిపుణులగు దేవాంగ జాతివారి మహత్త్వము నిది తెల్పును.

---

## No. 1986. దేశమ్మవారిదండకము.

## DĒŚAMMAVĀRI DAṆḌAKAMU.

**Substance, palm-leaf. Size, 12¾ × 1 inches. Pages, 7. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, old, Mode of writing, fair but not free from mistakes.**

Complete.

Written in praise of the Goddess Mahālakṣmi who is believed to cause cholera. This dandaka is recited when any place is infected with cholera. One Kodaṇḍarāma is the author. The disease is supposed to have been imported from a different country (province) at the time of the Mahrata invasions and hence perhaps the name of the Goddess as Dēśamma.

**Beginning**:

శ్రీమన్మహా రౌద్ర వక్త్రి సుర జ్యేష్ఠ పుత్రీ సువిద్యుల్లతా దీప్తగాత్రీ సురస్తోత్ర పాత్రీ జగద్వ్యాపకీ తాపకృత్వాయకీ చండికా నాయకీ ఆదిశక్తి పరంజ్యోతి జ్యోతిర్మయీ భద్రకాళీ పరాశక్తి పాపాహారీ త్రిలోక ప్రచారీ మహామాయి మరిడీ మృడానీ జగద్రక్షిణీ.

**End :**

బ్రాహ్మణ క్షత్రియ వ్రాతముల్ వైశ్య శూద్రాది నానా జనానీకముల్ బ్రోచి రక్షించవే తల్లి బంగారు బొమ్మా మహాశక్తివమ్మా కటాక్షించవమ్మా జగన్మాతవమ్మా మహాదుర్గి మహాలక్ష్మి నీ పేర కోదండ రామాభి ధానుండు పూదండగా దండకం బొక్కటిల్ జెప్పి నీ కర్పితంబొప్ప గావించె నీ దండకం బెవ్వరైనన్ పఠింపన్ వినన్ వ్రాసినన్ వారిక వ్వారిగా కోర్కులిప్పించి రక్షింపవమ్మా జగద్రక్షిణీ లోకమాతా నమస్తే నమస్తేనమః

మ॥ హరియైనన్ హరుడైన నింద్రుడయినన్ అబ్జాసనుండైనని
న్నెఱుఁగన్ జాలరు నీ మహామహిమ మాకెంచ్చంగ శక్యంబయో
పరదేవీ విషజాతమారుత మరుత్ప్రాశాబ్జ పాణిద్వయీ
మరిడీ దేవత మమ్ముఁ బ్రోవఁగదవమ్మా లోకరక్షామణీ !

(వి-వి.) —

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వము మహారాష్ట్ర సైన్యము తళ్లువల్ల వ్యాపించినదిగాన మరిడీ (మరాటీ) మహాలక్ష్మియని పేరుగల కలరావ్యాధి యధి దేవతను స్తుతించుటగా నీ దండకముగలదు. కర్త కోదండరామాభిధానుఁడు. కలరావ్యాధి గ్రామమున వ్యాపించినపుడీ దండకముఁ బఠింతురు — దేశాంతరమునసుండి వచ్చి వ్యాపించినదిగాన మరిడీ దేవతకు దేశమ్మవారు, అనియు పే రేర్పడి యుండును.

---

## No. 1987. నృసింహ దండకము.

## NṚSIMHADANDAKAMU.

Substance, paper Size, $7\frac{3}{4} \times 5\frac{3}{4}$ inches. Pages, 20. Lines, 14 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Begins on fol. 124 *a*. The other works herein are Garudācalavilāsamu 1*a*, Rāmacandra śatakamu 49*a*, Mannārukṛṣṇaśatakamu 65a, Saṅkirnagēyamulu 87a, Gōvyāghracaritra 114b.
Complete.

The story of Prahlāda found in the Seventh Skandha of Bhagavata, is described in this as narrated by Nārada to Yudhiṣṭhira and is dedicated to God Narasimha worshipped at Garuḍādri. Mungara Appanna, son of Lakṣmanacarya is the author.

**Beginning :**

దండకము.—శ్రీ మద్వ రారాధక స్తోత్ర పాత్రుండు శ్రీ పాండుపుత్రుండు హైరణ్య రాత్రిం చరాత్యుచ్ఛ్రయంబుల్ హాళిత్వాలకావస్థ ప్రహ్లాద చారిత్రముల్ శ్రీ నృసింహావతార ప్రకారంబు వేడంగ నా నారదబ్రహ్మ వక్కాణముంజేయుచుంటే జనాధీశ విశ్వంభవన్నాలుగుం గాదములొల్చి వర్తిల్ యుగంబందజుండ ప్రబుద్ధి న్విశేషజ్ఞుఁ డాగాకయీరాని పెక్కువ్వ రాలియ్యఁగా జాటువారక్కనుండుక్కుతో మిక్కిలిఁ బిక్కటిల్లారిసిఁ జేరికిపై నైనఁగై కోక క్రిందేడు మీఁదేడు లోకంబులందుఁ స్వకయాసిక్రీ దీటుగాఁ బోటుబంటొక్కఁడుఁ లేక దైతేయ సామ్రాజ్య పట్టాన్వితుండై........

**End :**

ప్రహ్లాదు సామంబులఁ భవ్యదండ ప్రణామంబులఁ సుప్రసన్నాననుండుఁ సుఖాసీనవామాంకి లక్ష్మీ ఘనుండుఁ మందస్మితుండుఁ సదర్వబ్జ దండా శిరోవిస్మితుండుఁ హితాలోచనుండుఁ హిమాశుక్రమాలాంగ సంలోచనుండుఁ బ్రదత్తా భయుండుఁ బరిష్కార బభ్రాజ్య పారోహ్యద్భవుండైన తాగ్రేసరుంగా చినాఁడెల్లరంబ్రోచి మేల్ మేలు జేజేయ హాహాహాబలంబంచు దిక్కు ల్ప్రశంసింపఁగా గారుడాద్రిఁ భవధ్వంసినీతీర సాధంబులఁ దావినీఁగాన శోకోదయచ్ఛాయలఁ వల్లికా ఖేల సాహాయ్య సంపత్తులఁ ధారుణిఁ దుష్టులంబట్టి శిక్షింపుచుఁ శిష్టులం బ్రేమ రక్షింపుచుఁ శ్రీ నృహర్యక్ష దేవుండు భక్తవాత్సల్యమింపొందఁ కాపట్టైడిఁ టీవిగానెంచుఁ గాంతేయుఁడంతఁ.

**Colophon :**

సమిద్వోజి పేర్కొన్న స్తంభోద్భవంబుఁ రహిఁ దండకస్ఫూర్తి వాక్రుచ్చె నందాపురీ విప్రమూర్ధన్యుఁడుఁ లక్ష్మయార్యోద్భవుండుఁ సుధీసింహుఁడౌ ముంగరప్పన్న గావించె మేలంకితంబుఁ జగత్కర్తకై వేంకట క్షోణి భృద్భర్తకై యిందిరా భూమనోవర్తికై శ్రీ నృకంఠీర వస్ఫూర్తికై నమస్తే నమస్తే నమః

(బి-బి.)—

సమగ్రము. ప్రాఁత తిన్ననిది. తప్పులు చాలఁ గలవు శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

కాంతేయాగ్రజునకు నారదుఁడు చెప్పినట్లుగా శ్రీ భాగవత సప్తమ స్కంధమందలి ప్రహ్లాద చరిత్రమిందు గరుడాద్రి నృసింహుని కంకితముగా రచియింపఁబడినది. నంద వర ద్విజుఁడును, లక్ష్మణాచార్యుని కుమారుఁడునగు ముంగర యప్పన్న దీనికిఁ గర్త.

ఇంతవి గ్రంథాంతరములివి :—

1a, గరుడాచల విలాసము, 49a రామచంద్ర శతకము, 65a మన్నారు కృష్ణశతకము, 87a సంకీర్ణ గేయములు 114b గోవ్యాఘ్ర చరిత్ర,

---

## No. 1988. నృసింహ దండకము.

## NṚSIMHA DANḌAKAMU.

**Substance, palm-leaf. Size, 13¼ × 1 inches. Pages, 22. Lines, 5 on a page, Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, bad and full of mistakes.**

Incomplete.

Same work as that described under No, 1987.

(వి.వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులు చాలఁగలవు. శైథిల్యము చాలఁగలదు— గ్రంథపాతములును గలవు.

పూర్వమువోలె.

---

## No. 1989. నృసింహ దండకము.

## NRSIMHA DANDAKAMU.

**Substance, Palm leaf. Size, 12⅜ × 1 inches. Pages, 39. Lines, 4 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.**

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము గలదు. గ్రంథ పాతములు లేవు.

పూర్వమువోలె.

## No 1990. పొగాకు దండకము.

## POGĀKUDAṆḌAKAMU.

**Substance, palm-leaf. Size, 11¾ × 1½ inches. Pages, 8. Lines, 5 on a page Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair, but full of mistakes.**

Complete.

A humerous passage in Dandakametre on tobacco and its uses in different ways. The name of the author is not known.

**Beginning :**

శ్రీవిఘ్నరాజా గణాధీశ సర్వేశ సద్భక్త సంసక్త..................భూలోక సౌభాగ్య మేమందు సంక్రందనా బ్రహ్మపత్రం - కద్దాయనాయంచు అడ్డినన్ వెన్నునిన్ జెన్నునన్ బూని రాకెంపునన్ బోలి జాకృతితో సాటియై మేటియై ఘాటునై దిట్టమై చట్టమైయుండుటన్ బ్రహ్మపత్రంబునన్ దెచ్చుచున్ విచ్చుచున్ హెచ్చుచున్ మెచ్చుచున్ దిన్నగా మిన్నగా సన్నగా సన్నగాఁ జుట్టలంజుట్టి హుంకించి భక్తితోఁ బ్రాగినన్ ముక్తిగల్గించు శ్రేయస్కరంబంచు ధూపమ్ములన్ గ్రోలుచున్నారు.................. దేవేంద్ర ! శ్రీవైష్ణవుల్ ప్రొద్దుటన్ లేచి శివభక్తులందిట్టి నీరాకావి వేష్టుల్ విశ్వంబంబుగాఁజుట్టి...యా బ్రహ్మపత్రంబునన్ ధూపముల్ గ్రోలుచున్నారు తత్వాదులెల్లన్ మహాతత్త్వకుల్ మీఱఁగా,.........కృష్ణాజినం పెట్టెయున్ ఘుల్లనన్ మూపునన్ వేసుకన్ జింకదాఁటుల్ వెసన్ దాఁటుచున్ మెల్లఁగాఁ దెల్లఁగాఁ బిల్లవెంబుల్ మఱింగిండిహూజల్ .......

**End :**

తోఁటలోఁ బైరుగావించి ఒప్పుగా నిప్పు తెప్పించి మిక్కిలిన్ బ్రేమతో ధూపముల్ బ్రాగు వారెంత పుణ్యాత్ములో యెంత ధర్మాత్ములో యెంత ఘోరాత్ములో వారికిన్ బుత్రపౌత్రాదులున్ మేలు గుఱ్ఱంబులున్ మీది రాజ్యంబులున్ పల్లకీల్ మఱిన్నందలాల్, స్వర్గాది భోగంబులున్ గల్గెనంచుం దొల్లి వాల్మీకి మొదలైనవారందఱున్ అనతియ్యంగ దేవేంద్రుఁ డామాట విన్నంత నుప్పొంగి భూలోకమున్ దూతలంబంపి బ్రహ్మపత్రంబు తెప్పించి వీడెంబులోనుంచి నస్యంబునన్ వేసి ధూపంబులం గ్రోలి యానందముంబొంది శ్రీవిఘ్నరాజా గణాధీశ నమస్తే నమస్తేనమః.

గ్రంథాంతమం దీవ్రాఁతగలదు.

ఈ పొగాకు దండకం సంపూర్ణముగా విరోధి సంవత్సర మార్గశిర బ॥ సోమవారం మధ్యాహ్నంవఱకు పుదిచేరిలో వ్రాస్తిని.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

బ్రహ్మపత్రము (పొగాకు)ను చుట్టలుగాను నస్యముగాను వీడెముగఁ దోడు గాను పలుతెగలవారు ఉపయోగించుటనుగూర్చి హాస్యమయముగాఁ బొగడుట యిందలి విషయము. కర్తపేరెఱుఁగరాదు.

---

## No. 1991. పోలమ్మదండకము.

## PŌLAMMADAṆḌAKAMU.

Substance, palm-leaf. Size 17 × $1\frac{1}{8}$ inches Pages, 5 Lines, 4 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, bad, and full of mistakes.

Begins on fol. 7a. The other works herein are Jagannāyaka. śatakamu 1a, Antarvedi Narasimhaśatakamu 2a, Dēvakīnandana-śatakamu 3b, Ārtaraksāmaṇiśatakamu 4 a, Rangasāyiśatakamu 5a, Mutyālammamidi padyamulu 6, Tarakabrahmasatakamu 10a, Nanda-nandana śatakamu 10b.

Complete.

Written in praise of Goddess Polamma. The author is Bogada Mallakavi.

**Beginning :**

శ్రీమత్పయోజాక్షి దాక్షాయణీ పావనీ పార్వతీ శాంకరీ శాంభవీ లోకమాతా కృపాపాంగనేత్రా ధరిత్రి వశీకర్త్రి శ్రీకరీ నీకు నేత్రము కొక్కదర్ వేడ్క నాజిహ్వకుర్ దోడుగా నీడగావే.

**End :**

ఇంతి చామంతి పూబంతి పంతంబుగా జాలకం నేర్తురే సొక్కుచూ జోలుచుర్ ఆడుచుం బాడుచుర్ గొబ్బిలం గోళులర్ బందులర్ దున్నలర్ నిక్కముగ నీకు జాతరల్ చేతురే గొంతిరో పల్ల భూపాల కుట్నంబు రక్షించి యా బొగడ మల్లకవి రక్షించి యా పల్లవాధీశు రాజ్యంబుపై భారముంచి అది దుర్గ నమో దేవితుభ్యం నమో దేవి తుభ్యం నమస్తే నమస్తేనమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పోలమ్మ యను గ్రామదేవత స్తుత్యాత్మక మీ దండకము. కర్తపేరు బొగడ మల్లకవి.

---

## No. 1992. బృహన్నాయికాదండకము.

## BṚHANNĀYIKĀDANḌAKAMU.

Substance, palm-leaf. Size, 15⅝ × 1¼ inches. Page, 150. Lines, 3 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, not bad, and almost free from mistakes.

Complete.

Addressed to Goddess Bṛhadambikā worshipped at Pudukkota, the work is written in a metre Called Danḍaka, describing the geatness of Kotarāya Raghunathabhūpāla who was then the ruler. For details see extracts below.

The author is Nudurupāti Vengana.

**Beginning :**

శ్రీమద్బృహన్నాయికా నామధేయే మహాదేవజాయే మహావిష్ణుమాయే నవాంభోద కాయే, సుసంఫుల్ల కల్హార నీలోత్పలాంభోజ జాతీ లసన్మల్లికా దివ్యపున్నాగ కాదంబ చాంపేయ సత్పాటలీ కేతకీ కుందమందార దామాది సంవాసితానేక దిఙ్మండలే ప్రోల్లసత్కుండలే పాదపద్మానతానేక బృందార కేంద్రాది దేవాంగనా మౌళిమాల్యావళీ లోల భృంగాంగనా జాల కోలాహలోదార సంగీతనాదామృతాస్వాదలోలే కృపాధారశీలే సుఫాలే మణీరాజి రాజత్కిరీట ప్రభాపూర సంయుక్త హారాంగద శ్రీలసన్మేఖలా నూపురాలంకృతే దివ్య పీతాంబరాలంకృతే యంచనన్ దేవబృందంబుచే సన్నుతుల్ గాంచు శ్రీ చక్రరాజంబుపై నిండు కొల్వుండు శ్రీమన్మహారాజరాజేశ్వరైనట్టి మేల్ భక్త చింతామణింగాను రంజిల్లు సబ్బంగరుం గొండ విల్కాడుగాఁ జెల్లు గోకర్ణనాథున్ మహాదేవు మేలౌ వహిన్నించు నాపట్టపుఁ రాణి శ్రీమద్బృహన్నాయికాదేవి తానొక్క నాఁడంత వింతైన, ......... ......... .. .... ...భక్తి సంయుక్తుఁడై నిల్చి శ్రీమద్బృహన్నాయికా దివ్య పాదారవింద ద్వయీసేవ నాయత్తచిత్తుఁ కవీంద్రానురక్తుఁ శ్రితాళీ మనోభీష్టమందారు, నయ్యబ్ధిగంభీరు, నత్యద్భుతాకారు శ్రీకోటివంశాబ్ధి సంపూర్ణచంద్రుండు శ్రీ తిర్మలేంద్రావనీపాలపాలుండు సంగీత సాహిత్య లోలుండు సత్కీర్తిశీలుండు శ్రీమన్మహారాజ రాజాబహాదర్ రఘూత్తంసనాథుండు బల్హాయిగానంత నానావిధానర్ఘ్య రత్నాంబరాలంకృతుండై........

* * *

ఆ మంత్రులన్ జూచి చేసన్నఁ జేయ నాజాడనుంగాంచు శ్రీశేఖరాజున్ కులంబున్ వహిన్నించు మేల్కన్నయామాత్యగంభీరు విద్వత్కవివ్రాతమందారు మేలౌ దివాన్ జీయనన్ మీఱు వెంకప్పధీరున్.

**End :**

శ్రీమన్మహారాజరాజేశ్వరీదేవి శ్రీమత్పదాల్ వర్ణనారూప మానీకృతిన్ ఆకవీంద్రుల్ నుతింపంగ నుద్దండ విద్వత్కవిత్వాంకనుండైన శ్రీవెంకనార్యున్ తృతీయాత్మజుం జేయు

శ్రీమద్బృహన్నాయికాదండకం బుల్వి నాచంద్రమస్తార కాంభోజి నిబంధుబింబంబుగా వర్ధిలుగా.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము హెచ్చు. గ్రంథ పాతములుగలవు.

పుదుక్కోటలో వెలసిన తిరుగోకర్ణేశ్వరస్వామి దేవియగు బృహదంబికపై సుదురు పాటి వెంకనకవి యప్పటి ప్రభువగు తోండరాయ రఘునాథభూపాలుని ప్రాభవాది వర్ణనా పూర్వకముగా రచించిన స్తుతి దండక మిది. విశేషముల కుదాహృతగ్రంథభాగములఁ గాంచునది.

గ్రంథాంతమున రెండాకులమీఁద రఘునాథరాయల ప్రశస్తిపద్యము లున్నవి.

## No. 1993. భల్లాణదండకము.

## BHALLĀNADANḌAKAMU.

Substance, palm-leaf. Size, 10⅞ × 1¼ inches. Pages, 102. Lines, 4 on a page. Character Telugu,. Codition, good. Appearance old. Mode of writing, fair, but not free from mistakes.

Complete.

Same work as that described under R. No. 1167.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 1167 రున వర్ణితము.

గ్రంథాంతమం దీవ్రాఁత గలదు :—

"నందననామ సంవత్సర భాద్రపద శు॥ 1 ఆదివారం యీ భల్లాణదండకం ప్రతినున్న క్రమాన మాజేటి సర్వేశలింగం వ్రాశెను."

## No. 1994. భల్లాణదండకము.

## BHALLĀNADANḌAKAMU.

Substance, palm-leaf. Size, 9¼ × 1⅝ inches. Pages, 53. Lines, 6, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair, but full of mistakes.

Complete.

Same work as that described under R. No. 1167.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు కొలఁదిగలవు.

ఇది ఆర్. నెం 1167 దున వర్ణితము. తుదిశుద్ధ్యమిందులేదు. పాఠభేదములు గలవు.

---

## No 1995 భోగినీదండకము.

## BHOGINĪDAṆḌAKAMU.

Substance, papor. Size, 12¾ × 8 inches. Pages, 15. Lines, 21 on a page Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Written in Dandaka metre, it describes how a prostitute managed to win the love of King Rāvu Sarvajnasinga. Sarvajnasinga was the grandson of Rāvu Singabhūpāla and the son of Kumārānna Pōtāvanīnatha and Pōcamāmba. He was honoured by Vasantāvanīnātha. The last verse at the end of the Daṇḍaka indicates that Bammera Pōtarāju is the author.

**Beginning :**

శ్రీమన్మహామంగళాకారు నాకార లక్ష్మీకుమారుఁ .. వసంతావనీనాథ సంసేవితాంచ త్పదాంభోజు... ..—భీమ ప్రతాపానలాభీల కీలా వినిర్మూలితా రాతిపాండ్య క్ష్మాపాలు........రాసింగయుఁ సింగభూపాలు, .... గోపాల దేవోత్సవ క్రీడలో మేడలోనుండి జాలాంతరాళంబుల న్వారయోషాతనూజాత.....దర్శించి తద్వైభవంబు న్విమర్శించి . ......కుమారాన్న పోతావనీనాథ సూను న్వధూలోక చిత్తాపహారావధానుం బ్రభాభాను మాయారమానాథు సర్వజ్ఞ సింగక్ష్మానాథు.

**End :**

పోచమాంబాల సద్గర్భసంజాతుపై ..... .....రావు సింగక్ష్మానాథ పౌత్రుఁ, సమీచీన రేచెర్ల గోత్రాబ్జమిత్రుఁ మహోదారచారిత్రు సర్వజ్ఞ సింగక్ష్మానాథు నీక్షించి కేళో[illegible]...... ..సింగభూపాలుఁ డావాల దయాదృష్టి భావించి కందర్పకేళి న్వినోదించి తన్మాతనుద్యద్గజాహూధగావించి ముష్టంబు లిప్పించి యొప్పెంగడుఁ.

ఉ. పండిత మాననీయుఁడగు బమ్మెరపోతన యాశుధాంశు మా
ర్తాండ కులాచలాంబునిధి తారకమై విలసిల్ల భోగినీ
దండకముఁ రచించె బహుదాన విహర్తకు రావు సింగభూ
మండల భర్తకుఁ విమత మానవనాథ మదాపహర్తకుఁ.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

రేచెర్లవంశ్యుఁడగు రావు సర్వజ్ఞ శింగక్ష్మాకాంతుని నొక వేశ్య వలచి దక్కించు కొనుటయిందలి విషయము. ఆ సర్వజ్ఞ సింగభూపాలుఁడు రావు సింగభూపాలుని మనుఁడని, పోచమాంబకును కుమారాన్న పోతావనీనాథునకును కుమారుఁడని, వసంతావనీనాథసేవిత పాదుఁడని యిందుఁ గలదు. ఏతద్గ్రంథకర్త బమ్మెర పోతరాజు. ఇక్కడ గల వ్రాఁతప్రతు లన్నింటను—పండిత మాననీయుఁడగు నిత్యాదిపద్యము, దండక మిది పోతన కృతియని చెప్పునది గలదు. కొందఱిది ప్రక్షిప్తమనుట విశ్వసనీయము గాదు. ఈ దండకమును విని రాజు కొంత లజ్జనొందఁగా పోతన యీ క్రింది పద్యముఁ జెప్పెనట.

గీ. రసికులయినవారు రమణుల కొకవేళ - వంగుటెల్ల ధర్మవర్తనంబు
ఈరసమున విల్లు నారికి వంగదా - చిత్తజాతరూప! సింగభూప!

ఇందీ యితరగ్రంథము గలదు :

దశావతార చరిత్రము 9a.

---

## No. 1996. భోగినీదండకము.

## BHŌGINĪDAṆḌAKAMU.

Substance, paper. Size, 10¼ × 8¼ inches. Pages, 7. Lines, 30 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair, but not free from mistakes.

Begins on fol. 51a. The other works herein are Daśāvatāra-caritra 1a, Sāmudrikaśāstramu 17a, Rettamataśāstramu 29a, Kāśī-khaṇḍamu 55a.

**Complete.**

**Same work as the above.**

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము కలదు. గ్రంథపాతములు గలవు.

గ్రంథాంతమున.—

ఉ. పండిత మాననీయుఁడగు బమ్మెర పోతన యాశుధాంశు మా
ర్తాండ కులాచలాంబునిధి తారకమై విలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బహుదానవిహర్తకు సింగమేదినీ
మండల భర్తకున్ విమత మానవనాథ మదాపహర్తకున్.

పూర్వమువోలె.

ఇందలి గ్రంథాంతము లివి :—

1a దశావతార చరిత్ర, 17a సాముద్రిక శాస్త్రము, 29a రెట్టమతశాస్త్రము, 55a కాశీఖండము.

## No. 1997. భోగినీదండకము.

## BHŌGINĪDAṆḌAKAMU.

Substance, palm-leaf. Size, 17 ⅞ × 1⅜ inches. Pages, 16. Lines, 5 and 6 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair, but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాత ములు లేవు.

గ్రంథాంతమం దిదిగలదు:

ఉ. మండితకీర్తి నిట్లు బుధమాన్యుఁడు పోతన యాశుధాంశు మా
ర్తాండ కులాచలాంబునిధి తారకమై విలసిల్ల భోగినీ
దండకముౕ రచించె బహుదానవిహర్తకు సింగమేదినీ
మండల భర్తకుౕ విమత మానవనాథ మదాపహర్తకుౕ.

---

## No. 1998. భోగినీదండకము.

## BHŌGINĪDAṆḌAKAMU.

Substance, palm-leaf. Size, 12¾ × 1¼ inches. Pages, 28. Lines, 6 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

గ్రంథాంతమం దీపద్యమున్నది :—

ఉ, పండిత కీర్తనీయుఁడగు బమ్మెర పోతన యాశుధాంశు మా
ర్తాండ కులాచలాంబునిధి తాలకమై విలసిల్ల భోగినీ
దండకముౕ రచించె బహుదానవిహర్తకు రావు సింగ భూ
మండల భర్తకుౕ విమత మానవనాథ మదాపహర్తకుౕ.

"విరోధినామ సంవత్సర జ్యేష్ట బ 30 మంగళవారం పుదిచేరిలో యీ భోగినీ దండకం సంపూర్ణముగా ఘాశేటి సర్వేశలింగం వ్రాశెను."

## No. 1999. భోగినీ దండకము.

## BHŌGINĪDANḌAKAMU.

Substance, palm-leaf. Size, 15⅝ × 1½ inches. Pages, 24. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

**Same work as the above.**

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము చాల గలదు. గ్రంథపాఠములును చాలనున్నవి.

పూర్వమువలె.

---

## No. 2000. భోగినీదండకము

## BHŌGINĪDANḌAKAMU.

Substance, palm-leaf. Size, 9⅝ × 1½ inches. Pages, 70. Lines, 3 and 4 on a page Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair, but full of mistakes.

Complete.

**Same work as the above.**

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతతిన్ననిది. తప్పులు చాలఁగలవు. అయినను మంచి పాఠములతో నీ ప్రతిగలదు.

నెం 1995 రున వర్ణితము.

---

## No. 2001. మోహినీదండకము.

## MŌHINĪDANḌAKAMU.

Substance, palm-leaf Size, 9⅝ × 2¼ inches. Pages, 13. Lines, 13 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good, but not free from mistakes.

Begins on fol. 42a. The other works herein are Allāḍavijaya bhūpatisimhaivlāsamula, Rājayoga Sāramu 49 a.

Complete.

The composition of this danḍaka has connection with Allāḍavija yabhūpatisimhnavilāsamu described under No. 786 ante. It appears

to form a portion of Mannārudāsavilāsamu by Rangājamma. Just as the name of the work 'Mannārudāsavilāsamu' has been changed to Allāḍavijayasimhabhūpativilāsamu, the names of Vijayaraghavanāyaka and others have also been changed. Tne work under notice describes the love of the king for a prostitute.

**Beginning :**

శ్రీమన్మహారాజాధిరాజా మహాయింద్రపురీ లక్ష్మీనారాయణా సేవాధురీణాది దానుండు కిరీట సింహాసనాధీశ్వరుఁడు దానకర్ణావతారుండు అష్టభాషావిశేషాతి జ్ఞానప్రవీణుండు వీణాది సంగీతసాహిత్యపాండిత్య భోజుండుగా తమ రాజరాజ అల్లాడ విజయభూపతి సింహనరేంద్ర శౌరినాయకా తేజోమహారాయ ప్రధానాగ్రగణ్యుండు పుణ్యుండు నానాజగన్మోహనాకార సౌందర్యకందర్పుఁడానంద చిత్తావధానుండు శ్రీరాజ్యలక్ష్మీ ప్రసన్నుండు మూర్ధన్యధన్యుండు శృంగార లీలావినోదుండు.

**End :**

సూర్యు హెుంబట్టుతో యింపు రీవిన్ విలాసంబుగాఁగట్టి హరువైన హేమంపుఁ దలగడల్ కులుకుగానున్న మోహినీరత్నమున్ కౌఁగిటన్ జేర్చి మన్నించి కర్పూర సమ్మిశ్ర తాంబూలమున్ సేయ మారునిన్ గెలుచు సన్నాహమున్ మీఱి నానాకళా శాస్త్రిసన్నామర్మంబులన్ సోలిసొంపెక్కుచుం గొంతసేపు ప్రొద్దుచ్చి నిద్రించి మేల్కాంచి సూర్యోదయంబయ్యె విజయభూపతి సింహనరేంద్ర శౌరినా.

యకాతే జూడునిత్యమున్ భోగభాగ్యంబులన్ బుత్త్రిపౌత్రాభివృద్ధిన్ యశస్వంతుఁడైభాగ్య శ్రీమంతుఁడై ధాత్రినిన్ ఆశ్రితోనేక సంరక్షణాధ్యక్షుఁడైయుండె నాచంద్ర తారార్కమై యిట్టి చందంబునన్ మోహినీ దండకం బొప్పఁగా కటాక్షించవే రాజ మహేంద్రపురీ లక్ష్మీనారాయణ నమస్తే నమస్తే నమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు చాలఁగలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

డి. నె 786 రున అల్లాడవిజయసింహభూపతివిలాసమను పేర వర్ణితమయిన ప్రబంధముతో సంబంధించినదే యీ దండకము—రఁగాజమ్మ తంజావూరి విజయరాఘవ నాయకునిపేరఁ జెప్పిన మన్నారుదాసు విలాసమను ప్రబంధమున నీదండకము చేరినదై యుండును. మన్నారుదాస విలాసము, అల్లాడవిజయసింహభూపతివిలాసమను పేర మార్పునజెందినట్లే యుండును విజయ రాఘవ నాయక నామాదులు మార్పుచెందినవి. రాజు మోహిని యను వేశ్యను మోహించి పొందుట యిందలి విషయము. విశేషములకు డి. నె 786 రు చూచునది.

ఇందలి గ్రంథాంతరములు. అల్లాడవిజయభూపతిసింహవిలాసము 1b, రాజ యోగసారము 49 a.

## No. 2002. రంగనాయకదండకము.
## RANGANĀYAKADAḌNAKAMU.

Substance, palm-leaf. Size, 15¼ × 1⅜ inches, Pages 21. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing good, and free from mistakes

Complete.

The love sports of Sri Ranganatha, who is made the hero, are described in this. The author is Nārāyanakavi of Uyyālavāḍa, son of Peddanāmātya and a pupil of Kandāḷa Doḍḍayacārya.

Name of scribe.—Sri Ramamoorthy of Kālipaṭna.

Date of transcription.—Monday, the 14th day in the first half of the lunar month Phalguṇa in the year Śukla.

**Beginning :**

శ్రీమద్రమావృత్తవక్షోజ కుంభద్వయీలిప్తకస్తూరికాకుంకుమప్రోల్లసద్భద్రవత్సుండు పంకేరుహాక్షుండు గోపాంగనానేక నేత్రోత్పలామోద సంపాదనాంచచ్ఛర త్పూర్ణచంద్రుండు కారుణ్యసాంద్రుండు కావేరికాతీరవాసుండు కోట్యంగజోద్యద్విలాసుండు శ్రీరంగ ధామా మనోనాయకుండంబరీషాది సద్భక్త కైవల్య సంధాయకుం ..

**End :**

రమాదృక్చకోరద్వయీ కౌతుకాపాదకాకార సంపూర్ణ సంపూర్ణమాచంద్రు పేరన్ మహాపద్మ పద్మాప్త సంకాశు పేరన్ తథానేక కోట్యబ్జజాండేశుఁడై యొప్పు శ్రీరంగధామేశు పేరన్ వినంగోరు జీవాళికే వేళలందాత్మ సంతోషముంబాళ్ఁ గందాళ వంశంబునన్ వంశధార్యంశలై దేశికౌఘంబులో దొడ్డయాచార్యరాట్ శిష్యుఁడు ఉయ్యాలవాడాన్వయాంభోధి చంద్రుండు శ్రీపెద్దనామాత్య పుత్రుండు నారాయణుం డాంధ్రగీర్వాణ భాషామహాగ్రంథ పారాయణుల్ మెచ్చఁగాఁగూర్చి యర్పించె నీదండకం బిందు మార్తాండ నక్షత్ర పర్యంతమున్ భూమి రాణింపఁగా నింపునన్ సొంపునన్ నమస్తే నమస్తే నమః.

గ్రంథాంతమం దీ వ్రాఁతగలదు.

“శుక్లనామ సంవత్సర ఫాల్గుణశు 14 సోమవారంవరకు శ్రీరంగ దండకం కాళీ పట్నపు శ్రీరామమూర్తి వ్రాసెను.”

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులంతగాలేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శ్రీరంగనాథస్వామిపేర శృంగార రసమయముగా భోగినీ దండకమురీతి నీదండకము గలదు. ఇందు శ్రీరంగనాథస్వామి శృంగార విలాసము వర్ణితము. కర్త ఉయ్యాలవాడ నారాయణ కవి. ఈతఁడు కందాళ దొడ్డ యాచార్యుల శిష్యుఁడు.

## No. 2003. రంగనాయకదండకము.

## RANGANĀYAKADAṆḌAKAMU.

Substance, palm-leaf. Size, 14⅝ × 1⅜ inches. Pages, 33. Lines, 6 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good, and free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వము వలె :

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

శ్రీముఖనామసంవత్సరం భాద్రపదశు 7 సోమవారం, మాదేటి సర్వేశలింగంగారికి గంగాపాత్రుని భోగన్న.. ........ శ్రీరంగ దండకము.

## No. 2004. రామదండకము

## RAMADANḌAKAMU.

Substance, Palm-leaf. Size, 15 × 1½ inches. Pages, 16. Lines, 7 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good, but not free from mistakes.

Complete.

Written in praise of Sri Rāma by an unknown author

**Beginning :**

శ్రీజానకీ చిత్తకాసారహంసారఘూత్తంస ఘోరాసురధ్వంస కాకుత్థ్సవంశాబ్ధిరాకాసుధాధామ నీలాంబుదశ్యామ దివ్యాశుగస్తోమ సంధానలీలాలసల్లావా రాఘవా రామభద్రా జగద్భద్ర కౌసల్య సద్గర్భ పేటీలసద్రత్న రాజన్యకోటీరహీరప్రభాలంకృతాంఘ్రీ.

**End :**

అత్యంత భోగంబులన్ సంతసంబంద యంభోధి సంవేష్టితత్మాతలంబంతయున్ శోకదుర్భిక్షబాతాగ్నిరుగ్బాధలన్ బొందకుండంగ రక్షింపవా నీవు నిన్నెక్కాలే వేడెదన్ దేవ నీవున్ కృపాంభోధివిం గాన నాకుం బునర్జన్మ భీతి న్నివారించి రక్షింపుమో రామ ధారాధరశ్యామ దైత్యేంద్రహృద్భీమ పాపాంధకారోగ్ర శస్త్రప్రధామా నమస్తే నమస్తే నమః.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

విభవనామ సంవత్సర చైత్ర శు 5 గురువారం రోజుకు రాచర్ల వెంకటరామయ్యకుమారుడు పేరాజు రామ దండకం సంపూర్ణంగా వ్రాసెను.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

ఈ ప్రశస్త దండకము శ్రీరామస్తుత్యాత్మకము. దీని రచించిన కవిపేరెఱుఁగరాదు.

## No. 2005. రామదండకము.

## RĀMADANDAKAMU.

Substance, palm leaf. Size, 16¼ × 1⅜ inches. Pages, 10. Lines, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair, but full of mistakes.

Begins on fol. 60*a*. The other works herein are Bhāskara Rāmāyana 1*a*, Mācāṣṭaka 48*a*, Venkatēśvaradandakamu 50*a*, Tārāvatidandakamu 52*a*, Ganithavisayamu 67*a*, Sankaragranthamu 78*a*, Akrūradandakamu 82*a*.

Incomplete.

In praise of Sri Rama. The author is not known.

**Beginning :**

శ్రీమన్ మహీజాకుచద్వంద శ్రీగంధ కస్తూరికాకుంకుమా లిప్తపంకాంకితప్రోల్ల సద్భద్రవత్సా జగద్రక్ష కోదండ దీక్షా హితా రాక్షసామేఘరఘుంగఘనా రామభూపాల భూపాల మాణిక్యత్రైలోక్య రక్షా భవత్పాదకంజాతయుగ్మంబు నాభావమందుంచి నేవింతు కీర్తింతు ధ్యానంబు సేతున్ కృపాదృష్టి వీక్షించి రక్షించు కల్పావసానోగ్ర కల్లోల జాలాబ్ధిలో మీనవై . . .

**End :**

నాస్వామి నన్నుంగృపాదృష్టి వీక్షించు రక్షించు నెల్లప్పుడున్ బావకోద్యత్పదాంభోజ సంధ్యాయినిన్ జేసి ముక్తింబ్రసాదింపు మోదేవదేవేశ యంచున్ సురానీకసంరక్షణోత్సాహ పేరన్ మహాశౌర్యలీలా . . . . . .

(వి-వి.)—

అసమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

శ్రీరామ స్తుత్యాత్మకమీ దండకము. కర్తపేరెఱుఁగరాదు.

---

## No. 2006. రామదండకము.

## RĀMADANDAKAMU.

Substance, palm-leaf. Size, 13½ × 1¼ inches, Pages, 19. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair, and free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతమంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె.

గ్రంథాంతమందీ వ్రాంతకలదు :—

కీలకనామ సంవత్సరే భాద్రపద బహుళ 5 నల్లిపల్లి మంగళాద్రి రామదండకం సమాప్తంగా వ్రాసినాడు.

---

## No. 2007. రామానుజదండకము.

## RAMANUJADANḌAKAMU.

Substance, palm-leaf. Size, 13 × 1 inches. Pages, 11. Lines, 4 on a page. Character, Telugu Condition, good. Appearance, old. Mode of writing, good, but full of mistakes.

Complete.

Written by an unknown author in praise of Sri Rāmānuja, the founder of the Vīsistadvaita system of philosophy.

**Beginning :**

శ్రీమన్మహాభాష్యకారా కృపాపోషధారా గుణానందసారా అసత్యాలుపదూరా పరవ్యూహవిభవాంతకారా,

**End :**

రామానుజా మిమ్ము వర్ణింప నేనంతటివాఁడనే దైవమీనామ సంకీర్తనంబైన యీ దండకం వ్రాసినన్ విన్న మీరందరున్ పాపనిర్ముక్తులై పుణ్యసంయుక్తులై బ్రహ్మకల్పాది ఆయురారోగ్యులై అధికసంజ్ఞానులై సజ్జనాధారులై శ్రీహరిధ్యానులై యుందురో స్వామి కందురే సత్యమే తథ్యమే శ్రీ భాష్యకారా నమస్తే నమస్తే నమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతమంచిది. తప్పులమయము. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

విశిష్టాద్వైత ప్రవర్తకులయిన శ్రీరామానుజాచార్యులవారి స్తుతి యిందలి విషయము. నీరసమయిన యీ దండకమునకుఁ గర్తపేరెఱుఁగరాదు.

---

## No. 2008. రామలింగేశదండకము.

## RAMALINGĒSĀDANḌAKAMU.

..bstance, palm-leaf. Size, 15⅞ × 1½ inches. Pages, 4. Lines, 4 and 5 on page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writtng, fair, but not free from mistakes.

Begins on fol. 19*a*. The other works herein are Pātalu **5*a*, 25*b*, 38*a***, Kuravani 21*a*, **Hanumaddanḍakam** 29*a*.

Complete.

**Written** in praise of God Siva. The author is not known.

**Beginning :**

శ్రీపార్వతీమానసాంభోజభృంగా మహాదివ్యలింగా వృషాధీశ్వరారూఢ కేళీతురంగా జటాజూటగంగా సురాధీశవాగీశ శక్రాంతరంగానుమోదక్రియా పూజితాం ఘ్రిద్వయాసంగ సర్వేశ భూతేశ శ్రీదివ్యలింగావృషాధీశ్వరారూఢ కేళీతురంగా చతుర్వేద వేదాంత సార ప్రసంగా.

**End.**

ద్విజుల్ తత్త్వజుల్ జ్ఞానరూపంబులం దాల్పఁగాఁజేసి ముఖ్యప్రదేశంబులం గుంభకోణంబునం గాళహస్తిన్ మహాకంచి పట్నంబునన్ జంబుకేశస్థలిన్ నిమ్మమైశస్థలిన్ యందు సంపూర్ణరూపంబుయున్నట్లుగా రామకూరాద్రిపై యోగ్య భాగంబునన్ భక్తులన్ ఆయురారోగ్య సంపద్విశేషంబులన్ ఈప్సితార్థంబులన్ ఇచ్చు రామేశలింగా కృపాపాంగ సద్భక్తతేజోంతరంగా నమస్తే నమస్తే నమః.

(వి-వి)—

సమగ్రము. వ్రాఁతకుంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

శివస్తుత్యాత్మకమయిన దీ దండకము. ఇందుఁబేర్కొఁబడిన రామేశలింగస్వామి యేయూరవెలసిన వేల్పో?. కర్తపేరిందుఁ గానరాదు.

---

## No. 2009. రుక్మిణీనాథదండకము.

### RUKMIṆĪNATHADAṆḌAKAMU.

Substance, palm-leaf. Size, 6¼ × 1¼ inches. Pages, 10. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair, but full of mistakes.

Begins on fol. 46a. The other works herein are Aushdhayogasangraha 1a, Akrūradandaka 16a, Kṛṣṇadandaka 21a, Nārāyanāsataka 27a, Sabhapatınirvasanamu 37a, Sukarambhāsamvādamu 50h, Rāmanāmarāmāyanamu 52a, Sivalingakirtanamu 57a.

Complete.

A Dandaka in praise of Sri Kṛṣṇa. The name of the author is not known.

**Beginning :**

శ్రీ రుక్మిణీనాథ! లోకత్రయీనాథ! శ్రీ గోపికాధీశ! ఓ ద్వారకానాథ! నిత్యాత్మసాకార! ఓ లాలితాకార! ఓ భక్తమందార! ఓ భాగ్యగంభీర! ఓ రాజరాజేంద్ర! ఓ యాదవాచంద్ర! ఆనంద ముకుంద గోవింద సత్కీర్తి సంపన్న.

**End :**

గన్నొన్నంబాశ నిర్ముక్తులై పుణ్యగుణవంతులై భూరిమతిమంతులై ఆయురారోగ్యులై అతికలాభోగ్యులై సత్పుత్రవంతులై సకలసామంతులై నిత్యహరిదాసులై వైకుంఠవాసులై యుందురే సర్వముగా గందురే ఇందిరారమణమునివందితచరణ వైకుంఠ నీబంటు నీబంటు నపరాధి నపరాధి రక్షింపు రక్షింపు దేవా ! నమస్తే నమస్తే నమః.

సమగ్రము. వ్రాంత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

ఇది శ్రీకృష్ణస్తుత్యాత్మకము. కర్త పేరిందుఁగానరాదు.

ఇందలి గ్రంథాంతములకు అక్రూరదండకాలు చూచునది

---

## No. 2010. రుక్మిణీనాథదండకము.

## RUKMINĪNĀTHADANḌAKAMU.

Substance, palm-leaf. Size, $14\frac{1}{2}\times1\frac{1}{4}$ inches. Pages, 4. Lines, 4 on a pages. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair and not free from mistakes.

Begins on fol. 115a. The other works herein are Venkatēśaśatakamu 1a, Cencukathāgītamu 34a, Rāmāyaṇakathāgītamu 44a, Bhāgavatamu 49b, Kṛṣṇabālakrīdagātamu 106a, Ganıtaviṣayamu 117, Manucaritrādulalōnipadyamulu 124a.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంతతిన్నది. తప్పులున్నవి శైథిల్యము కలదు. గ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె.

ఇందలి గ్రంథాంతరములు.—1a వేంకటేశ శతకము, 34 a చెంచు కథా గీతము, 44 a రామాయణకథా గీతము, 49 b భాగవతము, 106a కృష్ణ బాలక్రీడా గీతము, 117 a గణిత విషయము, 124 a మనుచరిత్రాదులలోని పద్యములు.

---

## No. 2011. రుక్మిణీనాథదండకము.

## RUKMIṆĪNĀTHADANḌAKAMU.

Substance, palm-leaf, Size, $12\frac{3}{4}\times1\frac{1}{2}$ inches. Pages, 5. Lines, 4 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode o writing, good but not free from mistakes.

Begins on fol. 1a. The other work herein is Rūpāvatīdandakamu 4 a.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము. గ్రంథపాతములు లేవు.

పూర్వము వలె.

ఇందలి గ్రంథాంతరము 4 a రూపావతీ దండకము.

---

## No. 2012. విఘ్నేశ్వరదండకము.

## VIGHNĒŚVARADANḌAKAMU.

Substance, palm-leaf. Size, 15 × 1¼ inches Pages, 3. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, old Mode of writing, good, but not free from mistakes.

Complete.

Written in praise of God Vighnēśvara.

**Beginning :**

శ్రీ పార్వతీ పుత్ర లోకత్రయస్తోత్ర సత్పుణ్యచారిత్ర మహోన్నూలగాత్రా కాత్యాయి నీ నాథశంభువర పుత్ర స్వామి ! మీ సేవసేవింతు విఘ్నేశ్వరా !

**End :**

మున్నుగా నిన్నె ప్రార్థించెదగ నన్నుఁ గాపాడి రక్షించు వో భక్తమందార ఓ సంతతోద్ధార ఓ నిత్య నిర్వాణ ఓ లోకరత్నామణీ భానుకోటి ప్రకాశవాగీర నిత్యమాంబా పురావాస నా కోర్కులీడేర్చి ప్రత్యక్షమై నిచ్చి నన్ బ్రోవుమీ శ్రీమద్గణేశా నమస్తే నమస్తేనమః :

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

నిత్యమాంబాపురమున వెలసిన విఘ్నేశ్వరదేవుని స్తోత్రరూపమయిన దండకమిది. కర్త పేరెఱుఁగరాదు.

గ్రంథాంతమున " శ్రీమన్మహాదేవదేవుండవు శ్రీ నీలకంఠుండవు కారుణ్యజన్ముండవు కాలాగ్ని రుద్రుండవు రారాదు పోరోరి అని దక్షుఁడిట్లాడవిను వీరభద్రుండ శూరుండనే వీరభద్రుండవు " అని ఆద్యంతములుగల మూడుబంతుల వీరభద్ర దండక భాగము గలదు.

## No. 2013. విఘ్నేశ్వరదండకము.

## VIGHNĒŚWARADANDAKAMU.

Substance, palm-leaf. Size. 15⅜ × 1¼ inches Pages, 2. Lines, 5 on a page. Character; Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

In praise of Vighnēśwara workshipped at Nāgamāmbāpuram (?) The auther is not known.

**Beginning :**

శ్రీ పార్వతీపుత్ర లోకత్రయ స్తోత్ర సత్పుణ్య చారిత్ర భద్రేభవక్త్ర మహా గాత్ర కాత్యాయనీమోద సంభూత స్వామీ శివా సిద్ధ విఘ్నేశ నీ పాదపద్మంబులు న్నాభియున్స్వకంఠంబు నీ మోము నీ మౌళిబాలేందు ఖండంబు నీ నాల్గు హస్తంబు లుంగా.

**End.**

ఇన్నుదాఁ గోయ చందంబుగాదే మహాదేవ ఓ భక్తమందార ఓ నిత్యగీర్వాణ ఓ భానుకోటి ప్రభాభాస గౌరీశ లక్ష్మీశవాణీశ సంస్తుత్య శ్రీనాగమాంబాపురిన్నిల్చి మాకెప్పు డుం గోర్కు లిచ్చి రక్షింపవే శ్రీ గణాధీశ్వరా దేవదేవా నమస్తే నమస్తే నమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

నాగమాంబాపురమున వెలసిన విఘ్నేశ్వరదేవుని స్తుతిరూప మీ దండకము. కర్త పేరెఱుఁగరాదు.

---

## No. 2014. విద్యావతీ దండకము.

## VIDYAVATĪDANDAKAMU.

Substance, palm-leaf. Size, 14⅜ × 1¼ inches. Pages, 40. Lines, 5 and 6 on page. Character, Telugu. Condition; fair. Appearance, old. Mode of writing good free from mistakes.

Complete.

The story in this describes how the Pandya King Muddalpuri Bhū pāla loved a Courtezan by name Vidyāvati and made her prominent among his court dancers. Muddalpuri was a descendent of Visvanāthanāyaka. Tirumalanāyaka and Vīrappanāyaka were his grand-father, and father, and Cokkanathanāyaka was his brother. Ganapavarapu Venkatakavi is the author.

**Beginning.**

శ్రీ విశ్వనాథాన్వయాంభోధి చంద్రుండు... .....సత్కాశ్యపాఖ్య గోత్రుం
డు భాస్వచ్చరిత్రుండు శ్రీతిర్మలోర్వీతలాధీశ పౌత్త్రుండు వీరావనీపాల పుత్త్రుండు వీరాధి
వీర స్తుతోదారదోస్సార వచ్చొక్కనాథక్షితీశాగ్రణీ సోదరుం డాశ్రితత్రాణ బద్ధాద
రుండర్భక న్యాసమానోల్లసల్లింగమాంబావధూగర్భ శుక్తిస్ఫురన్మౌక్తిక శాకారుండై యొప్పు
ముద్దళ్ప రిక్షోణిపాలుండు............చోకాటంబుగా రాజసంబెచ్చనిం డోలగంబుండి
విద్యావినోదంబులం గొంత ప్రొద్దింపు సొంపొంది శ్రీరంగనాథున్ కృపావాహినీనాథు సేవిం
ప భావంబులోనెంచి.............వాహ్యాళిగా వచ్చునవ్వేళఁ దత్పౌర వారాంగనాకోటి
వీక్షింప నాస్త్రీలలో...........మాద్యద్వయస్సీమ విద్యావతీభామ మేల్వాలుకన్
జెప్ప లల్లార్చ వీక్షించి సంగం బపేక్షించి ........ఉన్నట్టి యయ్యిందు బింబాస్యచందం
బు వేఱొక్క చెల్కత్తెలోఁ దత్తఱంబెంచ మాయంపు బల్వెల్లియై యున్న యాతల్లి కిం
జెప్పినన్ ..............ముద్దళ్పరిస్వామి తోఁగూట మప్పౌరవారాంగనాకోటిలో
నేరికైనన్ మహాదుర్గమం బస్వతంత్రంబు........అట్టి చందంబు డెందంబునం గోరి.
కామించి నా మాటలన్ మీఱకే........అంచెంతయున్ గంగడోల్ రీతి దుర్నీతులన్
జాలబోధించు మాతన్.........పొమ్మంచుఁ గెమ్మోవి కంపింపఁగాఁ బల్కుచున్......
ఒద్దికైకోమికి శాతోదరిన్ సోదరిన్ జూచి......రాపొందు రాజిల్లఁగాఁ జేయు వేయ
ప్ప బంగారు కుప్పాకకుప్పాళి పాలించు రామప్ప మేలందు భాషించు భూషించు కన్యా
లలామంబునుం బ్రేమ మీఱన్ విలోకించి........ఈ ప్రౌఢ ముద్దళ్పరిచోణి పాలావతం
సంబు సాన్నిధ్యముం జేరి నీ చందమందంబుగాఁ జెల్పిపిల్పింతు........అంచున్ సు
మాళంబు మీఱంగ లాలించి......అమ్ముద్దు వీరక్ష్మాపాల జాతున్ గవీంద్రావళీపారి
జాతున్ విలోకించి హైవంచిదండంబు గావించి ..... కర్ణాటసింహాసనాధ్యక్షు ముద్దళ్ప
చోణి పాలావతంసా...............మాద్యద్వయస్సీమ విద్యావతీభామ వర్ణింపుచున్
నిన్నె నేమీరు వాహ్యాళి వేరంగ సంతోషమూ రంగమారామచే రంగ శ్రీరంగనాథున్ మ
దిన్ భక్తి తేరంగ సేవించి రా గన్నులన్ గన్నదై మున్ను మీరూపరేఖా విలాసంబులన్
విన్నదై నీదుపారంబులన్ జేరఁగా నెంచి నిల్పోపదింక స్వామి చిత్తంబు మాయింతిభాగ్యం
బటంచున్ సుమాళంబుగాఁ బల్కు కల్కిం గటాక్షించి వాక్చాతురిన్ మెచ్చి.........
రప్పించి తన్మాతకున్ నీతమానట్టుగాఁ జిత్రశాటీ ధనగ్రామరత్నాదులన్ బ్రీతిగావించి
.........విద్యావతీకన్యకారత్న మాత్మీయమానాట్య శాలాస్థలీ పాత్రలందెల్ల సన్మాన
పాత్రంబుగా..... బాహ్యాతులోర్వ్య పరిక్రీడలన్ మన్మథా భోగసామ్రాజ్య భోగంబులన్
దేలి చౌకాటపుంగుందనం బందు రాణించు మాణిక్యమున్నట్టు శ్రీమించి వర్ధిల్లు
చున్నాఁడు.

**End.**

గుణామేయ లక్ష్మీనివాసస్ఫురత్పాండ్య సింహాసనాధ్యక్షు పేరన్........జయో
చాత్త ముద్దళ్పళిక్ష్మాతలాధీశు పేరన్ వృషాద్రీశ సంకాశు పేరన్ మహాలక్షణ గ్రంథ భా

పాభిధాన ప్రథామాధురీ సాధురీత్యర్థవచ్ఛబ్దబంధానుబంధ ప్రబంధాధినాథాప్ప యరా మాత్యరాడ్వేంకటార్య ప్రణీతంబుగాఁ బొల్చు నా పుష్ప కోదండకంబైన విద్యావతీదండకం బుర్వి నా చంద్రతారార్కమై యొప్పు నెల్లప్పుడున్.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు :—

" విక్రమనామ సంవత్సర కార్తిక శు 10 సోమవారం నిడిమామిళ్ల రాయుల య్యగారి ప్రతి ప్రకారం మాజేటి సర్వేశలింగం పుదిచేరిలో వ్రాస్తిని. "

(వి-వి.)—

సగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పాండ్యమండ లాధీశ్వరుఁడు, విశ్వనాథ నాయకుని వంశమువాఁడు. తిరుమల నాయకుని పౌత్రుఁడు వీరప్ప నాయకుని పుత్త్రుఁడు, చొక్కనాథ నాయకుని సోదరుఁడునగు ముద్దళ్ళరి భూపాలుఁడు విద్యావతియను విలాసవతిని (వేశ్యను) ప్రేమించుట, తన నాట్యస్థలీ పాత్రలందు సమ్మానపాత్రముగాఁ బరిగ్రహించుట, యిందు కథా విషయము. బమ్మెర పోతరాజుగారు రచియించిన భోగినీదండకపుఁ బోలిక నీ దండకము గలదు. సర్వలక్షణ శిరోమణి, ప్రబంధరాజ విజయ వేంకటేశ్వర విలాసము మొదల యిన మహాగ్రంథముల రచియించిన గణపవరపు వెంకటకవి యేతత్కృతి కర్త. విశేషముల కుదాహృతగ్రంథ భాగముఁ గాంచునది.

---

## No. 2015. విష్ణు దండకము.

## VISNUDANDAKAMU.

Substance, palm-leaf. Size. 12⅞ × 1⅛ inches. Pages, 8. Lines 4 on a page, Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

A prayer addressed to God Visnu. The author is not known.

**Beginning :**

శ్రీ నాథనాథా జగన్నాథ నప్రైక రక్షా విపక్ష క్షమాభృత్సహస్రాక్ష నీరేజపత్రేక్షణా దేవదేవా భవద్దాసదాసోప వర్గోపతాపంబులం బాసగా నోవ దివ్యాత పత్రంబునంబొల్చు యుష్మత్పదాంభోజ మూలంబు పుణ్యాలవాలంబు గాఁబొంది సంసారతాపంబులంబోవఁగా మీటివర్తింతు రో తండ్రి యీరాశా ! సమస్తాగ.

**End :**

మాకర్ణ జగత్కల్ప నాశక్తికిన్ నెన్న మీశక్తితోడ్పాటుభావించి విజ్ఞానమం జూపి కారుణ్య సంధాయివై మమ్ము రక్షింపు లక్ష్మీనువక్ష పల్వలక్రోడ యోగీంద్ర కేశవ్న శోహం సదేశాధిదేవా నమస్తే నమస్తే నమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యములేదు. గ్రంథపాతములు లేవు.

విష్ణుస్తుతి యిందలి విషయము. కర్తపే రుఁగరాదు. మహాభాగవతము లదండ కము ' అని తాటియాకు మీఁద నిది పేర్కొనఁబడినది.

---

## No. 2016. వీరభద్ర దండకము.

## VĪRABHADRADANDAKAMU.

Substance, palm-leaf. Size, $12\frac{3}{4} \times 1\frac{1}{8}$ inches. Pages, 4. Lines, 4 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Written in praise of Virabhadraswāmi, son of God Siva. The author is not known.

**Beginning :**

శ్రీమన్మహాదేవ శ్రీనీలకంఠుండు కారుణ్యజన్ముండు కాలాగ్ని రుద్రుండు పైచెమట రుద్రుండు తా వీరభద్రుణ్ణిగా జేసి శీఘ్రంబు దక్షయాగంబులోఁ జొచ్చి.

**End.**

స్తోత్ర్యమోదంబుగా జోడువిజ్ఞోజుగా తలఁచు దోర్దాడగా నంతదక్షుండు నాలేచి దండంబు దండంబు వో వీరభద్రుండ వో శంభుపుత్రుండ నాపాలిదేవుండ నీకు సాష్టాంగ దండప్రణామంబు సేవింతు భావింతు నోవీరభద్రా నేనెంతవాడన్ మతిన్ నన్ను మన్నించు మన్నించుకో భూరిసింహాసనాధీశ్వరా.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులున్నవి. శైథిల్యములేదు. గ్రంథపాతములు లేవు.

శివుని చెమ్మటనుండి జనించిన వీరభద్రస్వామి స్తుతిరూప మీ దండకము. కర్తపేరు తెలియరాదు.

## No. 2017. వీరభద్రదండకము.

## VĪRABHADRADANDAKAMU.

**Substance, palm-leaf. Size, $15\frac{1}{2} \times 1\frac{1}{4}$ inches. Pages, 3. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured Appearance, old. Mode of writing fair but not free from mistakes.**

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాత ములు లేవు. పూర్వము వోలె.

---

## No. 2018. వీరభద్రదండకము.

## VĪRABHADRADANDAKAMU.

Substance, palm-leaf. Size, $15\frac{5}{8} \times 1\frac{1}{8}$ inches. Pages, 3 Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair but full of mistakes

Begins on fol. 27*a*. The other work here in is Ēgaṇṭivārivacanamu with commentary 1*a*.

Complete.

Written in praise of God Vīrabhadra who destroyed the sacrifice of Daksa. The author is not known.

**Beginning:**

శ్రీ వీరరూపా శివద్రోహగండా ప్రచండప్రతాపా సుపర్వాణసంఘా తమోభాను బింబ ప్రదీపా మహాకోపవీరాంక వీరా పురారాతి సంహార ఘోరావతారా శివాచార బృందారకాధీశ గర్వాపహారా భయాకార నాగేంద్రహారా.

**End:**

ఓ దేవదేవేశ దేవా మహాదేవ నీవెంకలంబైన నీదానులంబైన మమ్ముఁ దయాళుం డవై ప్రీతి రక్షింపవే దేవ వేరెవ్వరుం గానఁగాలేరు నేరంబు సైరింపవే దేవ మేలున్విచా రించవే దేవ శ్రీ వీరభద్రా శరణ్యంబు రుద్రా నమస్తే నమస్తే నమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు చాలఁగలవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

దక్షాధ్వరధ్వంసము జరపిన వీరభద్రస్వామి స్తుతి సూచు మీదండకము. కర్తపే రిందుఁగానరాదు.

ఇందు గ్రంథాంతరముగలదు. 1 (a) ఏగంటివారి వచనము సవ్యాఖ్యానము

## No. 2019. వేంకటేశ్వరదండకము.

## VĒNKATĒŚWARADANDAKAMU.

Substance, palm-leaf. Size, $17\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches Pages, 3. Lines, 7 on a page. Character, Telugu. Condition, injured. Mode of writing not bad but full of mistakes.

Begins on fol. 50*a*. The other works here-in are—Bhāskararāmāyaṇamu 1*a*, Mācāsṭakamu 48*a*, Tārāvalidanḍakamu 50*a*, Rāmadanḍakamu 60*a*, Gaṇitaviṣayamu 67*a*, Sankara Granthamu 78*a*.

Complete.

A prayer addressed to God Venkateśvara worshipped by Pandra Hēmādrirangēndra in his house, in the form of Kalyāṇakṛṣṇa. Rangendra appears to be the patron and not the author.

**Beginning:**

శ్రీమద్రమానాథ సేవాసమాయాత దేవాసుర వ్రాతమాణిక్య మౌళిచ్ఛటాకాంతి జాలస్ఫుటీ భూతనై జాంఘ్రికం జాతయుగ్మంబు మన్మాన సాంభోజ కింజల్క పీఠస్థలిన్ నిల్పియుష్మత్కృపా లబ్ధమాధ్వీక మాధుర్య వాక్చాతురింజా లవర్ణించెదన్. నీవు అంభోధి మధ్యంబునందుండి దిఙ్మండల వ్యాప్తచండప్రభా భాసమానుండవైయున్న దైత్యారి నీనాభికం జాత సంజాతుఁడైనట్టి యాధాత కౌతూహలంబంద డెందంబుతో నెంచి మత్స్వా కృతిన్మించి—

**End:**

చాల రంజిల్లఁగాఁజేసి సంభోగ సౌఖ్యాబ్ధిలోఁ దేలుచున్ లేచి చింతామణీ భామ తోఁగూడ సానందతన్ అండజాధీశుపై నెక్కి ముఖ్యా శ్రితానేక సద్భక్త సందోహ మున్ గొల్వ రంజిల్లఁగా వచ్చి పంద్రాన్వయాంభోధి సంభూత కల్పద్రుమాకల్పు హేమాద్రి రంగేంద్రు సన్మందిరావాసివై చాల పోషింపుచున్నుండి కళ్యాణ కృష్ణ స్వరూపంబునన్ నొప్పు శ్రీ వెంకటేశా రమేశా కృపాదృష్టితోఁ జూచి రక్షింపవేమమ్ము నీ దండకం బుర్వినాచంద్ర తారార్కమైయుండ శ్రీశా నమస్తే నమస్తే నమః॥

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాత ములు లేవు

వేంకటేశ్వరస్వామి స్తోత్రాత్మకమీ దండకము. పంద్ర-హేమాద్రి రంగేంద్రుని (?) యింట కళ్యాణకృష్ణ స్వరూపమునఁ బూజింపఁబడుచుండినట్టుగా వేంకటేశ్వరస్వామి స్తుతింపఁబడెను. ఆ రంగేద్రుఁడు కృతి ప్రేరకుఁడుగాని కృతి కర్తగాని కావచ్చును.

ఇందీ గ్రంథాంతములు గలవు—

1*a* భాస్కర రామాయణము. 48*a* మాచాష్టకము. 52*a* తారావళీ దండకము. 60*a* రామ దండకము. 67*a* గణిత విషయము. 78*a* సంకర్ణ విషయములు.

## No. 2020. వేంకటేశ్వరదండకము.

## VĒNKATĒŚVARADANDAKAMU.

Substance, palm-leaf. Size, $14\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches. Pages, 10 Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured Appearance, old. Mode of writing, fair and free from mistakes.

Begins on fol. 1*a*. The other works herein are Prasannavēnkatēśvaramanjari 6*a*, Gēyamulu 18*a*

Complete.

Written in praise of Sri Vēnkateśvara

**Beginning:**

శ్రీ మత్పద్మాకాంత కాంతోరురత్న ప్రభాభాసు సాహస్ర దీప్యత్కిరీటా జగత్పూరి తాంబరా ఘనధ్వాంత విధ్వంస సంపూర్ణ చంద్రార్క బింబద్యుతి స్నిగ్ధ జగ్ధోజ్జ్వల త్కుండలా పుండరీకోద్భవాఖండలేశాన ముఖ్యామరానందసందోహ సంధానకృద్భూంఘు మధ్యాన రాకేందు శోభాభి రమ్యాబ్జ హస్తా సురద్విట్ప్రపక్షేదనోదార ధారాపరి స్ఫూర్తిసక్రాంగ విచ్ఛేద చక్రాయుధా.

**End:**

శ్రీ వేంకటేశా భవద్భక్తుండన్ గాన నావిన్నవింపంగనైనట్టి యీ దండకంబందు న్యూనాతిరిక్తాపశబ్ద క్రియాహీనముల్ కల్గినన్ దోషముల్ మాన్పి మాపాలి వేల్పైన శ్రీరామ చంద్రుడవై నీవె కైకొమ్ము నీకున్ సమర్పింపనే నెవ్వండన్ సర్వలోకాత్మకా సర్వభూతాత్మకా సర్వగా శర్వరీనాథ కంజాక్షనేత్రా భవన్నవ్య చారిత్రముల్ గల్గి చెల్వొందు నీ దండకం బెవ్వరే విన్న వర్ణించినన్ వ్రాసినన్ సంతతాయుష్యముల్ చాల సౌభాగ్యముల్ పుత్రలాభంబులున్ మిత్ర సందోహముల్ రాజ పూజ్యంబు లారోగ్యముల్ నిత్య మాంగల్యముల్ నిత్య సంతోషముల్ కల్గియుండం గటాక్షించి తౌకన్న గారి ధ్వజా యిందు తారార్క పర్యంత మీ దండకం బందమై భూతలంబందు చెన్నొంది యుండంగఁ బాలింపుమీ యిందిరానాయకా మందరోద్ధారకా భక్తమందార తుభ్యం నమస్తే నమస్తే నమః.

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

వేంకటేశ్వరస్వామి స్తుతియందలి విషయము. కర్తపే రెఱుఁగరాదు.

---

## No. 2021. శక్తిదండకము.

## ŚAKTIDANDAKAMU.

Substance, palm-leaf. Size, $10\frac{5}{8} \times 1$ inches. Pages, 11. Lines, 4 on a page. Character. Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 1*a*. The other work herein is Kanakadurgadaṇḍakamu 6*b*.

Complete.

Written in praise Goddess Śakti. The name of the author is not known.

**Beginning:**

శ్రీమన్మహాదేవతా చక్రవర్తి జగద్రూపిణీ రూపలోక ప్రసక్తి మహర్లోక లోకాను సంధానయుక్తి పరంజ్యోతి జ్యోతిర్మయానందమూర్తీ అగణ్య స్వరూపావదాన ప్రవర్తి భక్త లోక ప్రసక్తి, త్రికాలస్వరూపి మహామాయ శక్తి.

**End:**

నేఁడు నావిన్నపం బొక్కటాలించి లాలించి మేలించి తేలించి నీకన్న దైవంబు లింకెవ్వరే భద్రకాళీ......త్రిశూలీకపాలీ యే(ప్రొ)ముక్కెదమ్మా......మేలుగీలింపవే సంపదల్ నింపవే కొమ్మ పూగొమ్మ బంగారు బొమ్మా దయాంభోధివమ్మా కృపం జూడవమ్మా భవానీ కటాక్ష ప్రదా నీ మహాదేవు రాణీ నమస్తే నమస్తే నమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు.

శక్తి స్తుతియిందలి విషయములు. కర్తపే రెఱుఁగరాదు.

గ్రంథాంతరము—

6*a* కనదుర్గ దండకము.

---

## No. 2022. శరభేశ్వరదండకము.

### ŚARABHEŚVARADANDAKAMU.

Substance, palm-leaf. Size, $13\frac{1}{2} \times 1$ inches. Pages, 12. Lines, 5 and 6 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete.

Written in praise of God Vīrabhadra worshipped at Kūcimancipura. The author is not known.

**Beginning:**

శ్రీ కూచి మంచీపురాధీ [శానధీశుండు కేశే]శ్వరస్వామి గౌరీ సమేతుండు కైలాసశైలంబుపై మించి పేరోలగంబుండఁగా తారకారాతి యేతెంచి దండప్రణామంబు గావించి దేవా పురారాతి మీచేతి జ్యోతిర్మయంబైన కంకాళ దండంబు.

**End**

చేకూరు కళ్యాణ సంతాన సౌభాగ్య సంపత్సమృద్ధుల్ శివజ్ఞాన వైరాగ్య సంజాత ని్శ్రేయసానందులంజేసినట్ సత్కారకార కారాతి నీతత్త్వమేవింటి ధన్యుండనైతిట్ విశ్వ విశ్వేశ్వరా భద్ర చింతామణీ చంద్ర చూడామణీ మహాదేవదేవా నమస్తే నమస్తే నమః.

గ్రంథాంతమందలి వ్రాఁత గలదు :—

"సర్వధారినామ సం॥ భాద్రపద శు॥ సప్తమీ మంగళవారం పుదిచ్చేరిలో మాజేటి సర్వేశలింగం వ్రాశెను."

(వి.వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు.

ఇది కూచిమంచిపురమున వెలసిన వీరభద్రస్వామి స్తుత్యాత్మక మీ దండకము. కర్త పేరెఱుఁగరాదు.

---

## No. 2023. శివ దండకము.

## ŚIVA DANDAKAKU.

Substance, palm-leaf. Size, 8¼ × 1⅝ inches. Pages, 25. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, bad and full of mistakes.

Complete.

Written in praise of Siva, deals also about yōga and Vēdanta. The author is not known.

**Beginning :**

శ్రీమత్పరంజ్యోతిరాకార రాకార మచ్ఛతభాను ప్రతీకాశ యాకాశకేశా మహేశా కిరీశావిరాజత్ క్రియాశక్తిమార్గంబునట్ ప్రాణవాతంబు పూతంబుగా నిల్పి జాగ్ర . . . బ్రహ్మాది దైవంబు మేల్గాంచి మేల్కుండనచ్ఛాయలోఁగుల్కు నాధార చక్రంబు పత్రంబులట్ నాల్గిట్ వాదిసాంతాక్షరంబు ల్వేసంబూర్వదిగ్భక్ష్యముంగా . . . తిష్ఠించి భక్తస్థలంబంచుభావించి యాత్మన్నురుత్వంబునందించి సౌచిత్త

**End :**

మేల్పొందఁగాఁజేసి బొమ్మలంజేసి బల్లిళ్ల గల్పించి తత్పూత్రముల్ పూనియాడించినట్లీశ్వరుసుం బంచభూత ప్రకాయంబులం వాదజం ఘోరు సందియ్యబయ్యడుం భానుకోటి ప్రభాభాసురా మమ్ము సంపూర్ణ కారుణ్యదృష్టి న్విలోకించి మత్సంశయచ్ఛేదకుంజేసి రక్షింపు సాగాంగరంగత్తురంగోత్తమాంగా విరూపీకృతానంగ విచ్ఛేదితానల్పమాతంగ

విక్షిప్త హస్తాబ్జసారంగ వేదాళిభాస్వత్తురంగా విలాసోత్తురంగాంబుధి స్ఫారఘూణీరసంగా విలీనాస్మదీయాంతరంగస్ఫుటాదర్శబింబస్ఫురత్సంగమేశాఖ్యలింగా నమస్తే నమస్తే నమశ్శి.

(వి-వి).—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పు లున్నవి. శైథిల్యము గలదు. గ్రంథ పాతములు గలవు.

యోగవేదాంత విషయప్రతిపాదన పూర్వకము గా నిందు శివస్తుతి గలదు. ఈ ప్రశస్త దండకమునకుఁ గర్త యెవరో యెఱుఁగరాదు.

గ్రంథాంతమున నైదు పుటలలో శివునిమీఁది మంగళము పాటలు గలవు.

---

## No. 2024. శివ దండకము.

## ŚIVA DANDAKAMU.

**Substance, palm-leaf. Size, 16⅛ × 1⅜ inches. Pages, 9. Lines, 6 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.**

**Begins on fol. 55a. The other works herein are—Atmadarsanamu 1a, Jevesvara nirnayamu 10a, Kirtana 14b, Sitārāmānjaneyamu 17a, Misrarpanamu 21a, Kirtanalu 28a, Jivesvarasambandamu 49a, Dvādaśa manjarika stotramu 59a, Parabrahma Sakalavailakṣanya nirnayamu 67.**

**Complete.**

**Same work as the above.**

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

గ్రంథాంతమందీవ్రాఁత గలదు.

"బహుధాన్యనామ సంవత్సర మాఘ బ॥ 7 జయవారం సక్కు వ్రాసినది."

ఇందలి గ్రంథాంతరము లివి :—

1a ఆత్మదర్శనము, 10a జీవేశ్వరనిర్ణయము, 14b కీర్తన, 17a సీతారామాంజనేయము, 21a మిశ్రార్పణము, 28a కీర్తనలు, 49a జీవేశ్వరసంవాదము, 59a ద్వాదశమంజరికా స్తోత్రము, 67 పరబ్రహ్మసకలవైలక్షణ్య నిర్ణయము.

---

## No. 2025. శివ దండకము.

## ŚIVA DANDAKAMU.

Substance, palm-leaf, Size $12\frac{3}{4} \times 1\frac{1}{8}$ inches. Pages, 2. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair, not free from mistakes.

Begins on fol. 1*a*. The other work herein is Hanumaddandakamu 3*a*.

Complete.

Written in praise of god Siva.

**Beginning :**

శ్రీకంఠలోకేశ లోకోద్భవస్థాన సంహారకారీ పురారీ ముకుందప్రియా చంద్రధారీ మహేంద్రాది బృందారకానందసందోహ సందాహి పుణ్యస్వరూపా విరూపాక్ష దక్షాధ్వరధ్వంసకా దేవ నీవైన తత్త్వంబు.

**End:**

బిద్ధసాధ్యోరగేంద్రుల్ సురేంద్రాదులకా శాశ్వతైశ్వర్య సంప్రాప్తులై యీశ్వరా విశ్వకర్తాసురాభ్యర్చితా మాకు నభ్యర్చితంబుల్ ప్రసాదింపు కారుణ్యత్రైలోక్యనాథా మహాదేవదేవా నమస్తే నమస్తే నమః.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లమితము. శైథిల్యము లేదు. గ్రథం పాతములు లేవు.

శివస్తుత్యాత్మక మీదండకము. కర్తపే రెఱుంగరాదు.

ఇందే గ్రంథాంతరము గలదు. హనుమద్దండకము. 8*a*.

---

## No. 2026. శివ దండకము.

## ŚIVA DANDAKAMU.

Substance, palm-leaf. Size, $12\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 2. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Begins on fol. 8*a*. The other work herein is Kālahastisvara dandakamu 1*a*.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు. పూర్వమువోలె.

ఇందలి గ్రంథాంతరము. 1*a* శ్రీకాళహస్తీశ్వర దండకము.

---

## No. 2027. శివ దండకము.

## ŚIVADANDAKAMU.

Substance, palm-leaf. Size, 12×12½ inches Pages, 8 Lines, 6 on a page. Character, Telugu. Condition good. Appearance, old. Mode of writing, not good and full of mistakes.

Complete.

Written in praise of Siva. The author is not known.

**Beginning:**

శ్రీ దివ్యమూర్తి జగద్రక్షవార్త్రి పరబ్రహ్మరూపుఁ బరజ్ఞానదీపుఁ విషజ్వాలభక్తుఁ బుషి స్తోత్రమదక్షుఁ వరంనీల ప్రశస్తుఁ త్రిశూలైణహస్తుఁ నిజధ్యానలోలుఁ గజా చర్మచేలుఁ శివస్ఫూర్తి నాముఁ . . . .

**End:**

గంగాధరా యెప్పుడుఁ భక్తులంగాచి రక్షించుమీ దేవా నమస్తే నమస్తేనమ:

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది. తప్పులున్నవి. శైధిల్యము, గ్రంథపాతములు లేవు. శివస్తుత్యాత్మక మీ దండకము. కర్త పేరెఱుఁగరాదు.

---

## No. 2028. సంగమేశ్వర దండకము.

## SANGAMĒŚVARADANDAKĀMU.

Substance, palm-leaf. Size, 8⅝×1⅜ inches. Pages, 25. Lines, on a page Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing not good and not free from mistakes.

Begins on fol. 1a. The other work here in is Pātalu 13a.

Complete.

Written in praise of Siva. The author is not known.

**Beginning:**

శ్రీమత్పరంజ్యోతిరాకారరాకారమధ్యేశభాను ప్రతీకాశ యాకాశ కేశా మహేశా గిరి . . . . విరాజత్త్రియాశక్తి మార్గంబునం బ్రాణ వాతంబు పూతంబుగా నిల్పి జాగ్రదవస్థ.

**End :**

భానుకోటి ప్రభాభాసురామమ్ము సంపూర్ణ కారుణ్యదృష్టిన్ విలోకించి మత్సంశ యచ్ఛేదముం జేసి రక్షింపు మోగాంగ రంగత్తురంగోత్తమాంగా వియాపీకృతానంగ విచ్ఛే విత్తా నల్పమాతంగ విశ్లిష్టపుష్పాబ్జసారంగ వేదాళిభాస్వత్తురంగా విలాసోత్తరంగాంబుధి స్ఫారతూణీరసంగా విలీనాస్మదీయాంతరంగస్ఫుటాదర్శబింబ స్ఫురత్ఫుంగమేశాఖ్యలింగా ! నమస్తే నమస్తేనమః.

(వి-వి).—

సమగ్రము. వ్రాంత తిన్ననిదిగాదు. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు గలవు.

శివస్తుత్యాత్మకమైన యీ దండకమును రచించినదెవరో తెలియదు.

ఇందీ యితర గ్రంథము గలదు. 13a పాటలు.

---

## No. 2029. సిద్ధేశ్వర దండకము.

## SIDDHĒSVARADAṆDAKAMU.

**Substance, paper. Size, $7\frac{1}{2}\times 7$ inches. Pages, 13. Lines, 23 on a page. Character, Telugu. Condition, very much injured Appearance, old. Mode of writing, not good and not free from mistakes**

Begins on fol. 62a. The other works herein are. Rāghavapāṇḍaviyamu 1a Siddhēsvaravasantavilāsamu 58a.

Complete.

Written in praise of Siddhēsvara worshipped at the village Kalkuda in Cuddapah district. The author is Venkatācalakavi, son of Ramaṇayamātya. He is also the author of Siddhēsvaravasantavilasamu.

**Beginning :**

శ్రీమన్ మహాదేవదేవుండు వామాంక గౌరీవిలాసుండు వాసుక్య భూషాంగదాంగుండు వాణీశ గర్వాపహారుండు దైత్యేంద్ర సాంద్రప్రతాపాటవీధ్వంస వైశ్వానరుండై సదా భక్తకల్పద్రుమాఖ్య ప్రియుండై వెలుంగీయ శ్రీ కల్కుడ గ్రామ శ్రీసిద్ధలింగేశునిన్ సన్నుతుల్ జేతు శ్రీకేశవస్వామి సంపూర్ణకారుణ్య వాత్సల్యతన్ దోచునా రీతి నే విన్నవింతున్ ధరన్ పూర్వకాలంబు త్రేతాయుగంబందు ఇక్ష్వాకు వంశోద్భవుండైన శ్రీరామచంద్రుండు దా పుష్పకారూఢుడై వచ్చి రామేశునందున్ ప్రతిష్ఠించి కావేరి దర్శించి కాంచీపురంబున్ ప్రవేశించి సౌవర్ణ వర్ణాముష్మాలలలున్నాడి సద్బంధు వర్గబులువొల్ల గావచ్చి బాహూనదీ ప్రాంతభూమిన్ . . . . . . మనోరాగుడై యొప్పునా చక్కి విశ్రాంతమున్నొంది శ్రీరామచంద్రుండు యాకాశానకున్ జూచి యీ

తీరమే తీరమే తీరమీ చక్కనైవ్వారలుందు రీవర్తమాన . స్థారముఙ్గావచింపుండు మీరన్న నాశౌనకుం డిట్లనెఙ్—

*    *    *    *

కపిలహాని యూశౌనకుండావి సన్మానివర్గంబుతో సిద్ధలింగేశుడేలాగు నే జాగలో నుద్భవంబయ్యెనో తెల్పుమన్నంత నాశౌనకుం డప్పుడుం దెల్పె—

*    *    *    *    *    *

**End :**

వెసఙ్ శౌనకుండంతయుం దెల్పగా నాకపిల్షౌని సమ్మోదముం జెంది నిట్లంచు నీపుణ్య చారిత్ర మెవ్వారలున్విన్న దీర్ఘాయురారోగ్య వంశాభివృద్ధుల్ తగఙ్ గల్గి నంచుఙ్ మహిఙ్ నొప్పు పెంపారగా దొట్టిపల్ గ్రామవాసాద్యుడైనట్టి నందాపురీవంశ పాథోధి చంద్రుఙ్ భరద్వాజ గోత్రుండు వెంగన్నకుఙ్ పుత్రుడఙ్ రమణయామాత్య పుత్రుండనే వెంకటాచల్మనేవాడ సిద్ధేశ్వర ప్రీతిగా నెమ్మి నిర్మించి తీ దండకంబుఙ్ నమస్తే నమస్తే నమః

శ్రీ కల్కుడ సిద్ధేశ్వర దండకం సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము చాలఁగలదు. గ్రంథపాతములు గలవు.

కడప మండలమున సిద్ధవటమునకిర్వది క్రోసుల దూరమున బాహుదానది (చెయ్యేరు) దక్షిణ తీరమునఁగల కల్కుడ గ్రామమున వెలసిన సిద్ధేశ్వరస్వామి మాహాత్మ్య ప్రతిపాదకమయిన దండకమిది. ఇందుఁ జంద్రగుప్తుని కుమార్తె కల్లుకుండ బెట్టుటచే నా గ్రామమునకా పేరు వచ్చినదని మాహాత్మ్యము తెల్పుచున్నది.

కర్త వెంకటాచల కవి. రమణయామాత్యుని కుమారుఁడు ఈతఁడే సిద్ధేశ్వర వసంత విలాసమను పదరచనమునుకూడ రచించినాఁడు. అందు సిద్ధేశ్వరస్వామి ఉత్సవ విశేషాదులు వర్ణింపఁబడినవి. అదియు నీ ప్రక్కనే యున్నది.

ఇందీయితర గ్రంథములున్నవి. 1a రాఘవ పాండవీయము, 58b సిద్ధేశ్వరవసంత విలాసము.

---

## No. 2030. సూర్య దండకము.

## SŪRYA DANDAKAMU.

Substance, palm-leaf. Size, 12¾ × 1¼ inches. Pages, 5. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete.

Written in praise of Sun. The author is not known.

**Beginning :**

శ్రీ మన్మహాకశ్యప బ్రహ్మపుత్త్రా జగన్మిత్ర శ్వేతాబ్జ(ర్క) పుత్త్రాయ చారిత్ర హేమ ప్రకాశాగ్రహాధీశ శ్రీమంత ధీమంత యోభాను మంతా వివస్వంత.

**End:**

సూర్యాత్మకా మీదండకం బెవ్వరైనన్ ప్రభాతంబునన్ లేచి నేమంబుతో జన్ బఠించినన్ నీ ప్రసాదంబులన్ మేలు గుఱ్ఱంబులున్ మెచ్చు రాజ్యంబులున్ చామరో దోళికా చ్ఛత్రముల్ పాలకీల్ గల్గి ప్రావీణ్యులై గణ్యులై యుందురో శ్రీసూర్యనారాయణ దేవా నమస్తే నమస్తే నమః

(వి-వి.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పులు చాల గలవు.

సూర్యస్తుత్యాత్మకమయిన దండకమిది. గ్రంథకర్త పేరిందుఁ గానరాదు.

---

## No. 2031. సూర్య దండకము.

## SURYA DANDAKAMU.

**Substance, palm-leaf. Size $10\frac{1}{2} \times 1\frac{1}{8}$ inches. Pages, 5. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.**

Begins on fol. 1a. The other work here in is Sūryadandakamu 3b

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత తిన్ననిది. తప్పు లున్నవి. శైథిల్యగ్రంథపాతములు లేవు. పూర్వము వోలె.

ఇం దీగ్రంథాంతరము గలదు. ౹ె౩ సూర్య దండకము.

---

## No. 2032. సూర్య దండకము.

## SŪRYA DANDAKAMU.

**Substance, palm-leaf. Size, $12\frac{3}{4} \times 1\frac{1}{8}$ inches. Pages, 6. Lines, 4 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.**

Complete.

Same work as the above.

(వి-వి).—

సమగ్రము. వ్రాతతిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు. పూర్వము వోలె.

## No. 2033. సూర్య దండకము.

## SŪRYA DANDAKAMU.

Substance, palm-leaf. Size, 16½ × 1¼ inches. Pages, 3. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing fair, but not free from mistakes.

Complete.

A prayer addressed to Sun God.

**Beginning:**

శ్రీ సూర్యనారాయణా వేదపారాయణా ఆర్త రక్షామణీ దైవచూడామణీ విశ్వ భర్తానమో విశ్వకర్తానమో దేవతాచక్రవర్తీ పరబ్రహ్మమూర్తీ జగద్గీతకీర్తీ త్రిలోకైక నాథా.

**End:**

ఖిన్నుఁడఁగా నన్ను మన్నించు, అన్యథా నాకు నండెవ్వరుఁగా లేరు దుశ్చింతలం బాయఁగాఁజేయవే కామితార్థ ప్రదాయయినట్టి మూఁడక్షరాల స్వరూపంబు వ్రాసి కీర్తించి విన్న.........కొంగుబంగారు తంగేడుజున్నై భవించుఁగా భవించుఁగా మహా దేవదేవా నమస్తే నమస్తేనమః.

(వి-వి).—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. తప్పులమయం. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

సూర్యస్తుత్యాత్మక మీదండకము. కర్తపేరిందుఁ గానరాదు.

---

## No. 2034. సూర్య దండకము.

## SŪRYA DANDAKAMU.

Substance, palm-leaf. Size, 10½ × 1⅛ inches. Pages, 4. Lines, 5 on a page. Character, Telugu. Condition, good. Appearnce, old. Mode of writing fair, but not free from mistakes.

Begins on fol. 3b. the other work herein is Sūryadaṇḍakamu 1a.

Complete.

Same work as the above.

(వి. వి) —

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు. ఇందీ గ్రంథాంతరమున్నది. 1a సూర్యదండకము.

పూర్వము వోలె.

గ్రంథాంతమున—"శ్రీకరాయదంతి చర్మచేలినే నమశ్శివాయ" అను శివస్తుత్యాత్మకశ్లోకములు గలవు.

## No. 2035. హనుమద్దండకము.

## HANUMADDANDAKAMU.

**Substance, palm-leaf. Size, 12¾ × 1 inches. Pages, 39. Lines, 4 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair, but full of mistakes.**

Complete.

Written in praise of Āñjanēya. The author is one Vāsudevakavi of Cilmakūru, son of Gagganāmātya.

**Beginning :**

దం॥ శ్రీరామనామామృతస్వాదులీలావిలాస స్ఫురద్వజ్ర సంకాశ దేదీప్యగాత్రా లసద్బాల భానుప్రభాశోభితా లిప్తసంవర్తనేత్రా జగత్ప్రాణపుత్రా మునిస్తోత్రపాత్రా సుచారిత్ర నీనుస్థిరానంద సౌజన్యసత్కీర్తి సత్యవ్రతానేక సుజ్ఞానముల్ ప్రస్తుతింపంగ నేనెంత కారుణ్యవంతా మహాశౌర్యవంతా హనూమంత నీమూర్తివంతంబపేక్షించి నా నేర్చుచందంబున న్నీకుఁ బుష్పోపహారంబుగా దండకం బొక్కటింజెప్పి యర్పించెదం గాచి రక్షింపుమీ దీనరక్షామణీ ధీమణీ నీవ్రతాంబు లోకైక విఖ్యాతజాతంబు.

**End :**

లక్ష్మణప్రాణసంరక్షణోపాయ సంజీవిరాయా కనద్వజ్రకాయా యహోరామమూర్తివ్డిం గ్రామ సంహార్యశిక్షచేయ ? పూజావిధేయాయటంచున్——

**Colophon ;**

చమత్కారభాషా విశేషోన్నతిం బర్షిగావించె యార్వేల వంశాబ్ధిచంద్రుండు నా కీర్తిచే గౌతమాఖ్యర్షగోత్రంబు నన్నెన్నికైనట్టి (చిల్మకూరి ?) జగ్గనామాత్యపుత్రుండు కారుణ్య లబ్ధానుసారుండు విద్వజ్జనానంద సేవాధురీణుండు వాసుదేవుండు ఈ దండకం బుర్విలోనెవ్వరున్ వ్రాసి వాచించినన్ వీనులన్విన్న సర్వంకషప్రజ్ఞచే నిర్వక్ర శక్రోన్నతిన్ ఆయురారోగ్య వైభవోపేతులైయుందురా సొంపుమీఱంగ శ్రీరామదాసాయ శోల్లాసదేవా నమస్తే ఆంజనేయా నమస్తే నమస్తేనమః.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁతతిన్ననిదే. కాని తప్పులు చాలఁగలవు.

ఆంజనేయస్తుతియందలి విషయము——చందస్సు, భాష, దోషభూయిష్టము. ఆర్వేలనియోగి జగ్గనామాత్యపుత్రుఁడునగు చిల్మకూరి వాసుదేవ కవి దీనికిఁ గర్త.

---

## No. 2036. హనుమద్దండకము

## HANUMADDANDAKAMU.

**Substance, palm-leaf. Size, 13¾ × 1½ inches. Pages, 36. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.**

Complete.

Same work as the above.

(వి-వి).—

సమగ్రము. వ్రాత మంచిదికాదు తప్పులు చాలఁగలవు శైథిల్యము చాలఁగలదు. గ్రంథపాతములు చాలఁగలవు.

పాఠభేదములు చాలఁగలవు గాని, అయినను ఇది పూర్వపక్షతమే.

---

## No. 2037. హనుమద్దండకము.

## HANUMADDANDAKAMU.

Substance, palm-leaf. Size, $16\frac{7}{8} \times 1\frac{3}{8}$ inches. Pages, 17. Lines, 6 and 7 on a page. Character, Telugu. Condition, injured, Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 29a. The other works herein are Patalu 5a, 25a, 38a, Rāmēśalingadanḍakamu 19*a*, Kuravanji 21a.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె.

ఇందలి గ్రంథాంతరము లివి—

5a, 21a, 38a పాటలు వగైరా, 19a రామేశలింగ దండకము, 21a కురవంజి.

---

## No. 2038. హనుమద్దండకము.

## HANUMADDANDAKAMU.

Substance, palm-leaf. Size, $12\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches. Pages, 6. Lines, 5 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete.

Similar to the work described under No. 2035 ante.

**Beginning :**

శ్రీమన్మహావీర గంభీర రుద్రావతారా తుషాద్రిధీరా కపిశ్రేష్ఠ రామేష్ట సుగ్రీవ సఖ్యా ప్రభాకాంచనాంగా కటిస్థోడుసంఘా కఠోరాట్టహాసా.

**End :**

నాదుదేహంబులోఁ బుట్టియున్నట్టి దుష్పీడలెల్లన్ నివర్తించి యారోగ్యముల్ ఇచ్చి శ్రీరామపాదాబ్జముల్ మీఁద సద్భక్తిసంధించుటంజేసి రక్షింపవే . . . ఆ మహా

తారకంబైన యీదండకం బెవ్వఁడైనన్ ప్రదికాలంబులన్ శిష్టుఁడై నిష్ఠుఁడై భక్తిఁ బారాయణం జేయువారెవ్వరో అట్టి పుణ్యాత్మకుల్ కోర్కెలీడేరు నాచంద్రతారార్కముగా పాహిపాహీ నమస్తే నమస్తే సమస్తాపరాధం క్షమస్వా భజామీ భజామీ !

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులు చాలఁగలవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

ఆంజనేయస్తుతి యందలి విషయము. కర్త పేరెఱుఁగరాదు. ఇది నెం 2035 రున వర్ణితమగు దానిఁబోలిన దే !

---

## No. 2039. హనుమద్దండకము.

## HANUMADDANDAKAMU.

**Substance, palm-leaf. Size, 12¾ × 1½ inches. Pages, 8. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair not free from mistakes.**

Begins on fol. 3a. The other work here in is Śivadaṇḍakamu 1a.

Complete.

Same work as the above.

**Beginning :**

శ్రీమన్మహావీర గంభీరరుద్రావతారాతుషారాద్రిధీరాకపిశ్రేష్ఠదామేష్ట సుగ్రీవ సఖ్యా ప్రభాకాంచనాంగా కటిన్యస్తమసమా కటోరాట్టహాసా అజాండస్థ కేశాచలద్వాల కాలా భ్రమచ్చక్రవాళా కనర్థంత నిర్ఘాతకాలాగ్రదండా తృణీభూత నిర్ణీత సంతోషితానేక గీర్వాణపక్షా సుపక్షాల సద్వాలకాయా

**End :**

నాదుదేహంబులో పుట్టియున్నట్టి దుష్పీడలెల్లన్ నివర్తించి యారోగ్యముల్యిచ్చి శ్రీరామ పాదాబ్జముల్మీది సద్భక్తి సంధించుటన్ జేసి రక్షింపుమీ (మాతులినిమతి ?) యామహీతారకంబైన నీదండకం బెవ్వరైనన్ ప్రదికాలంబులన్ శిష్టులై నిష్ఠులై భక్తిఁ బారాయణం జేయువారెవ్వరో అట్టి పుణ్యాత్మకుల్ కోర్కెలీడేరు నాచంద్రతారార్కముగా పాహిపాహీ నమస్తే నమస్తేనమః! సమస్తాపరాధం క్షమస్వా భజామీ భజామీ !

(వి-వి).—

సమగ్రము. వ్రాంత మంచిది.. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

దండకమిది ఆంజనేయస్తోత్రాత్మకము. కర్త పేరెఱుఁగరాదు. ఇం దీగ్రంథాంతర మున్నది. 1a శివ దండకము.

## No. 2040 హనుమద్దండకము.

## HANUMADDANDAKAMU.

Substance, palm-leaf. size, $16\frac{1}{4} \times 1\frac{1}{2}$ inches. Pages, 4. Lines, 6 on a page. Character. Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Begins on fol, 1a. The other works herein are Bhārata Sāvitri 3a, Hēlāpurisantānagōpāladēvālayavarnana 5a. Mahānavami padyamulu 7a. Bhāgavatamu 13a.

Complete.

Similar to the work described under No. 2035.

**Beginning:**

ప్రసన్నాంజనేయం ప్రభాదివ్యకాయం ప్రకీర్తిప్రమేయం ప్రశస్తప్రథాయం భజే వాయుపుత్రం భజే వాలగాత్రం భజే సూర్యమిత్రం భజే రుద్రరూపం భజే బ్రహ్మతేజం బటంచుం ప్రభాతంబు సాయంత్రి నీనామ సంకీర్తనల్ సేయ

**End:**

భానుకోటిప్రభాభాసితంబైన నీదివ్యతేజంబునన్ జూచితే దుందుభుల్ మ్రోయునె తుంబురుల్ పాడుచున్ రంభయు న్నాడుచున్ దార నాముద్దు నరసింహ నీకోర్కు లీడేర్తు నంచేలు నాస్వామి నీకున్నమస్తే సదాబ్రహ్మచారీ మహావాయుపుత్రా హనూమంతమిత్రా ? నమస్తే నమస్తేనమః.

(వి.వి.)—

సమగ్రము. వ్రాంత మంచిది. తప్పులు చాలఁగలవు. శైథిల్యము లేదు. గ్రంథ పాతములు లేవు.

ఆంజనేయస్తుతి యిందలి విషయము. కర్త నరసింహ మేమో!

ఇందలి గ్రంథాంతరము లివి: 3a భారత సావిత్రి, 5a హేలాపురీ సంతాన గోపాల దేవాలయ వర్ణనము, 7a మహానవమి పద్యములు, 13a భాగవతము.